# పెరిగే పిల్లలకి కావాలి కాంప్లాన్

**ఒక్క కాంప్లాన్ మాత్రమే ప్రతిరోజు వారికి అవసరమయ్యే 23 అత్యావశ్యక పోషకాహారాలను కలిగియున్నది.**

పిల్లల్లో పెరుగుదల సామాన్యంగా 15-16 ఏళ్లొచ్చేసరికి ఇంచుమించు ఆగిపోతుంది.
పెరుగుదలకు నేరుగా తోడ్పడే పోషకాంశాలు ప్రోటీన్లు
అందుకే మీ పిల్లలకు కావాలి కాంప్లాన్ ఇప్పుడు.
కాంప్లాన్‌లో అత్యుత్తమ ప్రోటీన్ - పాల ప్రోటీన్ (20%) ఉన్నది. అంతే కాకుండా, దీనిలో 22 ఇతర అత్యావశ్యక పోషకాహారాలు కూడా ఉన్నాయి.
కాంప్లాన్ - నోరూరించే రుచులలో లభిస్తుంది.




**23**

**అత్యావశ్యక పోషకాహారాలు ఆరోగ్యబద్ధమైన పాళ్లలో**

| | |
|---|---|
| ప్రోటీన్ | రిబోఫ్లెవైన్ |
| ఫ్యాట్ | నికొటినమైడ్ |
| కార్బోహైడ్రేట్ | కాల్షియం |
| కాల్షియం | పాంటొథెనేట్ |
| ఫాస్ఫరస్ | కొలిన్ |
| సోడియం | పైరిడాక్సిన్ ($బి_6$) |
| క్లోరైడ్ | విటమిన్ ($బి_{12}$) |
| (సి ఎల్ రూపంలో) | ఫొలిక్ |
| పొటాషియం | ఆసిడ్ |
| ఐరన్ | విటమిన్ సి |
| అయొడిన్ | విటమిన్ డి |
| విటమిన్ ఎ | విటమిన్ ఇ |
| విటమిన్ $బి_1$ | విటమిన్ కె |

పాలు కలపనవసరం లేదు.



## కాంప్లాన్® – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

GX/35/244 TEL

ఉంటుందని తెలిసి కూడా ప్రధాని మనుషులు చెపుతున్న ఈ నూతన అభివృద్ధి పథం ఏమిటి? ఈ దేశంలో పైకి వెళుతున్నదేదయినా ఉంటే అది ధరల గ్రాఫు మాత్రమే. కరువు సూచనయినా కనబడక ముందు నుంచీ, గత ఏడాదిన్నరగా ఈ ధరలు మరింత మరింతగా పెరిగిపోతున్నాయి. ప్రణాళికా సంఘం లక్ష్యాలను బట్టి చూసినా 1983 నుంచి ఇప్పటికి మనం కనీసం 4 కోట్ల టన్నుల ఆహార ధాన్యాలను నష్టపోయాము. పారిశ్రామిక రంగంలో, విదేశీ వాణిజ్యంలో తిరోగమనం ఉంది. రూపాయి దాని విలువలో 40శాతాన్ని నష్టపోయింది. మన విదేశీ ఋణం 50శాతం పెరిగిపోయింది. ఇదంతా కూడా ప్రధాన మంత్రి తమ ప్రభుత్వం విజయాలు సాధించిందని ప్రగల్భాలు పలుకుతున్న సమయంలో నే!

కానీ మన ఆర్థిక నిపుణులని చెప్పుకుంటున్న వాళ్ళ సంగతేమిటి? హఠాత్తుగా మౌన వ్రతంలోకి వెళ్ళిపోయినట్టు కనిపిస్తున్న ఎల్ కె ఝా ఎక్కడ? మన పారిశ్రామిక పెరుగుదల సూచి ఎప్పుడూ కావలసిన దానికంటే తక్కువే ఉండడంతో ఝా, ఇతరులు మరొక సూచిని తమంతట తామే తయారు చేశారు. కాని అది కూడా విఫలమైనట్టుంది. ఈ సూచి ప్రకారం కొన్ని నెలల క్రితం మన పెరుగుదల రేటు ఒకో సంవత్సరం క్రిందటి అదే నెల కన్న 13 శాతం ఎక్కువ మన పారిశ్రామిక వేత్తలకి ఇది ఒక క్రొత్త వార్తలా ఉండి ఉండాలి ఎందుకంటే గత వారం వాళ్ళు క్రొత్త ఢిల్లీలో ఒక సమావేశం ఏర్పాటు చేశారు. అక్కడ వాళ్ళు అతి సమృద్ధిని కాక పరిశ్రమలలో మందకొడితనాన్ని గురించి చర్చించారు. ఆ సమావేశంలో ఝా పాల్గొన్నారో లేదో నాకు తెలియదు. కాని ఆయన పాల్గొని ఉంటే తన మిత్రులకు ఏం సలహా ఇచ్చారో తెలుసుకోవాలని ఉంది.

వాస్తవానికి ముసుగులు కప్పి చూపెట్టే ప్రయత్నం ఎప్పుడూ ఉద్దేశ్య పూర్వకంగానే జరుగుతుంటుంది. కాని నిజంగా అబద్ధాలు చెప్పకుండా ఆ పని చేయడం ఒక ఎత్తు నిజమైన అంకెలేవీ లేనట్టు ప్రవర్తించడం, తప్పుడు అంకెలు తయారు చెయ్యడం మరొక ఎత్తు ఉదాహరణకు మన విదేశీ ఋణం 25,000 కోట్ల రూపాయలని మనకు పదే పదే చెపుతున్నారు. అసలు ఋణం ఇంతకు రెండింతలని మొత్తం ప్రపంచానికి తెలుసు. ఐతే ఈ చిన్న అంకెలను సమర్థించే తెలివైన ప్రభుత్వాధికారులు మనకున్నారనుకోండి. కాని ఋణం వంటి విషయాలలో తెలివి చాలా ప్రమాదకరమైనది. అధ్యక్షుడు రీగన్ ఏడు సంవత్సరాల పాటు, అంటే మన స్వంత రీగన్ అభిమానులు మనను మాయ చేసిన కాలంలో రెట్టింపు కాలం, ప్రజలను క్రమబద్ధంగా మాయ చేసి ఈ విషయం కనిపెట్టాడు ఇన్నాళ్ళూ రీగన్ తమకు అబద్ధాలు చెపుతున్నాడని అమెరికన్‌లు గుర్తించారు. కొన్నేళ్ళుగా ఆయన అమెరికన్ ఆర్థిక వ్యవస్థ ప్రపంచంలో కెల్లా అత్యున్నత స్థానంలో ఉన్నదని చెప్పాడు. నిజానికి ఆయన పాలనా కాలంలో ఋణం భయం గొలిపే స్థాయిలో పెరుగుతూ వచ్చింది. దేశంలో ఉన్న వనరులను మించిన ఖర్చుతో ఆయన ప్రభుత్వం నడిచింది. 1984 నుంచి మన ప్రభుత్వం కూడా అదే విధంగా నడిచింది. కాని ఇప్పుడిక వాస్తవాలు బయట పడుతున్నాయి. మాజీ హాలివుడ్ నటుడు నటనను హఠాత్తుగా విరమించక తప్పడం లేదు.

మనకు ప్రభుత్వంలో చాలా మంది గోబెల్స్ లున్నారు. మనకున్న వాళ్ళలో చాలా మంది ఒక్క కనుసన్నతో నే గుడ్డి వాళ్ళయిపోయినట్టు నటిస్తారు. పెద్దల దగ్గరి నుంచి దొరికే కొన్ని ఎంగిలి మెతుకుల కోసం చెప్పిన చోటల్లా సంతకం పెట్టడానికి ఎంతమాత్రం వెనుకాడరు. ఇక్కడ కూడా వాస్తవాలు బైట పడే రోజొచ్చినప్పుడు వాళ్ళేం చేస్తారో నాకు తెలియదు. కాని అప్పటికి వాళ్ళు ఇంకా కొన్ని తాజా ప్రాంతాలకి మేతకి వెళ్తారేమో....!! □






## శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయితలు, రచయిత్రులు, ఏజెంట్లు, ప్రకటనకర్తలందరికీ క్రిస్మస్ శుభాకాంక్షలు. -సం.

## సీరియల్స్

డి. ఎస్. పి విజయ్ సీరియల్ మాటల్లో చెప్పలేనంత బాగుంది. విజయ్ తల్లి, కొడుకుకి జ్వరం వచ్చిందని టూర్ కెళ్లడం మానకుండా, తిరిగి నేను వూర్లో వుంటే ఇంతకన్నా ఏం చేస్తాను అనే కసాయి తల్లులుంటారని నేనింత వరకు ఊహించలేదు. –చలపాక ప్రకాష్, విజయవాడ

★ ★ ★

శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా వుంది. "డి. ఎస్. పి. విజయ్" సీరియల్ చాలా చాలా బాగుంది. "మంజీరనాదం" సీరియల్ అద్భుతం.

కె. సత్యనారాయణ, పెనుగొండ

★ ★ ★

"డి యస్. పి. విజయ్" సీరియల్, చాలా బాగుంది. చదువుతున్న కొద్ది చాలా హుషారుగా ఉంటోంది. తరువాత పత్రిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాము. ఈ తరం యువతి సీరియల్ కూడా మమ్మల్ని ఆకట్టుకుంది.

షేక్ బాబావలి, అనుపాలెం

★ ★ ★

"మంజీరనాదం" సీరియల్ రసవత్తరంగా సాగుతున్నది. ఒక్కో పాత్ర ఒక్కో దశాబ్దం మా హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోతాయి. ముఖ్యంగా చందనపాత్ర చిత్రణ అత్యద్భుతం భగత్, రాజాపాంధుల పాత్రలు వెరైటీగా వున్నాయి శ్రీ పాద శ్రీనివాస్, బొబ్బిలి

★ ★ ★

మంజీర నాదం సీరియల్ అద్భుతంగా ఉంది. ఇటువంటి సీరియల్‌ను అందిస్తున్న రచయిత్రి రావినూతల సువర్ణాకన్నన్‌గారికి నా కృతజ్ఞతాభినందనలు.

మాచిరెడ్డి మాలతీ లత, అనంతపురం

★ ★ ★

సీరియల్స్ 'ఈ తరం యువతి' 'రేపటి మహిళ' ఉత్సుకతతో చదివిస్తున్నాయి.

"మంజీరనాదం" ఆకట్టుకుంటుంది.

కీర్తి కిష్టయ్య, రామవరం

★ ★ ★

27-11-87 సంచికతో వెలువడిన 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' చాలా బాగుంది. ఇందులోని సీరియల్స్ "ఈ తరం యువతి", "మంజీరనాదం", "డి ఎస్. పి. విజయ్" చాలా ఆసక్తిదాయకంగా ఉన్నాయి. రచయిత (త్రు)లకి ధన్యవాదాలు–

ఎస్. సాయి ప్రసాద్, ఖరగపూర్

★ ★ ★

"ఈ తరం యువతి" సీరియల్ బాగుంది. వారం వారం ఆకట్టుకుంటున్నది. మృదుల పాత్ర సూపర్. రవికాంత్ కోరిక నెరవేరాలని కోరుకుంటున్నాను.

ఎ. సురేష్‌కుమార్, హైదరాబాద్

★ ★ ★

"రేపటి మహిళ" లాంటి వెరైటీ సీరియల్ అందిస్తున్న ఆనందరామం గారికి నా ధన్యవాదాలు. అలాగే "మంజీరనాదం" కూడా చాలా బాగుంది.

పి యన్. ప్రసాద్, కార్వార్ (కర్నాటక)

## కథలు

"జీవచ్ఛవం" కొచ్చెర్లకోట వెంకటసుబ్బారావుగారి కథ నన్ను కదిలించి వేసింది కథ చదువుతున్నంత సేపూ గుండెల్లో గునపాలు దిగుతున్నట్టుగా అనిపించింది పరంధామయ్యగారి పరిస్థితి హృదయం ద్రవించి, కన్నీటి రూపాన్ని దాల్చింది.

రచయిత కథ చివర్లో వచించిన మాటలు అక్షర సత్యాలు.

ఐరేని శ్రీనివాస్, గౌడ్ రామాయంపేట

★ ★ ★

## వ్యాసాలు

శ్రీదేవి ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో – గత రెండు నెలలుగా మనం పోగొట్టుకున్న మహా మహులు డా. దాశరథి, శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, క్రికెటరంగంలో మరుపురాని వ్యక్తి విజయ్ మర్చంట్‌ల కాలధర్మాల గూర్చిన వ్యాసాలు చదువుతున్నప్పుడు మా కళ్ళు చెమర్చాయి

–"బాసంశెట్టి బ్రదర్స్" గుంటూరు

## నాటిక పోటీలు

సాహితీ సాంస్కృతిక సంస్థ "రసమయి" చతుర్థ వార్షికోత్సవాల సందర్భంగా 1988 మార్చి 9వ తేది నుండి 12వ తేది వరకు అఖిల భారత స్థాయిలో తెలుగు నాటిక పోటీలు, సత్య హరిశ్చంద్ర "కాటి సీను" సన్నివేశం పోటీలు నిర్వహించేందుకు సంస్థ కార్యవర్గం నిర్ణయించింది. 13వ తేదీన "రసమయి" చతుర్థ వార్షికోత్సవ వేడుకలు "విశిష్ట వ్యక్తి"–1987, అవార్డు ప్రదానము మరియు తృతీయ తెలుగు సినిమా అవార్డులతో బాటు, నాటికల పోటీలలో విజేతలకు కూడా బహుమతులు ఇవ్వడం జరుగుతుంది. వివరాలకి చివుకుల రామేశ్వర్, ప్రధాన కార్యదర్శి, రసమయి, 14-10-77, మారీసు పేట, తెనాలి అన్న చిరునామాకు రాయవచ్చు □


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు ·
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు · (1938-1972)

25-31 డిసెంబర్, '87
శ్రీ ప్రభవ నామ సం పుష్య శు. పంచమి

సంపుటము 80 : సంచిక 18

ముఖ్య సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75. |
| పోస్ట్‌లో 6నెలల చందా | రు. 80.60 |
| పోస్ట్‌లో 12నెలల చందా | రు. 161.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి కల్పన
(ఫొటో : ఈశ్వరి)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :

సీరియల్

# ఆడపిల్లలు-అనుభవాలు

హరికిషన్

(గతసంచిక తరువాయి)

## ప్రేమ బెడిసింది :

రామకృష్ణా మిషన్ ప్రాంతం, బీచ్‌లో జగదీష్ ఒక్కడే కూర్చున్నాడు. సుసంపన్నమైన మేధాశక్తి. ఎప్పుడూ కాలేజీలో, చదువులో, ర్యాంక్‌లో వన్ ఇన్ త్రీ. వయస్సు పాతికే అయినా ఆలోచనలూ, విచక్షణాజ్ఞానం పదునైనవి. సూపర్‌స్టార్‌లాంటి డెకరేటివ్ నేచర్ లేకపోయినా, టకప్‌లో శ్రద్ధ చూపిస్తాడు. ఉన్నంతలో నీట్‌గా ఉంటాడు. ఆశ ఉన్నది, అడియాశలేదు. అతనితో ఎవరూ తగాదా పెట్టుకోరు. ఎందుకంటే దాని ప్రభావం తన భవిష్యత్తుమీద దెబ్బ తీస్తుందేమోననే భయం.

యూనివర్సిటీలో ఎమ్.కాం. ఫైనల్ చేస్తున్నాడు. భవిష్యత్తుని గురించి ఊహాలోకంలో విహరించకపోయినా ఆ ఊహాలోకపు అంచుమీద నించుని చూస్తుంటే పావర్టీమీద ఆ అనుభూతి టానిక్‌లా పని చేస్తుంది. ఆసుకవి కాకపోయినా, కాసుకవి అవుదామనే కోరిక లేకపోయినా, చిన్న చిన్న గేయాలు చెప్పి పిప్పరమెంటు బిళ్ళల్లా, పంచదార పానకంలా, ఐస్‌క్రీం, ఫ్రూట్‌సాలడ్‌లా వినేవారికి విందు చేస్తాడు.

అన్నంలోకి కూర లేకపోయినా సహిస్తాడుకాని గడ్డంమీద రేజర్ లేకపోతే సహించడు. నిత్య గడ్డం నునుపాభిలాషి. ఈ బిరుదుని అతని సిస్టర్ శ్రీవిద్య ఇచ్చింది. ఆ అమ్మాయి ఇంటర్ చదువుతోంది

జగదీష్ బీచ్‌లో చదువుకుంటూ కూర్చున్నాడు. మధ్య మధ్య ఊహాలోకపు కలలు. అతను కనే కలల్లో ప్రేయసి ఉండదు. కాలేజి లెక్చరర్, ప్రిన్సిపాల్, ప్రొఫెసర్, రీడర్, ఐ. ఎ. ఎస్. సబ్ కలెక్టర్, సెక్రెటరీ, వేరుశనగపప్పులూ, బఠాణీలూ, అతని పాకెట్ స్నేహితులు. రత్న గుళికలు. ఆ రోజు ఆదివారం. అభిలాష్ వచ్చాడు.

"ది గ్రేట్ గ్రాండ్ స్టైలిష్డ్ సూపర్ హీరోకి ఈ విశాఖ బీచ్ స్వాగతం పలుకుతున్నది" అన్నాడు జగదీష్.

ఎదురుగా కూర్చున్నాడు అభిలాష్.

"ఒరేయ్, మనిషి పుట్టింది మానులా ఎదగటానికి కాదోయ్. సంస్కార భావాలతో, సాంప్రదాయపు వొరవడిలో అందర్నీ కవ్విస్తూ, అందర్నీ మెప్పిస్తూ, మనస్సుని మనస్సులో విలీనం చేసి వయస్సుని వయస్సుతో పలకరిస్తూ, ప్రేమాంతర వివాహానికి పెద్ద పీట వేసి, అనుభవ పారవశ్యంలో అమరలోకపు పొకడలతో మునిగితేలుతూ ఉంటే, ఒరేయ్ జగదీష్, ఈ జీవి ఇంతకన్నా కోరేది ఏమున్నది? చెప్పరా, బ్రూటా, తీటా, వాటా, నాటా, స్టుపిడా, ఇడియట్టా" అన్నాడు గడగడ చెప్పేశాననే ధీమాతో అభిలాష్.

"అభిలాష్! నీ మాటలకన్న ఈ సముద్రపు హోరు హాయిగా ఉన్నదిరా, ఆంధ్రా యూనివర్సిటీ ఎమ్మే తెలుగు మెయిన్, ఫస్ట్ ర్యాంక్ స్టూడెంట్‌కి కూడా నీ భాష, భావం అర్థం కాదు. ఇంతకీ నీ బాధ ఏమిటో వ్యవహారిక భాషలో చెప్పి నాచేత నీరాజనాలు అందుకో" అన్నాడు జగదీష్.

స్టైలిష్‌గా నవ్వేడు అభిలాష్.

"చూడు మిస్టర్, ఎన్ని మార్కులు సంపాదించావ్ అనేది పాయింట్ కాదు. ఎందరి హృదయాన్ని చూరగొన్నావ్ అనేది కావాల్సిన సబ్జెక్ట్. వాంటెడ్ మిస్చీఫ్ అనేది మోసం, క్రియేటివ్ సస్పెన్స్ అనేది మనిషిని విభ్రాంతిలోకి తీసుకురావటం. దానిపేరే క్రియేటివ్ జోక్" అన్నాడు అభిలాష్.

"పీఠిక ఉపోద్ఘాతం చెప్పక డైరెక్ట్ నవల అన్నట్టు డైరెక్ట్‌గా చెప్పెయ్" బఠాణీగింజ నోట్లో వేసుకున్నాడు.

"మా ఫాదర్ బర్త్‌డేకి నిన్ననే సత్యభామనీ, సావిత్రినీ ఇన్వైట్ చేశాను. బర్త్‌డే ప్రెజెంటేషన్ తీసుకుని నిన్న సాయంత్రం ఆరు గంటలకు, ఆ అమ్మాయిలు విచ్చేశారు" సముద్రపు అలల్ని చూస్తూ కూర్చున్నాడు.

"వాట్ వండర్, మరి ఫంక్షన్‌కి నన్ను పిలవలేదేం నేస్తమా"

దూరాన హార్బర్‌లో స్టీమరు, బైనాక్యులర్స్‌లో నుంచీ చూస్తున్నాడు అభిలాష్.

"క్రియేటివ్ సస్పెన్స్ అంటే అదే, అసలు నిన్నటిరోజు మా ఫాదర్ బర్త్‌డే కానేకాదు. కాని వాళ్ళు నమ్మి మర్యాద కోసం వచ్చారు" అన్నాడు అభిలాష్.

"డర్టీయాస్, దీన్నే ఫస్ట్ వండర్ ఆఫ్ ది మిస్చీఫ్ అంటారు. నిన్ను 'ఏ' వన్ జెంటిల్‌మెన్‌గా భావించి ఉంటారు. చాలా గొప్ప ఇడియట్ కూడా చెయ్యని తప్పు చేసేవ్" కోపంతో అన్నాడు జగదీష్

"తప్పు కాదోయ్ అప్పలసామీ, మా అమ్మ మనస్సుకు దగ్గరవటానికి, ఓ చిన్న తమాషా."

"ఆడపిల్లల జీవితాలు అంత ఆషామాషీగా ఉన్నయ్యా"

"ఆషామాషీ కాదు, అమితభాషీగా ఉండాలనేదే నా కోరిక, కల, అభీష్టం" అన్నాడు నిశితంగా చూస్తూ.

"అబద్ధం చెప్పి ఆడపిల్లల్ని మీ ఇంటికి పిలిపించుకోవటంలో నీ ఉద్దేశ్యం."

"నేను ఎంచుకోబోయే జీవిత భాగస్వామిని మా వాళ్ళకు చూపించటానికి "

"అంటే ఆ ఇద్దర్లో ఎవరయినా నీకు ఇష్టమేనా, వాళ్ళు ఇష్టపడ్డారా"

నవ్వేడు బెల్ట్ సరిచేసుకుంటూ

"సూటింగ్స్, షర్టింగ్స్ గుజరాత్ మిల్లు వాళ్ళవి ఎడ్వర్టయిజ్‌మెంట్లు చూశావా"

"చూస్తున్నాను, చూశాను, చూడబోతాను. అలాంటి ఎడ్వర్టయిజ్‌మెంట్ హీరోలా ఉన్నావని, నాకు తెలుసునని నీకు తెల్సునని నాకు తెల్సు" తనూ నవ్వేడు. బైనాక్యులర్స్ తీసుకుని చూసేడు. దూరాన ఆంగ్లో యిండియన్ లేడీ కనిపించింది.

"సిగ్గుని దాచినప్పుడే సంస్కారం కనిపిస్తుంది. సిగ్గు నగ్నంగా ఉంటే దయ్యం పట్టిందనుకుంటారు" అన్నాడు కోపంతో జగదీష్ ఏదో వింత కనిపిస్తే అట్లా అన్నాడని గ్రహించాడు అభిలాష్. తనూ బైనాక్యులర్స్‌లో చూసేడు

"ఓ, అజంతా శిల్పాలు, కుడ్య చిత్రాలు, నిమ్నోన్నతాలు, ఉన్నతం, ఉత్తమ జాతి స్త్రీ లక్షణం" అన్నాడు అభిలాష్

"అభిలాష్, మనిషి క్కావల్సింది సెక్సూ, సెక్సు ఊహలూ కాదురా, ఈ ప్రపంచంలో జీవించటం నేర్చుకోవాలి. శారీరక సుఖం అనేది, వాంఛ అనేది

జరిగిన కథ 1: గోపాలరావు కూతురు సత్యభామ, ఆమె స్నేహితురాలు సావిత్రి. సంపన్నురాలయిన సత్యభామ, నిరుపేద సావిత్రిలలో ఎవరినైనా పెళ్ళి చేసుకోవాలని తనకు కోరికగా ఉందని చెప్పాడు దశరథరామయ్య కొడుకు అభిలాష్.

జీవితంలో ఒక మైనర్ అయిటం, స్త్రీ పురుష సంయోగ సుఖానికే జీవితంలో ఇంపార్టెన్స్ ఇవ్వాలనే ధ్యేయం మంచిది కాదురా" అన్నాడు. అతని మనస్సులో భావాలు మరో తీరుగా ఉన్నయ్యి

"పోరా, ఛైర్మన్ ఆఫ్ ది చాదస్తుల ఎసోసియేషన్. నాకు డబ్బున్నది, చదువున్నది, వయస్సూ, అందమూ, స్టైలూ ఉన్నది. నేను పెళ్ళి చేసుకోవాలని డిక్లేర్ చేస్తే ఆడపిల్లల తండ్రులు క్యూలో నిల్చుంటారు. కాని అది నా ఉద్దేశ్యం కాదు, ఐ వాంట్ టు మ్యారీ వన్ ఆఫ్ ది టూ" అన్నాడు ధీమాగా అభిలాష్.

"బ్రదర్, డబ్బు చూసీ. నీ అందం చూసీ, నీ గుణగణాలు తెలీనివాళ్ళు నిన్ను చేసుకోవచ్చురా. కాని ఆ ఇద్దర్లో ఎవరూ నిన్ను భర్తగా స్వీకరించరు."

ఈ మాటకు ఉగ్రుడైపోయాడు అభిలాష్. "నేను బిచ్చగాడినా, రౌడీనా డ్రింకర్స్‌నా" కోపం ఉవ్వెత్తున లేచింది.

"ఏదీకాదు, నువ్వు సకల సద్గుణ సంపన్నుడివి. డబ్బు గోత్తాలతో ఉన్నది. కాని రెండు విషయాల్లో నువ్వు గోల్డ్ మెడలిస్టువి. ఒకటి నీకు తోచదు, రెండు ఒకరు చెపితే నచ్చదు" అన్నాడు జగదీష్

ఉత్తుంగ తరంగాలు. నురుగులు కక్కే అలలు, ఉవ్వెత్తున లేచి బండరాళ్ళను ఫెడేల్‌మని ఢీకొన్నాయి. జగదీష్ రెండు దవడలూ వాయించాడు



# అమెరికా నుంచి రష్యాకి నడిచిన ఏకైక వ్యక్తి

పాశ్చాత్య దేశాలలో సాహసయాత్రలు చేసే వారికి కొదవలేదు కర్నల్ రస్సెల్ ఫార్నమ్ అనే అమెరికాలోని న్యూహాంప్ షైర్‌కి చెందిన వ్యక్తి సాహస యాత్రలో చరిత్ర సృష్టించాడు ఈయన 1812–13 మధ్య కాలంలో అమెరికా నుంచి రష్యాకి నడిచి వెళ్ళాడు. అమెరికాలోని మిస్సోరీ రాష్ట్రానికి చెందిన సెయింట్ లూయీ నుంచి ఈయన లో కయాత్ర మొదలు పెట్టాడు. మిస్సోరీ నదీ తీరం వెంబడే బయలుదేరి కొలంబియా నదిని తాకాడు. దాని తీరం వెంబడి వెళ్ళి పసిఫిక్ సముద్ర తీరం జేరాడు అక్కడ నుంచి అలాస్కా జేరుకున్నాడు. అక్కడ నుంచి మంచుతో నిత్యమూ గడ్డకట్టుకొని ఉండే బేరింగ్ జలసంధి మీదుగా సైబీరియా జేరుకున్నాడు అక్కడి నుంచి 1813లో రష్యన్ రాజధాని అయిన సెయింట్‌పీటర్స్‌బర్గ్ జేరుకున్నాడు. (దీనిని ఇప్పుడు లెనిన్‌గ్రాడ్ అంటారు)



ఇంతటి సుదీర్ఘమైన సంక్లిష్టమైన యాత్రను ఆయన కేవలం 20 పౌన్లు బరువున్న ఒకసామాను సంచితోనూ, ఒక తుపాకీతోనూ చేశాడు రస్సెల్‌కి అలనాటి జార్ చక్రవర్తి అయిన జార్-1 అపూర్వ స్వాగతం ఇచ్చి రెండు ఖండాల ఏకైక విజేత అన్న బిరుదం ఇచ్చి సత్కరించాడు అంతే కాదు. ఆయన రస్సెల్‌ను తన ఖర్చుమీద పారిస్‌కి అక్కడి నుంచి సెంట్‌లూయీకి తిరిగి వెళ్ళే ఏర్పాటు చేశాడు ఆ నాడు అమెరికా కాని రష్యా కాని అగ్రరాజ్యాలుకావు. కర్నల్ ఫార్నమ్ కేవలం కాలినడకతో ఈ రెండింటినీ కలపగలిగాడు మరి ఈ నాడు అగ్రరాజ్యాలుగా మారిన ఈ రెంటినీ కలపగలిగిన సమర్థుడెవరూ కనిపించడంలేదు ఇంతటి ఘనకార్యం సాధించిన ఫార్నమ్ 1932లో కీర్తిశేషుడయ్యాడు

–కె. ఆర్. కె. మోహన్

## ఆడపిల్లలు - అనుభవాలు

అభిలాష్ నిరుత్తరుడై చెంపలు అదిమి పట్టుకున్నాడు జగదీష్

"ఇడియట్, నీ మనస్సులో నామీద ఇంత కసి, కార్పణ్యం ఉన్నదని నేను ఊహించలేదు నామీద ఇంత నింద వేసినవాడివి, నన్ను బ్లాక్‌మెయిల్ చేసినా, ఆశ్చర్యపడక్కర్లేదు జగదీష్! ఆల్‌రైట్, నీ జీవితం సమస్యల పుట్ట, పేదరికపు కుటుంబంలో పుట్టి నానా అవస్థలూ పడుతుంటే నేను చేసే ఆర్థిక సహాయం, నీ దృష్టిలో నన్ను అసమర్థుడుగా మార్చివేసింది నేను బంగారపు చెంచా నోట్లో ఉంచుకుని పుట్టాను మిస్టర్, నేను బంగారపు పిచ్చికను నీమాదిరి చచ్చు సమస్యలు నాకు లేవు నేను కోరిన ఆ ఇద్దర్లో ఒకరిని పెళ్ళి చేసుకోలేకపోతే నీకు బూట్‌పాలిష్ చేసి, ఆ బూట్లని నా నెత్తిన పెట్టుకుని ఈ యూనివర్శిటీ కాంపస్‌లో ఊరేగుతాను మిస్టర్ జగదీష్! నువ్వు నన్ను బ్లాక్‌మెయిల్ చెయ్యి, వాల్‌పోస్టర్లు వెయ్యి, ఆర్టిస్టిక్‌గా గోడలమీద రాయించు నీ ఇష్టం బట్ ఈ విషయంలో నెగ్గుతాననే నా ఉద్దేశ్యం" అన్నాడు అభిలాష్ ఉద్రేకపడుతూ

జగదీష్ మాట్లాడలేకపోయాడు తల వంచుకున్నాడు కన్నీరే అతనికి బాసటగా నిల్చింది

"మిస్టర్ జగదీష్! వ్యక్తిగతంగా నన్ను ఇంతగా నువ్వు దూషించినా, నీ చదువుకు కావలసిన ఫీజులన్నీ నేనే కడతాను మాట తప్పను, వస్తాను" అని లేచి నిల్చుని ఇసక దులుపుకొని విసురుగా వెళ్ళాడు అభిలాష్

రాత్రి ఎనిమిది దాటేవరకూ కన్నీరు కారుస్తూ కూర్చున్నాడు జగదీష్.

ఇంటికి చేరేసరికి రాత్రి పదయింది ఇంకా కొడుకు ఎందుకు రాలేదా అని ఎదురుచూస్తూ కూర్చుంది తల్లి జగదాంబ. అన్నయ్య ఇంకా రాలేదేమా అని గుమ్మంవైపు చూస్తూ చదువుకుంటున్నది చెల్లెలు శ్రీవిద్య అతని ముఖ కవళికలు చూసి అర్థంకాక ఖంగారు పడ్డారు

"అట్లా ఉన్నావేంరా, ఏం జరిగింది" అన్నది జగదాంబ

"అన్నయ్యా చెంపలమీద కన్నీటి చారికలు. .." అన్నది శ్రీవిద్య

"ఏంలేదమ్మా, నేను బానే ఉన్నాను మనస్సుకు కాస్త కష్టం కలిగింది తప్పు నాదే ననుకో, నన్ను మాట్లాడించకండి భోజనం అక్కర్లేదు, జస్ట్ నన్ను నిద్రపోనివ్వండి" అన్నాడు బట్టలు మార్చుకుని పడుకున్నాడు ఎవరూ మాట్లాడలేదు

తెల్లవార్లూ మథనపడుతూనే ఉన్నాడు జగదాంబ కూడా మేలుకునే ఉన్నది ఆందోళన పడుతూ

తెల్లవారింది కాఫీ తెచ్చింది తల్లి మాట్లాడకుండానే కాఫీ తాగాడు మళ్ళీ అడిగిందావిడ

"అట్లా ఉన్నావేంరా, ఏం జరిగింది"

"ఏం లేదమ్మా, ఓ మంచి స్నేహితుడితో తో చని ఘర్షణ.

ఇద్దరి మనస్సులూ బాధ పడ్డాయి. ఆటలో అరటిపండు అనుకున్నాను. కాని క్రికెట్ బంతి విసురున వచ్చి నా ముఖాన తగిలింది. చాలా పెద్ద బొప్పి కట్టింది. తప్పు నాదేనమ్మా నాదే" అన్నాడు కళ్ళు తుడుచుకుంటూ

"ఎవరా స్నేహితుడు" ఆదుర్దాగానే అడిగిందావిడ.

"అభిలాష్"

విభ్రాంతితో చూసిందావిడ. స్థాణువులా నిల్చుండిపోయింది శ్రీవిద్య.

"కారణం" అన్నది శ్రీవిద్య

"స్వల్పం కాని మనస్సుకు బాగా పట్టింది" అన్నాడు

"నీకు ఇదేం దుర్బుద్ధిరా" అన్నది తల్లి

"దుర్బుద్ధి నాదే నంటావా అమ్మా, అభిప్రాయం చెప్పినంతమాత్రాన అదే దుర్బుద్ధి అనుకుంటే, అభిప్రాయం అనే మాటని డిక్షనరీలో నుంచే తీసి పారెయ్యాలమ్మా" అన్నాడు బాధగా చూస్తూ.

"సరే. విషయం చెప్పక్కర్లేదు. కోపం చల్లారేక అభిలాష్‌ని క్షమాపణ వేడుకో" అన్నది శ్రీవిద్య.

"నీ జీతాలూ. పరీక్ష ఫీజులూ అన్నీ అతను కడుతున్నాడు. ఈ ఒక్క సంవత్సరం పూర్తయితే మన కష్టాలు గట్టెక్కుతయ్యని వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంటున్నాను. నీకు ఇదేం పోయే కాలంరా, అని నువ్వు అంటావని నాకు తెల్సునమ్మా కాని సమయం, సందర్భం అటువంటిది నేను అతన్ని క్షమాపణ వేడుకోనమ్మా, తప్పు నాదే అయితే ఆ భగవంతుడు నన్నే శిక్షిస్తాడు" అన్నాడు జగదీష్.

"పోనీ నేను వెళ్ళి నీ తరఫున క్షమాభిక్ష పెట్టమని ప్రార్థించనా" అన్నది శ్రీవిద్య

"చెప్పరా, నేనూ వెళతానురా, బంగారు బాతును కత్తితో పొడిచావురా అప్రాచ్యుడా' అన్నదావిడ

అమ్మా, అప్రాచ్యుడా అన్నా, దుర్మార్గుడా అన్నా నేను సహిస్తానమ్మా, కాని నేను క్షమాభిక్ష కోరనమ్మా కోరను తప్పు ఎవరిదో కాలమే నిర్ణయిస్తుంది" అన్నాడు

"అంటే అతన్ని అంత దారుణమైన మాటలతో హింసించి మనస్సు గాయపరిచావన్నమాట నీకు నిజంగా చెడ్డ రోజులే వచ్చినయ్యిరా, అనుభవించు" అని కోపంతో అన్నదావిడ ఎవరూ మాట్లాడలేదు తల్లి అవతలకు వెళ్ళేక శ్రీవిద్య దగ్గరకు వెళ్ళింది

'అన్నయ్యా, మీ తగాదాకు కారణం" అన్నది.

'అహంభావం, అహంకారం"

'ఎవరికి"

"డబ్బు కలవారికి డబ్బు లేనివాడు ఉన్నవాడికి ఎప్పుడూ కూడా లోకువే" చిరగ్గా అన్నాడు

"ఈ పేచీకి కారణం చెప్పరాని రహస్యమా"

"ప్రేమ ప్రేమలో నుంచీ పుట్టలేదు అహంకారంలో పుట్టింది డబ్బుకూ, ఆస్తికీ ప్రేమ లొంగిపోదు ఇష్టతమీద కలిగేది ప్రేమ కాని, కష్టపెట్టి చూపించేది ప్రేమ కాదు మనిషిని మట్టికరపించటానికి పన్నిన పన్నాగం" అన్నాడు కోపంగా.

నవ్వింది శ్రీవిద్య ఇంకా నవ్వింది, పొట్ట చేత్తో పుచ్చుకుని నవ్వింది. నవ్వుతూనే ఉన్నది

"ఏమిటా నవ్వు సిగ్గు లేదూ" అన్నాడు తలవంచుకుని, కళ్ళు మూసుకున్నాడు

"అన్నయ్యా, అసలు ప్రేమ అనేది కాఫీ పొడిలోనుంచీ పుడుతుందని మా స్నేహితురాలు చెప్పింది ప్రేమకు అంకురార్పణ కాఫీ తాగేటప్పుడు జరుగుతుందిట. రెండోది ప్రేమ అనేది ఒక ముడి పదార్థంట దాన్ని అనేక విధాలుగా ఉపయోగించుకోవచ్చు ఈ రోజుల్లో ప్రతివాళ్ల దగ్గరా ఈ ముడి పదార్థం పేరుకుపోయి ఓ కాటేజ్ ఇండస్ట్రీస్‌గా తయారయింది కాని నిధుల కొరతవల్ల, లోన్స్ దొరక్క సత్ఫలితాల్ని ఇవ్వటం లేదు" అన్నది గుమ్మాన్ని ఆనుకొని శ్రీవిద్య

ఆశ్చర్యపోయాడు. పెదవి రాచుకుంటూ చూసేడు. మనస్సు తొలుస్తున్నది

"నువ్వు ఎవర్నయినా ప్రేమిస్తున్నావా" సందేహిస్తూనే అడిగేశాడు

"ఆదేమిటన్నయ్యా అట్లా అడుగుతావ్. ఇంటర్‌లో నా గ్రూప్ ఎల్ ఎం ఎల్ కదా"

"ఎల్. ఎం ఎల్లా, ఎం పి సి కదా, అసలు ఎల్ ఎం ఎల్ అంటే' మళ్ళీ నవ్వేసింది

"గొప్ప తెలివి తేటలే, ఎమ్. కాం చేస్తున్నావ్, ఆమాత్రం తెలీదూ, నీ కేసు ముందు చెప్పాలి. నా ఉద్దేశ్య ప్రకారం మీ ఇద్దరూ స్ట్రాంగ్‌గా ఒకే అమ్మాయిని ప్రేమించారా, ఎందుకయినా మంచిది, నీ నామినేషన్ విత్‌డ్రా చేసుకో, ప్లీజ్" అన్నది అనునయంగా చూస్తూ

"షటప్" అని కొట్టబోయాడు. శ్రీవిద్య అవతలకు పరుగెత్తింది.

పెరట్లోకి వెళ్లాడు జగదీష్

(ఇంకా ఉంది)

# అన్నపూర్ణ

## దేవినేని ఉష

అన్నపూర్ణకు మెలకువ వచ్చింది. చుట్టూ చూసింది తెల్లని గోడలు బెడ్‌లైట్ వెలుతురులో కనబడుతున్నాయి. గొంతు ఘంటగా ఉంది.

దాహంగా ఉంది

మంచం మీద నుండి లేవలేని అశక్తత తలతిప్పి చూసింది స్టూల్ మీద మంచి నీళ్ళు పోసి ఉన్న గాజు జగ్ కనిపిస్తోంది.

పెదవులు తడుపుకుంది. నాలుక మీద తడి లేదు

"రాధా!" ఎండిపోతున్న గొంతుతో అస్పష్టంగా పిలిచింది

జవాబు రాలేదు

అన్నపూర్ణ కళ్ళలో నీళ్ళు తిరిగాయి

మెల్లగా కుడిచెయ్యి చాపి స్టూల్ మీద ఉన్న జగ్ అందుకోబోయింది.

వేళ్ళ అంచులు తగిలి జగ్ భళ్ళున కిందపడి పోయింది. గాజు జగ్ ముక్కలు ముక్కలు అయిపోయింది నీళ్ళు అన్నీ నేలపాలు అయ్యాయి.

మంచి నిద్రలో ఉన్న గోపాల్‌కు ఏదో కింద పడిన శబ్దానికి మెలకువ వచ్చింది.

అత్తగారి గదిలో నుండి ఆ శబ్దం వచ్చిందని గ్రహించాడు తల తిప్పి చూసాడు. రాధ గాఢంగా నిద్రపోతోంది

"రాధా"! చిన్నగా పిలిచాడు.

రాధ పలుకలేదు.

గోపాల్ తను బెడ్ దిగాడు.

స్లిప్పర్స్ వేసుకుని పక్కరూమ్‌లోకి వచ్చాడు.

గాజు పెంకులు, నిస్సహాయంగా మంచం మీద పడుకుని ఉన్న అత్తగారు. ఆమె స్థితి అతనికి అర్థం అయింది. మగవాడు అయినా అతని మనసు జాలితో కరిగింది.

"మంచినీళ్ళు కావాలా అత్తయ్యా!" అడిగాడు

అవును అన్నట్టు తలూపింది.

గోపాల్ స్టూల్ మీద ఉన్న గ్లాసు తీసుకుని వంట గదిలోకి వెళ్ళి గ్లాస్‌తో మంచినీళ్ళు తెచ్చి గ్లాస్ అత్తగారి చేతికి అందించాడు.

అన్నపూర్ణ ఒక్కొక్క చుక్క గొంతులో పోసుకుంది

ఖాళీ గ్లాస్ తీసుకున్నాడు గోపాల్

అన్నపూర్ణ అల్లుడి వేపు కృతజ్ఞతగా చూసింది

గోపాల్ గాజు పెంకులు ఏరి వేసేసాడు

అన్నపూర్ణ కళ్ళు మూసుకుంది

గోపాల్ తన రూమ్‌లోకి వచ్చాడు.

రాధ చిన్నగా కదిలింది.

"రాధా!" భార్యను కుదిపాడు.

"ఏమిటి"? కళ్ళు విప్పి అడిగింది.

అత్తగారి స్థితి అంతా చెప్పాడు

రాధకు ఏమీ జాలి అనిపించలేదు

"మీది మరీ విడ్డూరం రోజూ చచ్చే వాడి చావుకు ఎవరు ఏడుస్తారు!" నిర్లక్ష్యంగా అంటూ కళ్ళు మూసుకుని నిద్రకుపక్రమించింది

గోపాల్ నిట్టూర్చి తను కళ్ళు మూసుకున్నాడు.

* * * * *

తెల్లవారి పని మనిషి అంజమ్మ వచ్చి అన్నపూర్ణ పక్క బట్టలు దులిపి అన్నపూర్ణతో మొహం కడిగించింది.

"అంజమ్మా! రోజూ ఆ చప్పటి బ్రెడ్ ఉదయాన్నే నేను తినలేకపోతున్నాను. ఒక్క ముద్ద అన్నం రాత్రిది ఉన్నా తెచ్చిపెట్టు" అన్నపూర్ణ అడిగింది.

ఉదయాన్నే ఆమెకు బ్రెడ్, పాలు ఇస్తారు.

అన్నపూర్ణ ఒకప్పుడు నిజంగా అన్నపూర్ణే. వద్దు విస్తారంగా పండే పొలాలు ఉండేవి అన్నపూర్ణ భర్త రాఘవరావుకు.

అన్నపూర్ణ ఇంట్లో రోజు నాలుగు శేర్లు బియ్యం అన్నం ఉడికేది.

ఆ ఇంట్లో ఉండేది అన్నపూర్ణ, రాఘవరావు. వాళ్ళ కూతుళ్ళు ఇద్దరే అయినా వచ్చేపోయే అతిథుల రాక ఎక్కువగా ఉండేది. ప్రతిరోజు ఆ ఇంట్లో నలుగురైదుగురు విస్తరి ముందు కూర్చోవాల్సిందే.

ఇంటికి ఎవరు వచ్చినా అన్నపూర్ణ ఆదరించి అన్నం పెట్టేది. ఆమె పేరుకు తగ్గట్టుగా ఉంటుందని అందరి నోటా ఎన్నో ప్రశంసలు పొందింది

వాళ్ళ సంతానం చాముండి, రాధ

చాముండికి ఆరు సంవత్సరాలు వచ్చాకా రాధ పుట్టింది ఇద్దరు పిల్లలని అపురూపంగా పెంచు-కున్నారు. చాముండిని ఆ వూరి రైతు కొడుకు రాజారావుకు ఇచ్చి వివాహం జరిపించారు. రాజారావు అత్త వారి నుండి కట్న కానుకలు ప్రత్యేకంగా ఆశించలేదు రాఘవరావుకు ఉన్న సంతానం ఇద్దరు ఆడపిల్లలే.

అతని ఆస్తి వీళ్ళకే సంక్రమిస్తుంది అని తెలుసు.

చాముండికి చాలా వరకు సహనం తక్కువ. నోటి దురుసు ఎక్కువ

రాధ ఆసంవత్సరం కాలేజిలో జేరింది. రాధ ఆడింది ఆటగా, పాడింది పాటగా పెరిగింది. ఆమె స్వభావం చాలా చిత్రమైనది ప్రతి దానికీ ప్రిస్టేజీ అంటూ చిందులు వేస్తుంది

రాధకు, చాముండికి అంతగా సఖ్యత కలవదు.

రాధ డిగ్రీ ఫైనలియర్ లో ఉండగా రాఘవరావు మరణించాడు

ఆ లోగిట్లో అన్నపూర్ణ, రాధ మిగిలిపోయారు.

బంధువులు తరచుగా వస్తారు కనుక ఆడవాళ్ళకు ఎక్కువగా సమస్యలు ఎదురు కాలేదు.

బంధువుల సహకారంతో అన్నపూర్ణ రాధ వివాహం తలపెట్టింది

గోపాల్ పట్నంలో బ్యాంక్‌లో వర్కు చేస్తున్నాడు.

అతనికీ, రాధకు ఘనంగా వివాహం జరిగింది.

రాజారావు మరదలి పెళ్ళిలో మొహం మాడ్చుకుని తిరిగాడు.

అత్తగారు తమ పెళ్ళి కంటే మరదలి పెళ్ళి అట్టహాసంగా చేసిందనే అభిప్రాయం అతని మనసులో పడింది.

రాధ తన అభిరుచుల మేరకు అట్టహాసమైన చీరా, సారెలతో పట్నంలో కాపురం పెట్టింది

రాజారావు అత్తగారి ఆస్తి పంచి తన భార్యకు రావాల్సిన వాటా ఇవ్వాలంటూ పేచీ పెట్టుకున్నాడు.

ఆడపడుచులకు ఆస్తి హక్కు ఎటూ వచ్చింది కనుక కూతుళ్ళకు ఆస్తి పంచక తప్పలేదు అన్నపూర్ణకు.

చాముండి పూర్తిగా భర్త పక్షాన జేరిపోయింది.

డబ్బుతో రాజారావు ఆవూరి పెద్దలను కొనేసాడు. ఆస్తిలో అత్తగారికి ప్రత్యేకంగా వాటా పెట్టాల్సిన అవసరం లేదని, ఆవిడకు ఉన్నది ఎటూ ఇద్దరు కూతుళ్ళే కనుక ఆవిడ బాధ్యత చివరి వరకు వాళ్ళే స్వీకరిస్తారని చెప్పాడు.

అన్నపూర్ణను నోరెత్తనీయకుండా రాజారావు రాఘవరావు ఆస్తి రెండు భాగాలు చేయించాడు.

రాధ, ఆమె భర్త వచ్చి తమ ఆస్తి అంతా క్యాష్ చేసుకున్నారు.

చాముండికి నలుగురు పిల్లలు ఉన్నారు. వాళ్ళు చిన్న పిల్లలు. వాళ్ళ ఆలనా, పాలనా చూస్తుందని

చాముండి, రాజారావు పథకం వేసుకుని తల్లిని తమ ఇంటికి తెచ్చుకున్నారు.

తనకంటూ భర్త ఏర్పరచిన లోగిలి దాటి అన్నపూర్ణ కూతురి ఇంట్లోకి అడుగు పెట్టింది.

అన్నపూర్ణగా పేరు మోగిన ఆమె కూతురి ఇంటికి జీతం లేని ఆయా అయింది. కూతురి పిల్లలను కూతురికంటే ఎక్కువగా సాకింది.

అల్లుడు రాజారావు అత్తగారు తమ ఇంట అడుగు పెట్టాకా ఒక్కనాడూ పలుకరించలేదు. ఆవిడను చూస్తూనే మొహం ధుమధుమ లాడించేవాడు.

అన్నపూర్ణ ఆ ఇంట అందరి నిరాదరణలు మూగగా భరించింది.

చాముండి పిల్లలు ఎవరి జీవితాల్లో వాళ్ళు స్థిరపడే నాటికి అన్నపూర్ణకు వృద్ధాప్యం మీద పడిపోయింది. ఆవిడ అవసరం చాముండికి తీరిపోయింది.

తల్లిని వెంటపెట్టుకుని బస్సులో చెల్లెలి ఇంటికి తీసుకు వచ్చింది.

అప్పటికే లైట్‌గా పక్షవాతం వచ్చింది అన్నపూర్ణకు.

రాధ, చాముండి కలసి అన్నపూర్ణను హాస్పటల్‌లో జాయిన్ చేసారు.

అన్నపూర్ణను రాధకు అప్పగించి చాముండి, రాజారావు తమ వూరు వెళ్ళిపోయారు.

రాధకు అక్కా, బావా స్వభావం తెలుసు.

తల్లికి జవసత్వాలున్నంత వరకూ ఊడిగం చేయించుకుని రసం తీసిన పిప్పిలా అయిపోయిన తల్లిని ఇలా వదిలించుకున్నారని గ్రహించుకుంది.

అక్కమీద కోపంతో డబ్బు ఖర్చు పెట్టి తల్లికి మంచి వైద్యం చేయించింది.

ఆవిడను డిశ్చార్జి చేసాకా తన ఇంటికి తీసుకు వచ్చింది. తల్లి కోసం ఒక రూమ్, ఒక పని మనిషిని ఏర్పరచింది.

అయితే రాధది అంతా డిసిప్లిన్ ప్రకారం జరిపే పద్ధతి.

ఇద్దరు మగపిల్లలు ఉంటే హాస్టల్‌లో జాయిన్ చేసింది. ప్రతి సంవత్సరం హాలిడేస్‌కు మాత్రమే వాళ్ళు ఇంటికి వస్తారు

ఆ ఇంట్లో పద్ధతులన్నీ విదేశీ పద్ధతులే. రాధ ప్రతి విషయంలో నూ స్టేటస్ కోసం చూస్తుంది.

అన్నపూర్ణగా రోజూ పది మందికి అన్నం పెట్టిన అన్నపూర్ణకు ఇప్పుడు చిన్న కూతురు రాధ టైం ప్రకారం అన్నం కొలిచి పెడుతుంది.

వయసుమీద పడింది కనుక కడుపునిండుగా తింటే అరగదు అని అంటుంది రాధ. అంతేకానీ ఆమె ఇంట్లో బియ్యం లేకకాదు.

సంవత్సరం తిరిగే సరికి అన్నపూర్ణ మరింత ఎముకల పోగు అయింది. చాలీ చాలని కొలత తిండి ఆమె శక్తిని పూర్తిగా హరించేసింది.





"కరుణామయుడు"

(చిత్రం : దేవు దీక్షితులు)

## కృపాభిక్ష

ప్రభూ!
ఈ కీర్తి శిఖరాల ఆకర్షణలన్నీ
నిష్ప్రయోజనం
పరమపద శిఖర వీక్షణం
నిత్యానంద దాయకం

అందుకే-
ఉషోదయం కోసం
ఎదురు చూస్తున్నాం
నీ మలి రాకకై
నిరీక్షిస్తున్నాం-

కాని-
అజ్ఞానంతో చెలిమి
అహంకారపు కలిమి
ఈ హృదయాల్నింకా
బంధించే వున్నాయ్

అందుకే ప్రభూ!
నీ క్షమాభిక్షలో
మా పాపాలన్నీ పరిహరించనీ!
నాకున్న ఈ గరిక తివాచీ
నీ అపార కృపా సంకేతంగా భావిస్తా!
నిన్ను స్మరిస్తూనే శాశ్వతంగా విశ్రమిస్తా!!

- పింగళి పాండురంగారావు

## అన్నపూర్ణ

అన్నపూర్ణకు తిరిగి పక్షవాతం వచ్చేసింది పూర్తిగా మంచంలో పడిపోయింది.

ప్రాణం ఒక్కటి తప్ప ఆవిడలో ఏమీ లేదు అది ఎప్పుడు పోతుందా అని దైవ ప్రార్థన చేసుకుంటూ ఉంటుంది.

★ ★ ★ ★

అంజమ్మ అన్నపూర్ణ కోరిక మీద రాత్రి అన్నం పళ్ళెంలో పెట్టి తెచ్చింది

అన్నపూర్ణ ఆశగా అందుకోబోయింది.

రాధ వచ్చి ఆ దృశ్యం చూడనే చూసింది

నిలవ ఉన్న అన్నం తల్లికి పెడితే ఆమె ఆరోగ్యం మరింత క్షీణించి పోతుందని, ఆ అన్నంలోకి సూక్ష్మక్రిములు జేరి ఉంటాయని లెక్చర్ ఇచ్చింది

అన్నపూర్ణ కూతుర్ని జాలిగా చూసింది

తెలిసిన వాళ్ళకు చెప్పొచ్చు, తెలియని వాళ్ళకు నేర్పొచ్చు కానీ తన కూతురి లాంటి మూర్ఖులకు ఎవరూ నచ్చ చెప్పలేరని ఆవిడకు తెలుసు

రాధ పరుషంగా మాట్లాడుతుంటే అంజమ్మకు కోపం వచ్చింది. రాధకు, ఆమెకు మాటా మాటా పెరిగి వాళ్ళ తగదా తారాస్థాయి జేరింది

గోపాల్ వచ్చి ఆ ఇద్దరు ఆడవాళ్ళకు సర్దిజెప్పబోయాడు ఎవరూ వినిపించుకోలేదు

అంజమ్మ పని మానేసి వెళ్ళిపోయింది

పోతేపోయింది డబ్బు పారేస్తే లక్షాతొంభైమంది అనుకుంది పళ్ళు కొరుకుతూ రాధ

అన్నపూర్ణకు బ్రెడ్ తెచ్చి ఇచ్చింది రాధ నిరాసక్తిగా దాన్ని అందుకుంది అన్నపూర్ణ

★ ★ ★ ★

రాధ ఆ వూరి మహిళా మండలికి ప్రెసిడెంట్. ఆ రోజు మహిళా మండలి మెంబర్స్ అంతా రాధ ఇంటికి వచ్చారు రాధ తల్లిని పలకరించాలని అన్నపూర్ణ గదిలోకి వెళ్ళారు మరో పని మనిషి దొరకలేదు అన్నపూర్ణకు చీర మార్చటానికి కూడా ఎవరూ లేరు రాధ టైంకి తిండి పెడుతుంది కానీ అటువంటి పనులంటే అసహ్యం

మహిళా మండలి మెంబర్స్ సహజమైన స్వభావాలతో అన్నపూర్ణను చూసి చెవులు కొరుక్కున్నారు.

మర్నాటి నుండి రాధ మీద విపరీతమైన ప్రచారాలు జరిగిపోతున్నాయి. మహిళా మండలి ప్రెసిడెంట్ గొప్ప ఆధునిక భావాలు కనపరుస్తుంది. ఇంట్లో కన్నతల్లిని హీనంగా చూస్తుంది అంటూ

మరో పక్క పని మనిషి అంజమ్మ పని పోయిందన్న కక్ష కొద్దీ ఆ ఇంట్లో తను చూసిన వాటికి మరికొన్ని రంగులు పులిమి రాధను తేలికగా మాట్లాడసాగింది

అన్నిరకాల వార్తలు రాధ చెవిన పడ్డాయి తన తల్లి మూలంగా సంఘంలో తన స్టేటస్‌కు మచ్చ ఏర్పడుతోంది అని, ఇలా అయితే తన విలువ తగ్గిపోతుందని ఆమెకు కష్టంగా అనిపించింది

రెండు రోజులు ఏక దీక్షగా ఆలోచించి అందుకు ఒక పరిష్కారం ఎన్నుకుంది. గోపాల్ భార్య నిర్ణయాన్ని ఆమోదించలేదు ఎప్పుడూ భర్తను లెక్క చేయని రాధ ఈ సారీ లెక్క జేయలేదు తల్లిని తీసుకు వెళ్ళి అనాధాశ్రమంలో జేర్చేసింది. తల్లి క్రింద నెలకు వాళ్ళకు ఇంత డబ్బు ఇస్తానని, తల్లిని శ్రద్ధగా చూడమని ఆ ఆశ్రయం అధికారిని కోరింది

వూళ్ళో మళ్ళీ కొన్ని రోజులు రాధ మీద వదంతులు పుట్టాయి రాధ లెక్కజేయలేదు.

★ ★ ★ ★

అన్నపూర్ణకు కూతురి దగ్గర కంటే ఇక్కడ కాస్త బాగానే ఉంది. ఎంతో ఆస్తి ఉన్న తను ఇలా అనాధల మధ్య బ్రతకటం ఆమెకు చాలా బాధగా ఉంది

కూతుళ్ళ సొమ్ము తినకుండా ఇలా పరాయివారు పెట్టే తిండి తినటమే మేలు అనిపిస్తోంది ఆమెకు.

ఆ రోజు ఆయాలు మాట్లాడుకున్న మాటల్లో తెలిసింది అన్నపూర్ణకు-

రాధ తన కింద శరణాలయం వారికి డబ్బు కడుతోంది అని డబ్బు ఎరగా వేసి కూతురు తనను వదుల్చుకుంది అని అర్థం అయింది

అన్నపూర్ణ ఒళ్ళు అసహ్యంతో కంపించి పోయింది ఆ రోజు మొదలు పది రోజులు అన్నపూర్ణ ఆహారం ముట్టలేదు

★ ★ ★ ★

ఆగస్ట్ పదిహేనవ తేదీ. స్వాతంత్ర్య దినోత్సవం మహిళా మండలి వారు అనాధ శరణాలయంలో పంచటానికి లడ్డూలు తెచ్చారు రాధ రాలేదు.

అన్నపూర్ణ వాళ్ళను చూసి కళ్ళు తిప్పలేదు ఆయాలు పిలిచారు. అన్నపూర్ణ మాట్లాడలేదు

మరో రెండు నిమిషాలకు అక్కడున్న అందరూ తెలుసుకున్నారు అన్నపూర్ణ మరణించిందని ఆమె తల దగ్గర చీటీ. మహిళా మండలి సభ్యులు విప్పి చదివారు

పడుకునే రాసినట్టు ఉంది అక్షరాలు వంకర టింకరగా ఉన్నాయి.

"ఆడపిల్లలే ఆస్తి అనుకుని ఉన్న ఆస్తి వాళ్ళకే ఇచ్చాను. ఏ తల్లితండ్రులు అయినా బిడ్డలు చూస్తారని నమ్మి వాళ్ళకు జీవనాధారం ఏమీ లేకుండా అంతా పిల్లలకే అప్పగించ కూడదు. బహుశ నన్ను తల్చుకుంటే ఇక ఎవరూ ఆ పని చేయరేమో!

నా కూతురు డబ్బు ఎరగా పెట్టి నన్ను వదుల్చుకుంది. కని పెంచిన తల్లి అంటే ప్రేమ లేని రాధ కానీ, నా పెద్ద కూతురు చాముండి కానీ నా అంత్యక్రియలు చేయరాదు. ఈ శరణాలయం వారే దయతో ఈ అనాధ ప్రేతానికి అంత్యక్రియలు జరపమని కోరుకుంటున్నాను

ఇట్లు

అన్నపూర్ణ" □

# 'క్రిస్మస్' పండుగ పరమార్థం

జీసస్ క్రీస్తు కారణజన్ముడు జనాభా లెక్కల తయారీ నిమిత్తము వివరాలు నమోదు చేసుకొనేందుకు 'జోసెఫ్' అనే వడ్రంగి 'నాజరత్' నుండి 'బెత్లెహామ్'కు భార్య మేరీతో కలసి రావడం జరిగింది నిండు చూలాలయిన మేరీ 'డిశంబర్



మహాప్రభువుతో మేరీమాత
(చిత్రం : పి. పి. నాయుడు)

25'వ తేదీ ఒక పశువుల శాలలో శిశువును ప్రసవించింది ఆ శిశువే జీసస్ క్రీస్తు ఆ జనన సమయమున కలిగిన వివిధ ప్రేరణాత్మక సూచనల ననుసరించి జ్ఞానులు, ఆ ప్రభు దర్శనం చేసుకొని కానుకలర్పించారు

క్రీస్తుతోనే నవ శకారంభం జరిగింది చరిత్రకు ప్రామాణికంగా 'క్రీస్తు' శకాన్నే పరిగణనకు తీసుకోవటాన్ని బట్టి 'శక పురుషుడు'గా క్రీస్తుకున్న విశ్వవిఖ్యాతికి వేరే తార్కాణమేల?

'క్రిస్మస్' ఆచారాలు, వేడుకలు దేశదేశాలలో వేరు వేరుగా నున్నాయి ఇంగ్లాండ్‌లో ఒక కథ కూడా వాడుకలో నున్నది చాలా సంవత్సరాల క్రిందట ఒక ప్రాంతంలో పెద్ద భూకంపం వచ్చి అక్కడి చర్చితో సహా అక్కడి గ్రామం అంతా భూగర్భంలో స్థాపితమై పోయిందట కాని ఆ కొండ వద్ద డిశంబరు 25వ తేదీ ఉదయం నేలకు చెవి ఆనించి వింటే ఆ చర్చి గంటలు వినిపిస్తాయని అక్కడ క్రైస్తవుల ప్రగాఢ విశ్వాసం

క్రిస్మస్ వేడుకల్లో... "క్రిస్మస్ ట్రీ" అలంకరణ శాంటాక్లాస్ (క్రిస్మస్ తాత) వేడుకలు, క్రొవ్వు వత్తుల అలంకరణ, ప్రత్యేక ప్రార్థనలు జరుపుట ముఖ్యమై యున్నవి ఈ వేడుకలు జరుపుకొనుటలో అంతరార్థములు కూడ గోచరమగుచున్నవి

## క్రిస్మస్ ట్రీ

ఏసుక్రీస్తు బైబిల్‌లో "నేను అసలైన ద్రాక్షవల్లిని మీరెల్లరూ నా శాఖలు అని ప్రవచించినందున 'ఏసుక్రీస్తు'కు ప్రతి రూపంగా 'క్రిస్మస్' చెట్టును క్రైస్తవ గృహాలలో ప్రతిష్ఠించి క్రీస్తు నీడలో ఆత్మీయ విశ్రాంతి గైకొనాలనే పవిత్రాశయంతో 'క్రిస్మస్ ట్రీ' ఆరాధనా సాంప్రదాయం నెలకొనింది

ఇంగ్లాండ్‌లో 'క్రిస్మస్ ట్రీని' 'క్రైస్తు సాధారక' అని పిలుస్తారు 'క్రిస్మస్ ట్రీ'గా ప్రతిష్ఠించే నిమిత్తం కొన్ని రకాల చెట్లను పవిత్ర వృక్షాలుగా భావించే సంప్రదాయమున్నది అటువంటి మొక్కలలో 'బెర్రీ' మొక్క ఒకటి క్రిస్మస్‌నాడు 'బెర్రీ' చెట్టు కింద నిలబడి 'ముద్దు' పొందని కన్యకు వివాహమే కాదని ఇంగ్లాండ్ జనుల నమ్మకం బెర్రీ మొక్క యొక్క ఆకుపచ్చని ఆకులు క్రీస్తు పుట్టుకకు, ఎర్రని బెర్రీ పళ్ళు ఆయన రక్తానికి చిహ్నాలుగా భావించి ఈ చెట్టును పవిత్రంగా భావిస్తారు

## క్యాండిల్ ఫెస్టివల్

క్రిస్మస్‌నే క్యాండిల్ ఫెస్టివల్ అని కూడ అంటారు. క్రిస్మస్‌కు క్రొవ్వొత్తులు వెలిగించి క్రిస్మస్ ట్రీ వద్ద అలంకరించటం పరిపాటి ఇందులో గూఢార్థం లేకపోలేదు ఏసుక్రీస్తు "నేనే ఈ జగతికి వెలుగునై యున్నాను" అని నుడివిన బైబిలు సూక్తి దృష్ట్యా విజ్ఞాన జ్యోతికి ప్రతీకగా క్రొవ్వొత్తి వెలిగించే ఆచారమేర్పడినదని చెప్పబడుచున్నది



క్రిస్మస్ తాత
(చిత్రం : ప్రకాష్)



క్రీస్తు జన్మ సమయమున తూర్పు దిశన ఆ కాశంలో ఉదయించిన ఉజ్వల తార గాథతో ఈ 'క్యాండిల్స్' ఆచారాన్ని సమన్వయిస్తే ఈ కాంతిని ప్రతిబింబించే జ్యోతికి చిహ్నమే ఈ 'క్యాండిల్' అనేభావన కూడ సుబోధకమగుచున్నది.

## సన్నుతి గీతాలాపన

క్రిస్మస్ రోజున 'కారల్స్' అని పిలువబడే క్రైస్తవ సన్నుతి గీతాలు ఆలాపించటం సర్వత్రా కానవస్తుంది ఏసుక్రీస్తు జన్మించిన వృత్తాంతాన్ని పక్షులు తమ తమ కిలకిలా రావాలతో లోకానికి ఎరుక చేసిన వృత్తాంతాన్నే తలంపుకు తెస్తూ క్రీస్తును స్తుతిస్తూ క్రీస్తుజనన ప్రాముఖ్యాన్ని కొనియాడే గీతాలాపన చేయటమే ఈ సన్నుతి గీతాలాపనలో పరమార్థం ఈ పద్ధతికి 'సెయింట్ ఫ్రాన్సిస్' ప్రప్రథమంగా రూపకల్పన చేశాడని ప్రతీతి

## క్రిస్మస్ ప్రబోధం

పాపులను వెలికిదీసి పవిత్రులను చేయుటకై ఆత్మార్పణ గావించిన అవతార పురుషుడు క్రీస్తు. మానవసేవలోనే మాధవుని దర్శించుమని, ప్రేమ, త్యాగం మున్నగు సుగుణాలతో విరాజిల్లుమని క్రీస్తు ప్రబోధించినాడు. ఆ మహనీయుని ఆదర్శాలను ఆచరణలో పెట్టడానికి సంకల్ప సిద్ధులగుటకు అనువైన శుభ సమయం క్రిస్మస్!

- మమత

# ప్రశ్నావళి కె. రామలక్ష్మి



### ఆర్. ఆర్. ఆర్., గుంతకల్.

★ డబ్బు పేరు ప్రతిష్టలు అన్నీ వుండి కూడా సినిమాతారలు చాలామంది పెళ్ళి అయిన వారికే రెండవ భార్యలుగా వెడతారెందుకు?

● 1. మగవాడు పెట్టే ప్రలోభం. 2. ఇంటి దగ్గర బంధువర్గాలు పెట్టే చెర. మనం వారిని చూసి జాలిపడాలే గాని అసహ్యించుకోకూడదు.

★ ఆదర్శాలు పెట్టుకున్న మీలాంటి వారు రాజకీయాలలో రాణించకలరా? ప్రస్తుతం వున్నారా? నాలాంటి వాళ్ళు అక్కడ బ్రతక లేరనేదే మీ సమాధానం అయితే నైతిక విలువలు అనేవి అన్ని చోట్ల పని చెయ్యవు అనే కదా దాని అర్థం!

● అంతే ఒకవేళ ఒకరూ అరా మడిగా వున్నా- తాటిచెట్టు కింద పాలు తాగే వాడి గతే- గాని వేరుకాదు రాజకీయాలలో నేడు నైతిక విలువలకు కాదు- "మంది"కే పెద్ద పీట ఎన్ని లారీల మందిని తోలించుకు రాగలిగితే- అంత గొప్ప నాయకుడయ్యే అవకాశాలు కలుగుతాయి.

★ డబ్బుకి మీరు ఎలాంటి విలువ యిస్తారు. దాని సంపాదనే ధ్యేయంగా నైతికంగా దిగజారడంపై మీ అభిప్రాయం?

● మీరు చాలా పెద్ద ప్రశ్న వేశారు డబ్బు- కావాలి- అవసరాలను తీర్చడానికి- కాస్త సుఖంగా బ్రతకడానికీ. తరతరాల కోసం సేకరించి పెట్టక్కర లేదు- ఇక దాన్ని సంపాదించడం- మాలాంటి వాళ్ళకి- ఓ జీవిత కాలం పట్టేస్తుంది అంచేత పాటుపడే తేనెటీగలు పక్కలబడి రక్తం పీల్చే నల్లి సలహా పాటించకూడదు. డబ్బే కొందరికి సర్వం అలాంటి వారు- అది పోగానే సర్వం పోగొట్టుకుంటామని తెలుసుకోరు అంతే కాని- డబ్బుంటే భయం- లేకుంటే దుఃఖం- అదీ దీనితో వచ్చిన చిక్కు. అందుకే మితంగా వుంటే చాలు అనుకుంటాను నేను

### ఎం. ఎస్. ఎన్. అన్నవరం

★ మానవత్వానికి సరైన నిర్వచనం ఏమిటి?

● ప్రాణమున్న ప్రతి దానిపై కరుణ కల్గి వుండడం

★ ఎవరైనా స్త్రీ రోడ్డున పోతూంటే వెంటపడి నానా అసభ్యంగాను ఏడిపిస్తుంటారు కొందరు యువకులు. కేవలం తమ ఆనందం గురించే గాని ఎదుటివారి మానసిక క్షోభ గురించి ఆలోచించరా మూర్ఖులు. ఇదేం దారుణం అంటారు?

● ఆదీనాటి యువకుల సభ్యతకు చిహ్నం మాత్రమే. స్త్రీ పట్ల పురుషునికి వున్న చిన్నచూపును నిదర్శన మాత్రమే. కాని యిదే క్షణాన తన తల్లినో, పెళ్ళాన్నో, చెల్లినో ఎవరో అల్లరి చేస్తుంటారంటే- ఉడుక్కుని పిడికిళ్ళు బిగిస్తారెందుకు యీ పిరికి సన్నాసులు అనిపిస్తుంది నాకు- అక్కడికి వారి ఆడవారు- ఆడవారే కద అవతలివారికి!!

★ నిజంగా పునర్జన్మ అనేది వుందంటారా?

● ఉండే ఉండాలి. లేకుంటే యింతమంది పిచ్చి కుక్కల్లా ప్రవర్తించేవాళ్ళు మన మధ్య వుంటారా?!

★ మానవత్వం లేని మనిషి పశువుతో సమానం అంటాను. .

● నిజమే అన్ని గుణాలకంటే యిది ప్రాథమిక సుగుణం

★ రాజకీయ నాయకులు గూండాలను మించిపోతూంటే సామాన్యులకి రక్షణ ఏది?

● ఉండకూడదనేగా గూండాలకి గెలుపు ప్రసాదించేది?




### ఏ. వి. పి., బ్రాహ్మణక్రాక

★ కె ఆర్ గారూ నమస్తే రంగనాయకమ్మగార్కి ఆమె అనుమతి లేకుండా ఆమె నవలలు ఆధారంగా సినిమా తీసినందుకుగాను మీరు ఇంకొందరు నష్టపరిహారం చెల్లించవలసిందిగా కోర్టు తీర్పు చెప్పిందని చదివాను అన్నీ తెలిసి వుండి, ఎంతో అనుభవం ఉండి, మీరు యీ విధంగా ఎలా ప్రవర్తించకల్గారండీ? కేవలం కుతూహలం కొద్దీ అడిగాను

● కుతూహల పడడంలో తప్పు లేదు ప్రసూనాంబా, నన్ను తెలిసిన నా శత్రువులు కూడ నేనలాంటి పని చేస్తానంటే- నమ్మరు. వాజ్యం వెయ్యేళ్ళన్నారు! కానివ్వండి ఓ తీర్పుతో జరిగిపోయేవి కావివి. మీకూ, చాలా మందికీ తెలియని విషయం ఒకటుంది- ఇదే గోరింటాకు మీద రంగనాయకమ్మ కంటే ముందే మద్రాసులో ఓ ప్రబుద్ధుడూ కేసు వేశాడు- అది తన కథ అంటూ- అయితే, ఒక్కటే తేడాట. ఇక్కడ చెల్లి చచ్చిపోతుంది. తనదాంట్లో పెద్ద డాక్టరై బాధ్యతలు మరచి విలాస జీవితాన్ని కోరుకున్న హీరో కళ్ళు తెరిచి- తన చెల్లిలికి పురుడు పోస్తాడట!! అలాగే వుంది యిదీను- నల్ల కోటు తెల్ల కోటు మార్చేస్తే డాక్టర్లు లాయర్లు, లాయర్లు డాక్టర్లు- సినిమా వేషగాళ్ళు కాకలరేమో కాని కథా పాత్రలు కాగలరా?! కనీసం నాకు రంగనాయకమ్మ తెలుసు 'మద్రాసు కేసువాడి'ని నేను కోర్టులో మా లాయరు చూపెట్టాక చూశాను! ఈ సినీ ప్రపంచంలో- వింతలకేం లోటు లేదు చూద్దాం- యింకా వుంది కద ముందు

### ఎ. వి. జి. ఎస్. ఎమ్., చీరాల

★ వేయిపడగల గురించి మీ సమాధానం నాకు నచ్చింది సరిగ్గా నాకూ అదే అభిప్రాయం, సామాన్యులకు అర్థం కాని రచనేమో!

● ఏమో మరి! అందుకే విజ్ఞులు దాన్ని గొప్పగా పొగిడారు అంతర్జాతీయ కీర్తి దక్కించారు అది రాసేనాటి పరిస్థితి గురించి చదువుతున్నారు- అది మరీ బాధ కల్గించింది- జోస్యం అడిగి- రాయడం ప్రారంభించారనడం!

### సుదర్శన్, భీమవరం

★ ప్రస్తుతం సామాజిక స్పృహ కల సినిమాలు రాకపోడానికి కారణం ఏమిటి?

● చూసే వాళ్ళుండరని సినిమావాళ్ళు అంటారు

★ దేవుడిని సృష్టించినది మానవుడు కాదంటారా?

● మరి తను సృష్టించిన వాడి వునికినే మానవుడు ప్రశ్నిస్తున్నాడెందుకు?! □

# స్వస్తిక్ యూరియా ఇచ్చే వరం
# సుఖ సంపదలిక రైతు పరం

అలలుగా తలలూచే పచ్చని పొలాలు.
సమృద్ధైన దిగుబడి - అన్నీ పచ్చని అనుభూతులు.
సాగుబడి భూములు అలాగే వున్నాయి.
దిగుబడి మాత్రం ద్విగుణీకృతం.
పొలాలకి చెమటోడ్చే కాయకష్టం చాలదు.
**స్వస్తిక్ యూరియా** వాడాలి. అదే సరైన పద్ధతి. అలాగే
పొందాలి ముందెన్నడూ లేని లాభాలు.

★ మెరిసే తెల్లని గుండ్రని గుళికలు.
★ నీటిలో పూర్తిగా కరుగుతుంది.
★ పంటల పరిపూర్ణ పుష్టికి అధిక తమ నత్రజని.
★ పూర్తిగా నత్రజని ఉపయుక్తం.
★ ద్రవంతో క్రిమినాశిని గాని, కీటకనాశిని గాని కలిపి చల్లుకునే వీలు.
★ దృఢమైన 50 కిలోల ప్యాకింగ్‌లో లభ్యం.




## స్వస్తిక్
## యూరియా

46% నత్రజనితో కూడినది



**ది ఫర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్.**
6-2-30/సి. లకడి-కా-పూల్, హైదరాబాద్-500 004. (ఆం.ప్ర.)



సీరియల్

# ఈతరం యువతి

## వద్దమన్నాటి కుటుంబరావు

(గత సంచిక తరువాయి)

అన్ని హంగులూ ఉన్న ఆ ఐశ్వర్యవంతుల్ని గింగిరాలు తిప్పి అమితమైన వేదనకు ఆవేదనకు గురి చేసింది ఉదయం ఫస్టు డెలివరీ పోస్టులో వచ్చిన ఓ కవరు

కవరు కాదది పేపర్ బాంబ్'

మొట్టమొదటగా మధుసూదనం గారు విప్పి చదివారు అందులో ఇలా ఉంది డియర్ మధుసూదనం,

రోజు లెప్పుడూ సంతోషంగా ఉంటే అందులో థ్రిల్ ఏమీ ఉండదు

అందుకే ఈ రోజు మీ ఇంటిల్లిపాదికీ కుటుంబ సభ్యులకీ ఇది సంతాప దినం లాంటిది

ఎందుకో తెలుసుకోవాలంటే

ఈ కింది పాంప్లెట్‌లో ఉంది చదువుకో వాటిని ఓ వంద పంపిస్తున్నాను వచ్చిన వాళ్ళకల్లా చూపించి ఎవరో చచ్చినట్లు ఏడ్చుకో మొత్తుకో !

నా బాధ్యతగా నేనేం చేశానంటే నీకు తెలుసును అనుకున్న నాకు తెలిసిన వాళ్ళందరికీ విందు భోజనం లాగ తలా వందా పంపించాను నాకు తెలుసు' స్కాండల్స్ ప్రచారం అయినంతగా మంచి విషయాలు ప్రచారం కావు

ఈ రోజు నా కళ్ళు చల్లగా ఉన్నయ్ మేమంతా సెలిబ్రేట్ చేసుకుంటున్నాం వేటితో నో తెలుసా?

చికెన్ ముక్క ' మందు చుక్క ' మగువ పక్క ' మీ ఇంటిల్లిపాదీ ఇంటి కప్పు ఎగిరి పోయేట్టు కంటికీ మంచికీ ఏకధారగా శోకించండి''

ఆల్‌ది వరస్ట్ ఫర్ ఆల్ ఆఫ్ యు..! ప్లీస్' విజయవాడ – మీ సర్వనాశనాభిలాషి' డేట్' ఎందుకు?

ఆ ఉత్తరం చదివిన మధుసూదనంగారి చేతులు వణికాయి గుండె జల్లుమంది

నెర్వస్‌గా పాంప్లెట్ అందుకున్నారు. అందులో ఏముందో ? అనుకుంటూ ఆందోళనగా చదవసాగారు

"ఎవరికి చెందాలో .. వారందరికీ

వందనాలు' అభివందనాలు –

అయ్యా! అమ్మా,

ఇందు మూలంగా అందరికీ సవినయంగా సవివరంగా, సగర్వంగా మనవి చేసేదేమంటే – విజయవాడలో ఉన్న ఆటో స్పేర్ పార్ట్సుల షాపు అధినేత మధుసూదనం గారి రెండో అమ్మాయి చి సౌ. మృదులాదేవి నిజంగా అందాల దీవి' సకల సద్గుణరాశి ఇవన్నీ ఒప్పుకుంటానికి మాకేమీ అభ్యంతరం లేదు కానీ . ఆ అమ్మాయి విషయంలో మృదువైన. మరీ చెప్పాలంటే అతి మృదువైన పదునైన విషయం.. ఒకటుంది. అదేమిటంటే . ?' ఆ అమ్మాయి వట్టి... షోకేసులో బొమ్మ ' అంటే మీకు అర్థం అయిందో లేదో. ఊరికే చూసి మురుసు కోటానికే తప్ప మరెందుకూ పనికి రాదు దానికి ఆ అమ్మాయి తప్పు మాత్రం ఏముంది? భగవంతుడామెను అలా పుట్టించాడు. వాడి దుంప తెగ!!

ఆమె ఆడతనం లేని ఆట బొమ్మ. ' మాసకమ్మ ' వుమన్ ఆఫ్ ఫ్రిజిడిటీ !

ఈ కారణం చేతనే. తల్లిదండ్రులు ఆమెకు ఎన్నో సంబంధాలు చూసినా ఆమె అందచందాలు . కొరుక్కు తినేంత బాగున్నాయనిపించినా.. ఏ ఒక్క పెళ్ళి సంబంధం కుదరలేదు

• కనుక ఓ పెళ్ళి కొడుకుల తల్లిదండ్రులారా' మీరా అమ్మాయిని కోడలిగా చేసుకుందామనుకుంటే మా అభ్యంతరం ఏమీ లేదు. అయ్యో పాపం మీ ఖర్మ అనుకుంటాం'

షరా · మేము చెప్పిన దాంట్లో మీకు నమ్మకం లేకపోతే మా స్వంత ఖర్చుల మీద మేమే ఒక డాక్టరుని పంపిస్తాం. అఫ్‌కోర్స్! లేడీ డాక్టరునే .

దాన్ని చదవగానే ఖిన్ను లయిపోయారు మధుసూదనంగారు. నిర్విణ్ణులయిపోయారు

వెయ్యి సమ్మెటలతో ఎవరో తన నెత్తిని పగల కొడుతున్నట్టుగా అనిపించిదాయనకి.

తనకన్న తల్లి మీద.. తను కనుపాపలా చూసుకునే బంగారు తల్లి మీద ఇంత దారుణమైన నిందారోపణా?

ఆ ఆవేశాన్ని... ఆ ఉద్రేకాన్ని ఆయన తట్టుకోలేకపోయారు.

"రుక్కూ" అంటూ ఆయన పెట్టిన భీకరమైన కేక ఆ భవనమంతా ప్రతిధ్వనించింది. కంగారుగా పరుగెతుకొచ్చిన రుక్మిణమ్మకు ఆయన అందించిన ఆ పాంప్లెట్ చదివి దాదాపు తల తిరిగి పడిపోయినట్టయింది. ఆ వెంటనే సుదర్శనం. . లక్ష్మీరాణి... రాజేంద్రలు చదివి నిర్ఘాంతపోయారు. విషయం తెలుసుకున్న ముసలి ప్రాణులకు మూర్ఛ వచ్చినంత పనయ్యింది.

ఈ గందరగోళమంతా విని వచ్చి ఒక కరపత్రం తీసి చదువుకున్న మృదులకు మాత్రం అంతగా ఆశ్చర్యం కలగలేదు రాయి చుట్టి విసిరిన చీటీకిది విశ్వరూపమన్న మాట' అనుకునితనలో తనే నవ్వుకుంది నిర్లిప్తంగా.

ఆ తరవాతనే ఇందాకటి తర్జన భర్జనలన్ని జరిగాయి

కానీ... ఈ ఆపద నెలా తట్టుకోవాలో ఎవరికీ ఏమీ తోచలేదు.

అంతలో . "అత్తయ్యా! మృదులేది కనుపించటం లేదు" కోడలు

**జరిగిన కథ- 10:** చెల్లెళ్ళ పెళ్ళి జరిగే వరకు పెళ్ళి మాట తలపెట్టవద్దని రవికాంత్‌ను తండ్రి అభ్యర్థిస్తాడు. రవికాంత్ ఆ త్యాగానికి ఇష్ట పూర్వకంగానే సిద్ధపడతాడు. పెద్ద చెల్లెలు పద్మినికి సంబంధం కుదురుతుంది. మృదుల తానే రవికాంత్ ఇంటికి వస్తుంది. మృదుల, రవికాంత్‌లు తమ ప్రేమను వెల్లడించుకుంటారు. మృదులకు వచ్చిన సంబంధాలన్నీ చెడిపోతుంటాయి.

లక్ష్మిరాణి కీచుగా అరిచింది.

అంతా కంగు తినిపోయారు కళవళ పడిపోయారు

అందరి నోటా ఒకటే ప్రశ్న మృదులేదీ ? మృదులేదీ ? తల్లడిల్లిపోయారు

'కొంప దీసి ఏ అఘాయిత్యానికయినా పాలు పడటానికి సిద్ధపడ లేదు కద?"

భయాందోళనలతో వణికిపోయారు

చూస్తారేం పదండర్రా వెదుకు దాం గాభరాగా అంది రుక్మిణమ్మ

నౌకర్లప్పుడే అటూ యిటూ పరుగెత్తారు కుటుంబ సభ్యులంతా తలా ఒక వేపుక వెళ్ళటానికి సిద్ధమవుతున్నారు

"ఏమిటమ్మా? ఎందుకలా ఐదయి పోతున్నారు?" అంటూ ప్రశ్నించింది అప్పుడే అటుగా వచ్చిన మృదుల

నీ కోసమే తల్లీ! ఎక్కడక వెళ్ళావ్ నువ్వు నువ్వు కనుపించక పోయేసరికి మా గుండెలవిసిపోయినయ్ తల్లి కూతుర్ని ఆప్యాయంగా దగ్గరకి తీసుకుని కౌగలించుకొంది రుక్మిణమ్మ

ఎక్కడి కెళ్ళావ్ బేబీ?' దగ్గరగా వచ్చి కూతురి భుజం మీద చెయ్యేసి ప్రేమగా నిమిరారు మధుసూదనంగారు

'జస్ట్ బాత్ రూం కెళ్ళి వచ్చాను డాడీ' అంతే అంది మృదుల మామూలుగా

"హడల కొట్టేశావ్ కదా సిస్టర్" గాఢంగా ఊపిరి పీల్చుకున్నారు. సుదర్శనం రాజేంద్రలు.

"బేబీ..."

"ఏం డాడీ?'

"నాకో ప్రామిస్ కావాలమ్మా"

"ఏమిటి డాడీ?"

మేమంతా ఉన్నాం దీని అంతేదో చూస్తాం నువ్వు మాత్రం తొందర పడి

ఏ "

"అర్థమైంది డాడీ ఈ పాంప్లెట్ నాలో అణగి ఉన్న రోషాన్ని రెచ్చగొడుతోంది నన్నేదో హెచ్చరిస్తోంది మీకా భయం అక్కర లేదు" అంది మృదుల ధృఢంగా

ఆ మాటతో అందరి మనసులు కుదుట పడ్డాయి

'చాలమ్మా ! ఆ హామీ చాలు నాకు' ఆనందంగా కూతురి తల నిమిరారు మధుసూదనం గారు

ఆ తరువాత ఆయన గొంతులో ఒక్క సారిగా కాఠిన్యం చోటు చేసుకుంది



"అంతా వినండి. మన ముందున్న ఈ సమస్య సామాన్యమైనది కాదు. అనుక్షణం మన గుండెల్ని పిండేసి... ఆవేదనకు గురి చేసే జటిలమైన సమస్య. కనుక మీరంతా ఈక్షణం నుంచే ఇన్వెస్టిగేట్ చెయ్యండి! ఆరా తియ్యండి. ఈ పని చేసిన వాడికి ఓ గుణపాఠం నేర్పాలి" అన్నారు గంభీరంగా.

అంతా తలలూపారు ఓ నిశ్చయాని కొచ్చినట్టుగా..

'పోలీసు కంప్లెయింటిస్తే...' అన్న కొంత మంది కుటుంబ సభ్యుల సూచనను మధుసూదనంగారు ఆమోదించలేదు. ఎవరి మీద ఇస్తాం? ఏమని ఇస్తాం? పైగా అది మనల్ని.... మృదులని దాని వివాహ సమస్యని బాగా అల్లరి చేసుకున్నట్లే అవుతుందన్నారు.

బరువెక్కిన మనసులతో అందరూ కదిలారు.

మృదుల మాత్రం కూర్చున్న చోటే ఉండిపోయింది. ఆమె మనస్సు నిండా పెను తుఫానులా ఆలోచనలు!

★ ★ ★ ★ ★ ★ ★ ★

"ఏయ్ తాయారూ?" అన్నాడు అవతారం.

"నేను తంయారు" అంది.

"నిజమా?" అన్నాడు అవతారం ఆశ్చర్యంగా.

"లేకపోతే నాకేమన్నా హజమా?" అంది తాయరు.

అవతారానికి నోట మాట రాలేదు అప్రయత్నంగా అతని చేతులు తలుపుల్ని గడియ వేశాయి.

"అబ్బా! ఎంత గట్టి వారండీ మీరు" అన్నది తాయారు.

"హె!" అంటూ లేచాడు అవతారం. సన్నగా ఈల వేశాడు.

"నేనంటే ఏమనుకున్నావ్ తాయారూ! నా పేరే శృంగార లీలావతారం!" అన్నాడు.

రెచ్చగొట్టబడిన కోరిక తీరని తాయారుకి పిచ్చెక్కినట్టుగా ఉంది. అయినా... ఈ సారి 'ఏడిశావ్ నీ బొంద! ఏం చేశావ్ గాబట్టి మీసం మెలేశావ్?' అనుకోలేదు మనసులో.

కారణమేమంటే... ఈ మధ్య తాయారుకు చింపాంజీ లాంటి అవతారం మీద అప్పుడే తీసిన తాటి ముంజెలంత ప్రేమ ఎక్కువయింది.

ఏమిటీ కథ అంటే... అవతారం ఆమెను ఆనందపు టంచుల వరకూ తీసుకెళ్ళి అక్కడ ఉంచైటం కాదు!

ఆ విషయంలో అతను అశక్తుడనీ... అసమర్థుడనీ ఆమెకు తెలుసు!

అందుకే ఇచ్చింది ఒకరిద్దరు స్టాఫ్ మెంబర్లకు అలుసు!

మరేమిటయ్యా... తాయారు అవతారానికి షోడశోపచారాలు చెయ్యటానికి కారణం అంటే... ఉంది!




విసుగొచ్చేట్టు అడిగితేనే గానీ... చీరలు కొనని అవతారం... ఈ మధ్య కూరలు కొన్నట్టుగా ఓ అరడజను డిజైను చీరలు కొనిపడేశాడు... భుజాలు తట్టి మరీ చెప్పి... బజారు తీసుకెళ్ళి చాక్లెట్లు కొన్నట్టు మాచింగ్ జాకెట్లు కొనిపెట్టాడు.

చేగోడీలు కొన్నట్టు బాడీలు కొనిపెట్టాడు. అతని లుంగీల బదులు ఆమె లో లంగాలు కొన్నాడు.

అంతేకాదు!

"బంగారం లేకపోతే ఆడదాని వంటికి సింగారమేముందోయ్" అన్నాడు.

ఊ పొండి! మీరు మరీను" అంది – అతన్ని కౌగిలించుకుని ముద్దు పెట్టేసుకుని.

ఆ తీపిలో తాపీగా బంగారపు కొట్టు దగ్గరకు తీసుకెళ్ళాడు అవతారం.

మధ్యలో సరసంగా అంది తాయారు మీ జుట్టు ఉంగరాల జుట్టు వాళ్ళ కన్నా బాగుంటుందని.

తన బట్ట తల సంగతి తాత్కాలికంగా మరిచిపోయిన అవతారం తాయారుని రిక్షాలోనే ముద్దు పెట్టేసుకుందా మనుకొన్నాడు. కానీ వెంటనే ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.. కొంటి కుర్రవాళ్ళెవరయినా పబ్లిక్ ప్లేసులో తను చేయబోయే పనిని తాయారుతో రిపీట్ చేస్తారేమోనని భయపడిపోయి.

చెవులకి రింగులు కొన్నాడు అవతారం. అప్పటి వరకూ పెట్టుకున్న రోల్డ్‌గోల్డ్ రింగుల్ని అవతల గిరాటెయ్యచ్చులే.. అనుకుంది తాయారు.

"మీ ప్రేమ నాకు తెలుసు! ఆ చేత్తోనే చేయించండి ఓ బంగారు గొలుసు.. మెళ్ళోకి!" అంటూ మోచేత్తో ప్రేమగా పొడిచింది మొగుణ్ణి.

'ఐస్' అయిపోయిన అవతారం – "బలే నైస్‌గా గుర్తు చేశావ్?" అంటూ రెండు వరసులు పెట్టి గొలుసు చెయ్యటానికి ఆర్డరిచ్చాడు – అత్యవసరంగా.

ఆ తరవాత ఇద్దరూ కలిసి... మనోరమ ఎ. సి.కి వెళ్ళారు.

టిఫిన్ తింటున్నంత సేపూ తాయారు చేతిని నొక్కుతూనే ఉన్నాడు అవతారం.

'చిలిపి' అంది... అతనికి మాత్రమే వినిపించేంత మెల్లగా తాయారు.

"తిను అట్టులో గట్టి చట్నీ కలిపి" అన్నాడు అవతారం.

ఆ తరవాత ఇద్దరూ కలిసి ఇంగ్లీషు సినిమాకి వెళ్ళారు.

ఇంటికి వెళ్ళిన తరవాత... తాయారుని కౌగలించుకుని ఉక్కిరి బిక్కిరి చేశాడు.

"మీరెంత మంచివారండీ... బంగారపు సంచిలాంటి వారండీ" అంది మెచ్చుకోలుగా.

అదేమిటో అర్థంకాక బెలూన్‌లా ఉబ్బిపోయాడు అవతారం.

కానీ తాయారు వెంటనే చన్నీళ్ళ స్నానం ఎందుకు చేసి వచ్చిందో తెలుసుకునే జ్ఞానం లేదు అతనికి.

"ఏమండీ?" అంది భర్తతో.

"చెప్పు తాయారూ?"

"మరి?"

"సరి! కానీ..."

"ఇంత డబ్బు మీ కెక్కడిదండీ?"

"బలేదానివే తయారు నువ్వు" నవ్వాడు.

"నవ్వాపి నిజం చెప్పండి.

"తప్పదంటావా?"

"అనే గదండీ అడిగేది?"

"నా హోదా ఏమిటి?"

"మీరు సాదాగానే వుంటారుగా? ఇంకా హోదా ఏమిటి?"

"మర్చిపోయావా తాయారూ? నేను నీ పతినేకాక మరో దానికి అధిపతిని.

"ఓ అదా! పొరపాటయిందండీ. రేపు కరివేపాకు వేసి ఉప్మా

## విజ్ఞానం – వినోదం

బాబ్ బ్రౌ

### సమస్య

ప్రేరణ వలన అయస్కాంతీకరణ

### అవసరం

ఒక అయస్కాంతం,
రెండు పేపరు క్లిప్పులు

### ఇలాగ చెయ్యాలి

రెండు పేపరు క్లిప్పులను అయస్కాంతానికిఒక దానికి ఒకటి బొమ్మలో చూపిన విధంగా వ్రేలాడ తియ్యాలి. పై క్లిప్పును అయస్కాంతం నుండి వేరు చేసిన రెండవ క్లిప్పు పడిపోతుంది.




### ఎందుకని?

మొదటి క్లిప్పు అయస్కాంతాన్ని తాకగానే అయస్కాంతత్వాన్ని పొందుతుంది. ఇది రెండవ క్లిప్పును పట్టుకుంటుంది. కానీ మొదట క్లిప్పును అయస్కాంతం నుండి వేరు చేస్తే అది అయస్కాంతత్వాన్ని కోల్పోతుంది అందువలన రెండవ క్లిప్పు పడి పోతుంది. అయస్కాంతాన్ని తాకి ఉన్నంత సేపు క్లిప్పు అయస్కాంతం లాగే పని చేస్తుంది. కానీ అయస్కాంతం నుండి వేరు చేస్తే అది దాని ధర్మాన్ని కోల్పోతుంది.

పేపరు క్లిప్పులు మెత్తని ఇనుముతో తయారయినవి. అవి ఉక్కులాగా అయస్కాంతత్వాన్ని శాశ్వతంగా పొందజాలవు.

---

చేసిపెడతాలెండి '

'అద్సరేలేవోయ్! ఇంతకీ నేను ..'

"నా పరధ్యానం సంతకెళ్ళ! మీరు నిందా నివారణా కార్యాలయానికి అదిపతిగదూ?"

'గుడ్! అవునా?"

'అవునుగదా!"

నిందలువేసిన వాళ్ళని చీల్చి చెండాడి. నిందలు వెయ్యబడ్డ వాళ్ళని వేటాడి వెంటాడి వాళ్ళ గతుకు బతుకుల్ని అతుకులువేసి సరిచేసి ... వాళ్ళ ముఖాల్లో సంతోషం గంతులేసేట్టు చెయ్యటమేగదా నా వృత్తి మరియు ప్రవృత్తి "

"అవునుగదండీ!'

'ఇలాంటి కేసు ఒకటి గట్టిది తగిలింది దాన్లో బాగా లాభం మిగిలింది."

"లాభం అంటారేమిటండీ మీరు చేసింది ఏమన్నా వ్యాపారమా ఏమిటి?"

'ఛ ఛ వ్యాపారమా . ఛ్ఛెఛ్ఛె. అదికాదోయ్ తాయారూ! అది ప్రజాసేవ అసలైన సిసలైన ప్రజాసేవ.

'మరి వాడెవడండీ . మిమ్మల్ని ఆరోజున మోటారుసైకిలుమీద ఎక్కించుకెళ్ళాడు?"

"వాడా నా చిన్ననాటి స్నేహితుడులే వాడూ నేనూ ఈలలు వేస్తూ, గోలీలు ఆడుకుంటూ గోలలు చేసుకునేవాళ్ళం "

అందుకనేనా! ఇప్పుడుకూడా అప్పుడప్పుడూ ఈలలు వేస్తుంటారు?"

'కనిపెట్టావోయ్ తాయారు "

ఇంతమంచిపని చేస్తున్నారుగదా! మిమ్మల్ని పెద్దపెద్దవాళ్ళెవరూ మెచ్చుకున్నట్టు కనపడదేమండి?"

'నాది నిస్వార్థ ప్రజాసేవ తాయారూ. మెచ్చుకోళ్ళకోసం. తట్టిచ్చి సన్మానం చేయించుకునే చచ్చుపుచ్చు అలవాటు నాకు లేదోయ్ అయినా యివన్నీ నీకెందుకుగానీ . నాక్కావలసింది ఇస్తావా ఇంకోసారి"

"వద్దండీ!" సిగ్గుపడుతున్నట్టు నటించింది తాయారు

"హెహె" అన్నాడు అవతారం

"మీ పేరే వీర.... శృంగార ... లీలావతారం కదండీ.. ఎలా మరిచిపోతాను? ఇక నిద్రపోతాను "

"బజ్జో నా బుజ్జి తాయారూ!"

* * * *

మధుసూదనం గారింటికి పోస్టులో కరపత్రాలు వచ్చినరోజు సాయంత్రమే నిర్మల వచ్చి కలిసింది మృదులని

శోకదేవతలా వుంటుందనుకున్న మృదుల రికామీగా కనుపించటం ఆశ్చర్యమేసింది నిర్మలకు.

"బ్రేవో ' అంటూ భుజం తట్టింది నిర్మల "మృదులా! నేను నీకు సానుభూతి చూపించటానికి మాత్రమే రాలేదు" అంది

ప్రశ్నార్థకంగా చూసింది మృదుల

ఈక్లిష్ట సమయంలో నీకు కేవలం సానుభూతి మాత్రమే చూపించి.. . తప్పుకుపోవటం స్నేహధర్మం అనిపించుకుంటుందని నేననుకోను అందుకని. . నావల్ల అయ్యేపనిని చిత్తశుద్ధిగా, మనస్ఫూర్తిగా చేసిపెడతాను డోంట్‌వర్రీ!" అంది.

నిర్మలంటే అభిమానం ఎన్నోరెట్లు పెరిగింది మృదులకి.

"ఇప్పుడేం చేద్దామనుకుంటున్నావ్?" అంది నిర్మల

"మామిడిపండు వేసుకుని హాయిగా భోంచేసి .. టి. వి. చూద్దామనుకుంటున్నాను."

కంగుతింది నిర్మల.

"లేకపోతే ఏమిటే నిమ్మూ! నేను ఏదో ఒకటి ఆలోచించి చేస్తానని లోగడ నువ్వేకదుటే చెప్పావ్? ఇప్పుడిలా అంటే నేనేం చెప్పేదే?" నిష్ఠూరంగా అంది మృదుల.

"పిచ్చీ! నువ్వేమంటావో అని వూరికే అడిగాను తప్ప నిన్ను గాలికి వదిలేస్తాననుకున్నావుటే. . నీ పాంప్లెట్లు ఎప్పుడయితే మా నాన్నగారి అడ్రసుకు మా యింటికి వచ్చాయో ? అప్పుడే అనుకున్నాను ఏదో పథకం పన్ని నిన్నీ ఊబి నుంచి బయటకు లాగాలని "

"మావాళ్ళంతా కూడా ఏదో చెయ్యాలని చూస్తున్నారు మరి?"

'వాళ్ళదారి వాళ్ళదే మనదారి మనదే "

"ఏం చేద్దామంటావు మరి?"

"నేనడిగినవాటికి సూటిగా సమాధానం చెప్పు '

"అడుగు "

గుసగుసగా కొన్ని ప్రశ్నలడిగింది నిర్మల

అంతకన్నా మెల్లగా ప్లెయిన్‌గా సమాధానాలు చెప్పింది మృదుల

"భేష్!" అంది నిర్మల

"హుష్!' అంది మృదుల "నెమ్మది! ఎవరన్నా విన్నారంటే కొంపములుగుతుంది' పెదవులమీద చూపుడువేలుంచి వారించింది మృదుల

"గుడ్‌లక్ పార్ట్నర్" అంది నిర్మల

నిర్మల చెయ్యి మృదువుగా నొక్కి వదిలేసింది మృదుల.

* * * *

రోజులు గడుస్తున్నాయి

రాఘవయ్యగారు.... రవికాంత్ కలిసి..... 'వసంతకి కూడా సంబంధాలు

చూడటం మొదలుపెట్టారు ఈ విషయంలో పత్తిడంతా రాఘవయ్యగారిదే! ఆ రోజున వాళ్ళ మాటలు విన్నదగ్గర్నుంచీ రాఘవయ్యగారి మనసు మనసులో లేదు. ఎంత తొందరగా వసంతకి కూడా పెళ్ళిచేసి పంపించి రవికాంత్ మీదపడ్డ నింద తొలగించి అతన్నో యింటివాణ్ణి చేసి, తన చేతులు కడుక్కుందామా అని చూస్తున్నారాయన లేకపోతే రానురాను తన కొడుకుమీద ఆరోపింపబడిన నిందా ప్రచారం ఏ విషస్వరూపం దాలుస్తుందో పండంటి తన కొడుకు నిండు జీవితాన్ని ఎలా నిలువునా కాలుస్తుందో అని ఆయన భయం!

ఒక వారం రోజులు నిర్విరామంగా ప్రయత్నాలు చేసేసరికి దైవం అనుకూలించినట్టుగా వారి కృషి ఫలించింది

వసంతకి కూడా తగిన సంబంధం కుదిరింది మరొక విశేషమేమంటే శూన్య మాసాలు మూఢమిల వల్ల నాలుగు నెలల తరవాత లభ్యమయ్యే పెళ్ళిముహూర్తాల్లో వసంతని వాళ్ళబ్బాయికి చేసుకోటానికి ఒప్పుకోవటమేకాకుండా ఆమె బి ఏ. రెండో సంవత్సరం చదువు కొనసాగించటానికి కూడా అంగీకరించారు గ్రాడ్యుయేట్ కోడలయితే ఏదో ఉద్యోగం చేయించుకోవచ్చుగదా అని వాళ్ళ ఉద్దేశం కాబోలు! సంబంధం కూడా విజయవాడదే అవటం కలిసివచ్చిన మరో అదృష్టం!

కాళ్ళ చెప్పులరిగేట్టుగా ఊళ్ళు తిరిగినా. . ఏళ్ళ తరబడి ఆడపిల్లలకు సంబంధాలు దొరకని కుదరని ఈరోజుల్లో యింత స్వల్పవ్యవధిలో తన రెండో అమ్మాయికి కూడా సంబంధం కుదరటం . రవికాంత్ కృషికి ఫలితం . పైన శాయినాథుని అనుగ్రహంగా భావించారు రాఘవయ్యగారు

తల్లిగా సీతమ్మ ఆనందానికి అవధుల్లేవు

కొడుకుని ఎంతగానో మెచ్చుకుంది మనసులో.

ఒకే మాఘం లోనే అయిన చెల్లెమ్మల పెళ్ళిళ్ళు..... ఇకమీదట బామ్మగారి కెంతో హాళ్ళూపెళ్ళూ!" అంటూ హాస్యం పట్టించాడు రవికాంత్

ఇవంతా అన్నగారి చలవ దీంతో అయిపోతోంది ఆయన చేసిన డబ్బునిలవ!' అన్నయ్యపట్ల కృతజ్ఞత మెరిసింది పద్మిని వసంతల కళ్ళల్లో

రేపు - నిమ్మకాయ కారం చెయ్యటానికి ఇవ్వాళే ప్లానుచేసుకుంటున్న బామ్మగారు రంగప్రవేశం చేసిందా సమయంలో.

ఒసేయ్ భడవఖానాలూ మీకు ఏర్పడబోతున్నయ్ బందీ ఖానలు!' అంది ఫక్కున నవ్వుతూ

పద్మిని, వసంతలు నవ్వలేకపోయారు బామ్మగా రంటున్నదేమిటో వాళ్ళకి అర్థం కాలేదు

"శుభమా! అని మన పెళ్ళిళ్ళు జరగబోతుంటే జైలు పేరెత్తుతుందేమిటే బామ్మ?" అని తుళ్ళిపడ్డారు

"ఏం బామ్మా! మమ్మల్ని జైలుకు పంపించాలని చూస్తున్నావేమిటి? నిన్ను మేమిద్దరం కలిసి రైలుకు పంపిస్తాం కాశీయాత్రకి" అంది పద్మిని చిరుకోపంగా

'ఏం బామ్మా! మమ్మల్ని జైలుపాలుచేస్తే నేనూరుకుంటానా? చేస్తాను నీ పత్తివత్తులు. . నేలపాలు! అసలు మేం నీకు ఏం అపకారం చేశాం?'

"నువ్వు పంచాంగం అడిగితే . మంచంకిందపడివున్నా కూడా వెతికి... తీసి యిచ్చినందుకా?

"దడిమీద వేసిన నీ మడి బట్టలు .. గుడికెళ్ళేంతవరకూ ముట్టుకోమని ఒట్టుపెట్టుకున్నందుకా?"

"పురాణానికని వెళ్ళి స్థంభానికానుకొని నువ్వు గుర్రుపెట్టి నిద్రపోతుంటే నాన్నగారు చిర్రుబుర్రులాడుతుంటే .. గుట్టుచప్పుడుకాకుండా నీ వీపుతట్టి లేపుకువచ్చినందుకా?"

వంకాయ కూరలో నువ్వు కారం ఎక్కువేస్తే.... ఎవరికీ తెలియకుండా




యథార్థమైన బంధువులని చెప్పుకో దగిన వారు బంధువుల్లో చాలా తక్కువగానే ఉంటారు. కొందరికి బంధువులతో కంటె స్వార్థంతోనే బంధుత్వం ఎక్కువ. ఎవ్వరయినా తమ దూరపు చుట్టాలు, ఉన్నత పదవుల్లో ఉండి, గొప్ప కీర్తిని సంపాదిస్తే, ఏదో దగ్గరి చుట్టరికం చెప్పి "వారు మావారే అని నలుగురితోనూ చాటుకుంటూ, దానివల్ల ప్రయోజనం పొందడానికి ప్రయత్నిస్తారు. దగ్గరి బంధువు లెవరైనా చాలా హీన స్థితిలో ఉండి కష్టాలు పడుతున్నప్పుడు "వాళ్ళు మావాళ్ళు కారు. ఏదో చాలా దూరపు బంధుత్వం ఉంటే ఉండవచ్చు" అని, సహాయం చెయ్యక తప్పించుకుంటారు. ఇదీ స్వార్థపరుల లక్షణం.

స్వభావ సంప్రదాయాలు తెలియని అపరిచితులతో వియ్య మందడం కంటె బాగా పరిచయం కలిగి, స్వభావాదులు తెలిసిన బంధువులతోనే బాంధవ్యం కలపడం మంచిదని తలచి కొందరు అమాయకులు తమ అమ్మాయిని కోడలుగా చేసికొమ్మని ప్రార్థింపగా, స్వార్థపరులైన ఆ బంధువులు "మీతో సన్నిహిత బంధుత్వం కలపడం మాకెంతో ఇష్టం. మా అబ్బాయి అమ్మాయిని నచ్చితే చాలు. నిరభ్యంతరంగా వివాహం జరిపిస్తాము" అని బయటికి చెప్పినా "ఇంత కట్నం అడుగు" అని ముందుగానే తమ కుమారునికి గట్టిగా బోధించడం వల్ల ఆ సంబంధం బుసిగిపోవడం చాలా చోట్ల కానవస్తున్నది. మర్యాదను నటిస్తూనే స్వార్థాన్ని కప్పి పుచ్చేవారి పద్ధతి యిది.

ఇలాగే మరొక రకం వారు కూడా ఉన్నారు.

ప్రభుత్వోద్యోగులకు గాని, ఇతర సంస్థలలోని వారికి గాని, వారి యజమానులు వినోద యాత్రలకు ఇచ్చే సొమ్మును చాలా వరకూ మిగుల్చుకుంటూ, పేరుకు మాత్రం యాత్రకు బయలుదేరి బంధువులున్న పట్టణాలు చేరి, ఆయా బంధువుల ఇళ్లలో కాలం గడపడం ఒక పద్ధతి. ఎన్నడూ ఆ బంధువులను స్మరింపక పోయినా "మిమ్మల్ని చూచి ఎంతో కాలమయింది. మిమ్మల్ని చూడడానికే వచ్చాము" అని ఆప్యాయంగా మాటలాడుతూ, తమ సౌకర్యాలను చూచుకొంటూ కొన్ని రోజులు గడుపుతారు, వారు ఏమనుకుంటారో అనే మొగమాట మయినా లేకుండా, రైలులో రిజర్వేషను దొరకలేదనో, ఆరోగ్యం ప్రయాణానికి అనుకూలంగా లేదనో ప్రయాణాన్ని వాయిదా వేస్తూ ఉంటారు. ఎలాగో రథం కదిలించి తమ ఊరు చేరిన తర్వాత- తమకు ఆతిథ్యం యిచ్చి ఆదరించిన ఆ బంధువులను తలవనైనా తలవరు. ఇలాటి స్వార్థ పరులను దూరంగా ఉంచడం ఎంతో అవసరం.

—బులుసు వేంకటరమణయ్య

ఉప్పుకలిపి నీ మర్యాద కాపాడినందుకా?"

"నీ కళ్ళజోడు బిళ్ళకుడుముల మధ్య పారేసుకుని.. మడి తుండు దణ్ణంమిద ఆరేసుకుని..... దానిచాటున నువ్వు బాధపడుతుంటే.. ఆ గోడు చూడలేక బామ్మోయ్! ఇదిగో నీ కళ్ళజోడు.... నేను తీసి మరిచిపోయాను.. అంటూ ఎలుగెత్తి అరిచి చెప్పి. తప్పు నా నెత్తిమీదవేసుకున్నందుకా?"

"నువ్వు ఉపవాసాలుచేసినప్పుడు.... బొంగురు గొంతుతో గోవింద నామాలు చదువుతున్నప్పుడు.... నిన్ను అపహాస్యం చెయ్యనందుకా?"

"ఓసి! ఓసి! ఓసి! భడవఖానాలు. ఆపండేబాబూ! మీ తిట్లఫర్మానాలు. ఊరుకుంటే..... తెల్లవారేవరకూ చల్లనీళ్ళుకూడా తాగకుండా దాగించేట్టున్నారేమే? నేను మాత్రం ఏం కానిమాటన్నానే? మంగళసూత్రం ధరించబోయే మనమరాళ్ళూ? కాసిని తినండే మరమరాళ్ళు!"

"లేకపోతే ఏమిటి బామ్మా? మా పెళ్ళిళ్ళవి పట్టుకుని జైళ్ళు అంటావా?"

"అంటానే...... మళ్ళీ మళ్ళీ అంటానే!"

"ఏడు బామ్మా! ఇంతయిది నీకుతగదు సుమా!"

"పిచ్చికూనల్లారా, వినండే.... ఆడదానికి బాల్యమనే జైలులో తండ్రి జైలుఅధికారి! యవ్వనమనే జైలులో భర్త జైలు అధికారి.... ముసలితనమనే జైలులో కొడుకు జైలు అధికారి. అయితే ఇవి కటకటాల జైళ్ళు కావే! మమతల కవాటాలజైళ్ళు! అందుకే ఈ జైళ్ళలో ఆడదాని జీవితం. .. భద్రంగా..... హాయిగా. .. సురక్షితంగా వుంటుంది. ఇప్పుడు తిట్టండే మీ బామ్మని.. . తిట్టండే?"

"సారీ బామ్మా!"

"సారీ నాయనమ్మా!"

"వాటిని మెయ్యటానికి నేను లారీ ఎక్కడ్నుంచి తేనుగానీ.... త్వరగా రండి .... బెండకాయ వేపుడు మంచి పోపువేసి చేశాను. ఘుమ ఘుమాయించిపోతోంది తిందురుగాని "

బామ్మ మనవరాళ్ళ హాస్యవల్లరి వింటున్న శ్రోతలు – రాఘవయ్యగారు... సీతమ్మ – రవికాంతుల్ని ఆనంద పరవశుల్నిచేసింది.

పడుకోబోయేటప్పుడు – 'ఇక తనకి లైన్ క్లియర్ అయినట్టే' –సంతృప్తిగా అనుకున్నాడు రవికాంత్. అతని కళ్ళల్లో లీలగా మృదుల మెదిలింది.

(ఇంకాఉంది)

# ధర్మం

ఇందూ రమణి

మాఘమాసం!

' పెళ్ళిళ్ళసీజను పురోహితుల హడావిడి వంటబ్రాహ్మణుల ఆదరాబాదరా!

అది మాఘ మాసంలో ని తొలివారం

ఆ వూరు ప్రముఖపుణ్య క్షేత్రం వైష్ణవాలయాల్లో ప్రముఖంగా పేరెన్నికగని ప్రసిద్ధి చెందిన దేవాలయం గల గ్రామం అది.

ఆ రోజు ఆదివారం!

ఆదివారం అన్ని వారాలకంటే రద్దీరోజు దైవదర్శనానికి మేలిమిరోజు. అదీగాక, ఆ మాసం వివాహాలకాలం కావడంతో మరింత రద్దీగ వుందారోజు

నర్సమ్మ దేవస్థానం కచ్చేరి గంటలు విన్పించగానే మెట్లమీదనుండి వులిక్కి పడిలేచింది రెండు గంటలు దాటింది సమయం అప్పటికీ యాత్రీకులు కోనేరులో స్నానం చేసి అంత చీకటిలోనూ భజనచేసుకుంటూ తండోపతండాలుగా కొండ మెట్లెక్కుతున్నారు.

ప్రక్కనే ఆదమరిచి హాయిగా కునుకు తీస్తున్న పదేళ్ళ కొడుకుని తట్టి . తట్టిలేపింది నర్సమ్మ

బద్ధకంగానే లేచాడు అప్పన్న

అప్పన్నకి తల్లేవరో తెలుసుగాని తండ్రెలా వుంటాడో ఏనాడూ చూడ్లేదు వాడు తల్లే తనకి తల్లీదండ్రీ అయి పెంచుతోంది

"ఒరేయ్ అప్పన్నా! బేగా పళ్ళు తోముకోరా! చూసావా! యాత్ర ఎలా వచ్చిందో! ఇయ్యాల ఇప్పట్నుండే మనం మెట్లమీద గుడ్డలు పరవకపోతే మనోళ్ళందరూ స్థలం ఆక్రమించేస్తారు లే!'

'ఏందే అమ్మా! నువెళ్ళి పరవకపోయావా! నిన్న రాతంత్రా మెట్లమీదేకదే కూర్చుని. కూర్చుని కునుకు తీరక చచ్చింది. కాసింతసేపు కన్ను ముయ్యనియ్యే!"

"ఏందిరా నీ సోకు! డబ్బులు దండిగా రాలే ఈ ఆదివారం పడుకుంటావా! లే! లేచి బేగా మొహంకడుక్కో! టీ తెస్తాను."

నర్సమ్మ పరిగెడుతున్నట్టే బజారుకు వెళ్ళి చెంబుతో టీ పట్టుకొచ్చింది. అప్పటికే అప్పన్న మొహంకడుక్కుని తన వేషం రెడీ చేసుక్కూర్చున్నాడు

అప్పన్న దబ్బపండులా అందంగానే కాక నిటారుగా నిలబడితే పదేళ్ళ కుర్రాడి కుండాల్సిన పర్సనాలిటీ కాదనుకుంటారు అలాంటి అప్పన్నని యిప్పుడు చూస్తే ఈ కుర్రాడికి కాళ్ళులేవా? అని నోళ్ళు ఆపలిస్తారు ఎవరైనా! అంత జాగ్రత్తగా తన రెండు కాళ్ళు ఫేంటులో మడిచి ముడుకుల దగ్గర రబ్బరుతొడుగుతో చొట్టవాడిలా తయారయ్యాడు

అది ఆ పుణ్యక్షేత్రంలో చాలామంది యాచకులు వేసే విచిత్రవేషం నర్సమ్మ కూడా కొడుక్కి టీ యిచ్చేసి తాను త్రాగి గోనె సంచులు మెట్లమీద పరచింది

ఆమె ఓ గోనెసంచి మీద కూర్చుని, గ్రుడ్డిదాన్లా నటిస్తూ అడుక్కోవడం ప్రారంభించింది

యాత్రికు లెవరూ అప్పన్నకేసి చూసిన తమ చేతిలో వున్న చిల్లర జాలితో అతని జోలిలో జార్చకమానరు.

అంత హృదయవిదారకంగా అరుస్తూ అడుక్కుంటున్నాడు అప్పన్న

"తల్లీ దండ్రీ లేనోన్ని తల్లి కాళ్ళు లేక ఆకలితో దిక్కుతోచక అల్లాడుతున్నాను తండ్రీ. బాబూ! అమ్మా! దర్మం చేయండి నాయనా!"

అప్పన్న గొంతులో ఎన్నో త రాల నుండీ రోదిస్తున్న ఆర్తుడి ఆర్తనాదం విన్పిస్తోంది అందరికీ.

నర్సమ్మ కూడా తన కెవరూ లేరని . తా నేకాకినని. కళ్ళులేని కబోదినని కీచుగా ఏడుస్తూ యాచిస్తోంది

అప్పటికీ తెలతెలవారుతోంది జనం రద్దీ



విపరీతంగా పెరిగి కొండపైకి వెళ్ళేమెట్ల నిండా పారేవరదలా జనం

మెట్ల కిరువైపులా ముష్టివాళ్ళు వందల సంఖ్యలో గోనెసంచులు పరుచుకు కూర్చున్నారు.

కొందరు దేవుడి పటాలు పెట్టుకు అడుక్కుంటున్నారు. ఇంకొందరు పళ్ళెంలో పసిపిల్లాడిని పెట్టి యాచిస్తున్నారు. సాధువులు గంజాయి త్రాగుతూనే యాచిస్తున్నారు.

కొండమీద కోవెల్లో నుండి సుశీల పాడిన సుప్రభాతం గాలి అలల్లో తేలి క్రింద శ్రావ్యంగా విన్పిస్తోంది

యాత్రీకులు మూకుమ్మడిగా "గోవిందా... గోవిందా!" అంటూ అర్చుకుంటూ మెట్లెక్కుతున్నారు.

* * * * * * *

నర్సమ్మ ఎక్కడ పుట్టిందో ఎవరికీ తెలీదు. పదేళ్ళ వయస్సులో ఆ వూరు వచ్చింది ఆ ఇంట్లో... యీ ఇంట్లో పనికి కుదిరి కుదురుగా పనిచేసుకుపోయేది

అయితే అమె యవ్వనంలో అడుగుపెట్టిన దగ్గర్నుండీ అందరు ఆడపిల్లల్లాగే అమెకీ మగాళ్ళ కష్టాలు అరంభమయ్యాయి.

కంచెలేని చేను కంటికి యింపుగా అగుపిస్తుందంటారు

ఎవరికి ఎలా లొంగిపోయిందో. , ఎందరు ఎలా అమెని లొంగదీసుకున్నారో ఎవరికీ తెలియదు.

పద్నెనిమిదేళ్ళకే అమె గర్భవతి అయింది.

పాచిపని పోయింది తిరుగుబోతు ఆడదానివని ప్రజలు వెలివేసారు. ఏం చేయాలో తోచక మెట్లమీదకొచ్చి కూర్చుంది. ఆ కూర్చోవడం . . కూర్చోవడం అలా యిప్పటికీ ఏడళ్ళవయసు కొడుకున్నా యాచకత్వాన్నే వృత్తిగా స్వీకరించి తనయుడ్ని సాకుతోంది.

ఇప్పటికీ ఆ వూర్లో వ్యాపారులేమిటి. . వయసులో వి్రవీగే కుర్రకారులేమిటీ.... ఆఖరికి కాటికి కాళ్ళు చాపుకు కూర్చున్న పండు ముసలాళ్ళు కూడా ఆమె అందానికి... ... యవ్వన సోయగాలికి దాసోహమ్మై అమెదారికి అడ్డుగా నిలబడేవుంటారు.

అదను దొరికితే కాటెయ్యాలనే కాపుకాచేవుంటారు.

* * *

తొలి పాంచా దగ్గర కొబ్బరికాయ కొట్టేసి మేట్లమీద పరిగెడుతున్నారు యాత్రీకులు. ముష్టివాళ్ళ అరుపులు ఎవరూ పట్టించుకోవటం లేదు. కొందరు పట్టించుకున్నా చిల్లరలేదని చెయ్యి విదిలిస్తున్నారు

అయినా ఓపికగొ అలా అరుస్తూనే వున్నారు నర్సమ్మ, అప్పన్న. నర్సమ్మ గోనెసంచిమీద చిల్లర అంతాలేకపోయినా, అప్పన్న పట్టామాత్రం నిండుగా చిల్లరనాణేలతో తళతళ మెరుస్తోంది.

ఎండ పల్చగా ప్రప్రంచాన్ని పర్చుకుంటోంది. యాత్ర కూడా దిగే యాత్రీకులతోనూ, ఎక్కే భక్తులతోనూ మెట్లదారి పెద్ద రైల్వేజక్షన్‌లా వుంది.

మెట్ల కిరువైపులా పచ్చని లోయ, ఆ లోయల్లో అనాస పనస తోటలు

సింహగిరి శిఖరమంతా పచ్చగా మెరుస్తోంది

అప్పన్నకి గొంతు ఎండుకుపోతోంది అరచి అరచి నోరు పిడుచకట్టుకుపోయింది. దగ్గర్లో మంచినీళ్ళు లేవు

మెట్లకు కొంచెం దూరం గోడప్రక్క ఓ మూల తమ సామాన్లు వున్నాయి మంచినీళ్ళకుండ కూడా అక్కడే వుంది ఏం చేయాలో అప్పన్నకి అర్ధంకాలేదు.

తల్లికేసి దీనంగా చూసాడు అప్పన్న నర్సమ్మ కొడుకు దీనమైన చూపుచూసింది. కానీ తిరిగి చూడలేదు.

"అమ్మా!" నెమ్మదిగా అన్నాడు అప్పన్న

"ఏరా?" చూడకుండానే అంది నర్సమ్మ.

"దాహమేస్తోందే!"

"ఎలారా! అందరూ మనల్నే చూస్తున్నారు. ఎలా వెళ్ళను?" దీనంగా అంది నర్సమ్మ.

"పోనీ, నే వెళ్ళి తేచ్చుకోనా?"

"అమ్మో ఎలా వెళ్తావురా? అందరూ మనల్నే చూస్తున్నారు. కొంచెం ఓపికపట్టు. జనం రద్దీ తగ్గేక 'టీ' తెస్తాను తాగుదువుగాని" నర్సమ్మ కొడుక్కేసి చూడకుండానే నెమ్మదిగా అంది.

అమె ఎవరికేసి చూడట్లేదు కంటిలోని నల్లగ్రుడ్లు రెండూ రెప్పల క్రింద దాచేస్తూ మొహం అకాశం దిక్కుపెట్టి దీనంగా అడుక్కుం



టోంది.

తల్లి మాట వింటూనే అప్పన్న తన కాళ్ళదిక్కు చూసుకున్నాడు.

తనిప్పుడు కాళ్ళులేని అవిటివాడు. అవును. తాను ఎలా నడిచి వెళ్ళగలడు? అలా వెళ్తే ఈ జనమంతా తను మోసంచేసి అడుక్కుంటున్నాడని అల్లరి పెట్టరూ?

అయినా, నిజాయితీగా అడుక్కుంటే ఎవరు పైసలు వేస్తారు?

నిజాయితీగా ఈ మెట్లమీద కూర్చునే యాచిస్తే, ఎంతమంది ఎన్నిరకాలుగా తిట్టలేదు.

"కాళ్ళు, చేతులూ చల్లగా వుండి అడుక్కోవటానికి మీకు సిగ్గులేదర్రా?" అని ఎంతమంది తమని ఆడిపోసుకోలేదు.

తమతోటివాళ్ళందరూ ఇలాగే మోసంతో నాలుగు రాళ్ళు సంపాదిస్తున్నారు. తాము కూడా వాళ్ళలాగే కళ్ళుండి – కబోధులైతే తప్పేమిటి? కాళ్ళు లేని అవిటివాళ్ళయితే నేరమేమిటి?

తామీ వేషం వేసిన దగ్గర్నుండీ రెండుపూటలూ సుష్టుగా భోజనం చేస్తున్నారు.

మధ్యాహ్నం పన్నెండయింది.

జనం రద్దీ ఇంకా తగ్గలేదు. కొత్తగా పెళ్ళయిన జంటలు .... వాళ్ళతో తోడుగా వచ్చిన వ్యక్తులు కొండపైకి బస్సులో వెళ్ళి దిగేటప్పుడు నడిచివస్తున్నారు. ఎక్కేవాళ్ళకంటే దిగేవాళ్ళ రద్దీ ఎక్కువైంది.

కొంతమంది దిగిరావడంవల్లన కాళ్ళు ఒణుకులు పుట్టి మెట్లప్రక్క సిమెంటు చప్టాలమీద కూర్చుంటున్నారు. అలా కూర్చున్నవాళ్ళు కాలక్షేపం కోసం ముష్టివాళ్ళు ఎవరు ఎలా అడుక్కుంటున్నదీ పరిశీలిస్తున్నారు.

అప్పన్న అందర్నీ పరిశీలిస్తూనే వున్నాడు.

జనం తగ్గే సూచనలు కనిపించటంలేదు. దాహంతోపాటు యిప్పుడు ఆకలితో కడుపు నకనకలాడుతోంది.

నీరసంగానే నెమ్మదిగా అరుస్తున్నాడు అప్పన్న.

అలా అరుస్తూ..... అరుస్తూ ఉలిక్కిపడ్డాడు అప్పన్న.

అప్పన్న కెదురుగా గట్టుమీద రెండేళ్ళ అబ్బాయి. ఇటూ అటూ తప్పటడుగులు వేస్తూ నడుస్తున్నాడు. ఆ పిల్లాడు తాలూకావాళ్ళు కొంచెం దూరంలో దేవుడి గురించి....... దేవుడి మహిమల గురించి మాట్లాడుకుంటున్నారు. ఆ పిల్లాడి తల్లి ఆ మాటల్లోపడి పిల్లాడ్ని మర్చిపోయింది.

అప్పన్న ఆ కుర్రాడ్నే చూస్తున్నాడు. ఆ పిల్లాడు ఆ గట్టుమీదే అటూ యిటూ పరిగెడుతున్నాడు. ఆ గట్టుకి అవతల లోయ. ఏమాత్రం కాలుజారినా ఆ పిల్లడు బంతిలా ఆ లోయలోకి దొర్లుకుపోవడం ఖాయం.

అప్పన్నకి ఆ దృశ్యం కళ్ళముందు మెదిలేసరికి గుండె భయంతో దడదడలాడింది

తల్లికేసి నెమ్మదిగాచూసి అతిమెల్లగా అన్నాడు.

"అమ్మా ఆ అబ్బాయినిచూడు. ఎలా పరిగెడుతున్నాడో!" అప్పన్న అన్నాడు.

"నోర్ముయ్యరా! పరిగెడితే పరిగెట్టని. నేనెలా చూడను?" కోపంగా అంది నర్సమ్మ

"అదికాదమ్మా! ఆ గట్టుమీద చూడు ఎలా గెంతుతున్నాడో?" భయంగా అన్నాడు అప్పన్న.

"గెంతనియ్యరా! మనకేం??" అసహనంగా అంది

"ఆ గట్టుప్రక్కన లోయవుందికదా!" మరింత భయం... భయంగా అన్నాడు అప్పన్న.

నర్సమ్మకి చిర్రెత్తుకొచ్చింది. కొడుక్కేసి కోపంగా చూసి తిట్టాలనుకుంది. కానీ తనని అందరూ పరిశీలిస్తున్నారన్న భయంతో మౌనంగా వుండిపోయింది.

"అమ్మా!"

"ఏంవమ్మా" లాలనగా అంది నర్సమ్మ. పాపం ఆకలితో పిల్లాడు ఎలా అల్లల్లాడుతున్నాడో అనుకుంటూ ప్రేమగా అంది.

"ఆ బాబు. ..." సందిగ్ధంగా అన్నాడు అప్పన్న.

"ఆ బాబు సంగతి మన కెందుకు నాయనా?" చిరాకుగా చిరుకోపంతో అంది ఆమె.

"కాలుజారితే చచ్చిపోతాడే!"

"అయితే, వాళ్ళ అమ్మా నాన్నలకి కేకేసి నెమ్మదిగా చెప్పు."

"ఎలా? ఆళ్ళు చాలా దూరంలో వున్నారు. నా కేక విన్పించదు."

"పోనీలే! మనం ఏం చేస్తాం. ఈ జనం రద్దీ కొంచెం తగ్గితే అన్నం తెస్తాను తిందువుగానిలే!"

తల్లి సమాధానం అప్పన్నని నిరుత్సాహపరిచింది. తన కళ్ళముందు రెండేళ్ళబాబు చావుకి దగ్గర నడుస్తూంటే చూస్తూ వూరుకోవాలా?

ఛటుక్కున లేచాడు అప్పన్న. అంతవరకూ అప్పన్నకి పట్టిన అవిటితనానికి జాలిపడుతున్న జనమంతా కళ్ళు చిట్లించుకు చూస్తూ నిశ్చేష్టులయ్యారు.

కుంటివాడనుకున్న కుర్రాడు లేచి నిలబడేసరికి ఆ వింతచూసి యాత్రీకులందరూ ఉలిక్కిపడ్డారు. మోసంతో అడుక్కుంటున్న ఆ కుర్రాడి అతి తెలివికి కొందరు ఉగ్రులయ్యారు.

అప్పన్న ఎవర్నీ పట్టించుకోలేదు. తారాజువ్వలా పరిగెట్టుకు వెళ్ళి గట్టుమీద అటూ యిటూ పరిగెడుతూ లోయ అంచుకు జోరుకోబోతున్న పిల్లాడ్ని గబుక్కున పట్టుకుని క్రిందకు దించాడు.

అంతవరకూ ఏదో లోకంలో మాటల మైకంలో తేలుతున్న ఆ పిల్లాడి తల్లి దండ్రులు యిహానికి వచ్చి తమ పిల్లాడ్ని అప్పన్న చేతుల్లోనుండి లాక్కున్నారు.

"దొంగవెధవ! పిల్లాడి మెళ్ళో చైను లాక్కోడానికి గట్టుదించేసాడు. పట్టుకోండి! పట్టుకోండి" అంటూ అర్చాడు పిల్లాడి తండ్రి.

ఆ మాటతో అప్పన్న కాదు. నర్సమ్మ కూడా ఉలిక్కిపడింది. కానీ, తల త్రిప్పి తానాదృశ్యాన్ని చూస్తున్నట్టు అందరి కంటపడకూడదని తన కేమీపట్టనట్టు కూర్చుండిపోయింది.

అప్పటికే చాలా మంది అప్పన్నని పట్టుకుని చావబాదుతున్నారు. అప్పన్న అరుపులు నర్సమ్మ హృదయాన్ని తూట్లు పొడుస్తున్నాయి.

"దొంగవెధవ! ఇంతవరకూ కుంటివెధవలా అడుక్కున్నాడు; పిల్లాడు ఒంటరిగా ఉన్నాడని అదును కనిపెట్టి, చైను ఎత్తుకుపోవాలనుకున్నాడు. రాస్కెల్! తన్నండి వెధవని."

ఆ మాట నర్సమ్మ చెవుల్లో పడింది.

జనమంతా నానారకాలుగా తిడుతూ కొడుతున్నా గుడ్డిదాన్నా...... తన కేమీ కన్పించలేనట్లే కళ్ళనీళ్ళ దించుకుంటూ అచేతనంగా వుండిపోయింది నర్సమ్మ.

మిట్టమధ్యాహ్నం –

భక్తుల కోలాహలం మధ్య అప్పన్న ఏడుపు హృదయవిదారకంగా ప్రతిధ్వనిస్తూనేవుంది.

కొండమీద వేలమంది భక్తుల మధ్య తన్మయుడై వున్న సింహాద్రప్పన్న చందనం మధ్య కూరుకుపోయి నిస్సహాయంగా ఆ ఘోరం చూస్తూండిపోయాడు. □

## ప్రియసమీరమా!

వాగర్థ స్వరూపులు
జగమాది వందితులు
సత్కరుణా ప్రపూర్ణులు
జగన్మాతా పితరులు
తుహినాచల శిఖరాగ్ర
మహిత మందిర వాసులు
సకల చరాచర జీవ
సంధాతలు – విజేతలు
పార్వతీ పరమేశుల
పాదారవింద యుగళి
స్పర్శించి పయనింపుము
సమీరమా! సత్వరమె!
స్పర్శించి వేగమె– నా
సమ్ముఖమున కేతెంచి
నా ఫాలమ్మును దాకి
నాకు సమ్మోద మిడుము.
ఆదిదంపతుల పద
స్వాదు సంస్పర్శన మున
విభవ స్రవంతి శుభ
వీచి నోలాడి (వీచికాళినోలాడి)
స్వాత్మ సంశుద్ధవై
సందీపించు వైఖరి
స్పర్శింప నను – ఓ ప్రియ
సమీరమా! రారమ్ము!

–భారతి



“తీవ్రమైన అగ్నిప్రమాదం నా దుకాణాన్ని పూర్తిగా కాల్చివేసినప్పుడు...”

# “నేను తిరిగి తెరిచాను, వెంటనే. యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్ సహాయంతో.”

“నేను నా దుకాణాన్ని ఎంతో ఖర్చుపెట్టి మరెంతో గర్వంతోనూ కట్టుకున్నాను. అయితే నేను కొంత దూరదృష్టి వుపయోగించాను. యునైటెడ్ ఇండియావారి వ్యాపారస్తుల బృహత్తర భీమా పథకం తీసుకోవడం. ఒక అగ్ని ప్రమాదం నా దుకాణాన్ని బూడిదగా మార్చివేసినప్పుడు, నేను నా వ్యాపారాన్ని తిరిగి ప్రారంభించగలిగాను—అందుకు కారణం యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్ నాకు కావలసిన మద్దత్తు అందించడమే.

అగ్ని, అల్లరులు, దొంగతనాలు లేక నిర్లక్ష్యంగా వుండే ఉద్యోగులవలన మీకు చెప్పలేనంత నష్టం కలగవచ్చు. మీది పెద్ద దుకాణమయినా లేక చిన్న కొట్టయినా కావచ్చు. మీ అవసరాలకి ఎంతగానో తగిన యునైటెడ్ ఇండియావారి వ్యాపారస్తుల బృహత్తర భీమా పథకాన్ని స్వీకరించండి.




## యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్ కంపెని లిమిటెడ్

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పరేషన్ ఆఫ్ ఇండియావారి అనుబంధ సంస్థ)
24, వైట్స్ రోడ్, మద్రాసు 600 014

## యునైటెడ్ ఇండియా వారి వ్యాపారస్తుల బృహత్తర భీమా పథకం

యునైటెడ్ ఇండియా ఏజంట్‌ని లేక సమీపంలో వున్న కార్యాలయాన్ని సంప్రదించండి.

HTA-7054

సీరియల్

# మంత్రసర్పం

గంధం

రావినూతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

తూర్పున వెలుగు రేఖలు విచ్చుకుంటున్నాయి.

పక్షులు తమ ఆహారం కోసం హడావిడిగా బయల్దేరుతున్నాయి. కుందేళ్ళు, నెమళ్ళు వుత్సాహంగా, స్వేచ్ఛగా తిరుగుతున్నాయి.

"ఇంక మనం చెట్టు దిగచ్చు" విరుజంతువుల్ని చూస్తూ అన్నాడు అరవింద్.

"అవును" అన్నాడు భట్టు.

"అబ్బ! ఈ రాత్రి ఎంత సుదీర్ఘమైనరాత్రి! కాళరాత్రే.. .. నాకు సూర్యోదయం చూస్తామన్న నమ్మకం లేదు" అంది కాంతి.

భట్టు చెట్టు దిగేశాడు.

కాంతి కూడా దిగబోతూ తక్కున ఆగింది

"ఏవిఁటి?" అన్నట్టు చూశాడు అరవింద్

"అటు చూడు" దూరంగా వున్న చెట్టుకేసి చూపిస్తూ అంది కాంతి.

అతను అటుకేసి చూశాడు

అక్కడ చెట్టుకింద ఓ ముంగిస, రెండు నల్ల తాచులూ భయంకరంగా పోట్లాడుకుంటున్నాయి

"ఇలాంటివి నీకింకా కొత్తగా వున్నాయా కాంతీ!" నవ్వుతూ అన్నాడు అరవింద్

"మునుపటంత భయంలేదనుకో! కానీ క్రూర సర్పాల్ని చూస్తే భయంగా వుండక సరదాగా వుంటుందా?" కాంతికూడా చిన్నగా నవ్వింది

"త్వరగా దిగు" అన్నాడతను.

కాంతి చెట్టు దిగింది.

పాములు, ముంగిస తరువుకుంటూ కనుమరుగయ్యాయి అరవింద్ కూడా చెట్టు దిగాడు.

"ఇప్పుడేం చేద్దాం?" నీరసంగా అంది కాంతి.

"అదే ఆలో చిస్తున్నాను!" అన్నాడు అరవింద్. అతనికి బెడ్ కోఫీ లేక పోతే వుండలేడు. అలాంటిది ప్రస్తుత పరిస్థితుల్లో బెడ్ కాఫీ మాటటుంచి అసలేకాఫీలేదు!

ఓ సారి కాంతి మొహంలో కి చూసాడు.

ఆమె మొహం వాడి పోయింది. కళ్ళు పీక్కుపోయాయి.

"కాంతీ! ఆకలేస్తోందా?" అన్నాడు మెల్లగా.

"ఉఁహుఁ!"

బాధగా నవ్వాడతను.

"ఎందుకు నవ్వుతావ్?"

"నా మొహం! లేకపోతే ఆ ప్రశ్నేవిఁటి?.... తిండి తినక పోతే ఆకలిగా వుండదూ?"

కాంతి నవ్వింది.

ఆ నవ్వులో జీవం లేదని తెలుస్తూనే వుంది.

ముగ్గురూ మౌనంగా ఏటికెళ్ళి మొహాలు కడుక్కున్నారు.

మళ్ళీ ముగ్గురూ ఏటి ఒడ్డుకొచ్చారు.

"కంటినిండా నిద్ర, కడుపు నిండా తిండి లేకపోతే.... మనం ఏం చెయ్యగలం?... ." ఓ చోట కూలబడుతూ అన్నాడు అరవింద్.

"అదే మాంసాహారులమైతే. ఏ పిట్టల్నో, జంతువుల్నో కొట్టి కడుపు నింపుకునే వాళ్ళం!.... కానీ. పక్కా శాకాహారులమైపోయ్యాం!" అన్నాడు తనూ కూలబడుతూ భట్టు.

కాంతి కూడా వారి కెదురుగా కూర్చుంది.

"భట్టూ!" హటాత్తుగా అన్నాడు అరవింద్.

"ఏమిటి సర్?"

"మనం వెళ్ళిపోదాం!"

తృప్తి పడింది కాంతి.

"అదేమిటి సర్?" ఆశ్చర్యంగా అన్నాడు భట్టు.

"అవును. భట్టూ! ఇప్పటికి మనం వెళ్ళక తప్పదు!"

**జరిగిన కథ- 21:** అడవిలో విచిత్రంగా శవపేటిక, గ్రంథం అదృశ్యమవుతాయి. అరవింద్, కాంతి, భట్టులలో భయం ప్రవేశిస్తుంది. ఐనా అరవింద్ గ్రంథాన్ని తిరిగి సంపాదించాలనే పట్టుదలతో ఉంటాడు అడవిలో వాళ్ళకు సింహాలు కనపడతాయి.పిశాచాలలాగ కనిపించిన వారి మీదికి రివాల్వర్ కాల్పులు జరిపిన అరవింద్ భంగపడతాడు

"అంటే..... గ్రంథం దొరక్కుండానే....." అంది కాంతి కాస్త బాధగా.

"అంతకన్న మార్గం లేదు కాంతీ! తిండి లేదు!.... నీడ లేదు.... రివాల్వర్‌లో బులెట్స్ కూడా అయిపోయినట్టే .. అలాంటప్పుడు ... ఇంకా ఇక్కడే వుండి ఏదో సాధిద్దామనుకుంటే అది మూర్ఖత్వమే అవుతుందనిపిస్తోంది."

"పోనీ మళ్ళీ మంచెలాంటిది వేసుకుందాం!" అన్నాడు భట్టు.

"మరి ... ఆహారం?"

"భట్టు వెళ్ళి తెస్తాడు!" అంది కాంతి. అరవింద్ ఓటమి ఆమె కెంతో బాధ అనిపించింది. అంతకు ముందున్న భయమంతా ఆవిరైపోయింది.

"లేదు కాంతీ! ... నా మొండితనంతో మిమ్మల్ని కూడా ఇబ్బంది పెట్టి ఆకలి చావులపాలు చెయ్యడం అన్యాయం!" అతని గొంతు దుఃఖంతో గరగరలాడింది.

"ఛ!ఛ! అదేం మాటలరవింద్! .. అందరివీ ప్రాణాలే! మొదట్లో ఏదో కాస్త భయపడి నిన్ను విసిగించిన మాట నిజమే అనుకో! కానీ.. . ఆలోచిస్తే ... నేనెంత మూర్ఖత్వంతో మాట్లాడానో.... నీ ఉత్సాహం మీదెంత నీళ్ళు చల్లానో అర్థమైంది! అందుకే... నువ్వెప్పుడు వెళ్దామన్నా నేను సిద్ధమే! ఇంకా నెల్లాళ్ళు ఇలాగే తిరుగుదామన్నా నాకిష్టమే!" మనస్ఫూర్తిగా అంది కాంతి.

"అది కాదమ్మా! ... ఎలా చూసినా ప్రస్తుతం మనం వెళ్ళిపోవడమే మంచిదనిపిస్తోంది. అక్కడ నాన్నగారు కూడా మనగురించి కంగారు పడుతూండి వుంటారు. వీటన్నింటికీ తోడు... అవిదయ్యాలో, మనుషులోగానీ మనల్ని చూశాయి. అవి మనల్నంత తెలిగ్గా వదుల్తాయని కూడా అనుకోను...." అన్నాడు భట్టు.

"అవును కాంతీ! ... భట్టు చెప్పిందే నిజం! మనం వెళ్ళిపోదాం!" అన్నాడు అరవింద్.

ముగ్గురూ ఏట్లో నీళ్ళే కడుపునిండా తాగారు. కాళీ కడుపుల్లో నీళ్ళు పడగానే .. అందరికీ కడుపులో దేవేసినట్టయింది. అయితే ఒకరికి తెలియకూడదని ఒకరు ఆభావాల్ని కడుపులోనే దాచుకుని ఉత్సాహం ఉండడానికి ప్రయత్నిస్తున్నారు.

మరి కాసేపు తర్జన భర్జనలాడుకుని వెంటనే వెళ్ళిపోవాలనే నిర్ణయ కొచ్చి ముగ్గురూ మంచెకేసి నడిచారు

కూలిపోయిన మంచె కేసీ.... పరిసరాల కేసీ ఓ సారి చూసి దీర్ఘం నిట్టూర్చి, పోగా మిగిలిన ముఖ్యమైన వస్తువుల్ని సర్దుకుని రివాల్వర్ మెటల్ డిటెక్టర్‌ని జాగ్రత్త పరుచుకుని... భారంగా నడక సాగించారు

"అరవింద్! ఈ వాటర్ బాటిల్లో నీళ్ళు తెస్తాను!" దోవలో... అదే మన ఆధారం!" అంది కాంతి.

"ఓ! అవునుకదూ! నేను మర్చేపోయాను. ఆకలితో కాకపోయినా. దాహం ప్రాణం పోకూడదంటే కాసిన్నీటి చుక్కలు వుండి తీరాలి! . ఇ ఇవ్వండమ్మాయి గారూ! నేను తెస్తాను!" అన్నాడు భట్టు వాటర్ బాటిల్ కోస చెయ్యి చాస్తూ.

ముగ్గురికీ నీరసంగా ఉంది.

కాళ్ళు లాగేస్తున్నాయి.

"ఛ! ఛ! వెధవ శరీరం! ఒక్క రోజు తిండి లేకపోతే ఎందుకూ పనికి రాదు! ఎవరికి వారే అనుకున్నారా మాటల మనసులో

భట్టు మళ్ళీ అడిగాడు కాంతిని.

"లేదు భట్టూ!... నేనేతెస్తాను!. . మీరు కూర్చుని మాట్లాడు కుంటూండండి! నాకూ ఆఖరిసారిగా ఆ ఏటిని చూడాలని వుంది!" అంది కాంతి

కానీ .. కాంతి మాట నిజం కాదు.

తమకే ఎంతో నీరసంగా వుంటే వృద్ధుడైన భట్టు మరీ నీరసించి పోవడంలో ఆశ్చర్యం లేదు!. ." అనుకున్న ఆమె ఉత్సాహంగా తనే ఏటికేసి నడిచింది.

దూరంగా ఏరు కనిపిస్తూనే వుంది.



అక్కడే.ఓ చెట్టుకింద కూర్చుని కబుర్లలో పడ్డారు అరవింద్ భట్టులు.

కాంతి  గబగబా అడుగులేస్తుంటే . పొదల్లో దాగి బిత్తర చూపులు చూస్తున్నాయి కుందేళ్ళు కొన్ని.

వాటి కేసి ఓ సారి మురిపెంగా చూసి–

"మేం నీ ఫ్రెండ్స్‌మేనర్రా!" అంటూ ముద్దుగా అనేసి కూనిరాగం తీసుకుంటూ ఏటి దగ్గరికి నడిచింది కాంతి.'

మెల్లగా నీటిలో దిగింది

నీటిలో రాళ్ళు తళతళ లాఢుతున్నాయి

ప్రకృతి ఎంతో అందంగా కనిపించిందామెకి

క్షణం తన ఆకలినీ, నీరసాన్ని పూర్తిగా మర్చిపోయి అలా నిల్చుండి పోయింది  ఏటిలోని పూలనీ, మిలమిలలాడే రవికిరణాలనీ తన్మయత్వంగా చూస్తూ .

అయితే . ఆ హాయి ఇంకెంతో సేపు నిలవదని గానీ ఓ భయంకరమైన మొసలి రూపంలో మృత్యువు తనని సమీపిస్తోందని గానీ ఆమెకి తెలియదు

అసలా ఏటిలో మొసళ్ళుంటాయనే ఆలోచన లేదామెకి.

దూరంగా వున్న మొసలి చేరువగా వచ్చేస్తోంది  కాంతి . అలాగే నిల్చుండి పోయింది హాయిగా

ఇంకా ఎంతసేపు? త్వరగా రావాలి!" అరిచాడు అరవింద్

'వస్తున్నా!" అంత వరకు మరో లోకంలో వున్నట్టున్న కాంతి అతని కేకతో తృళ్ళిపడి ఈ లోకంలో కొచ్చింది

గబగబ వాటర్ బాటల్ కడిగి నిండా నీళ్ళు ముంచి వెనుతిరిగింది

అయితే అంత వరకు ఆమె గమనించకుండాపిల్లిలా వస్తున్న మొసలి ఆమె వెళ్ళి పోతోందని గ్రహించి గభాల్న ఆమె/దగ్గరి కొచ్చేసింది.

'నీటి కదలికకి వెనుతిరిగిన కాంతి ఆ మొసల్ని చూసి కొయ్యబారి పోయింది.

మరుక్షణం పెద్దగా అరుస్తూ గబగబ ఒడ్డు కేసి అడుగులు వేసింది.

మొసలి మరింత వేగంగా అనుసరించింది

తడిసిన చీర బంధం పడి ఒకటి రెండు సార్లు పడబోయి నిలదొక్కుకుంది కాంతి

ఆమె ఒళ్ళంతా చెమటలు పట్టేస్తున్నాయి!

గుండె ఆగిపోతుందేమో అన్నంత వేగంగా కొట్టుకుంటోంది.

అంతలోతు కెళ్ళి నందుకు తనని తానే తిట్టుకుంది. ఆ భయంతో నే ఓసారి వెనుతిరిగి చూసింది.

మొసలి అతి చేరువగా వచ్చేసింది.




"అరవింద్!" భయంకరంగా అరిచింది కాంతి.

పరధ్యానంగా మొదటి కేక వినని అరవింద్ . . తన పేరు పెట్టి పిల్చిన కేకకి తృళ్ళిపడి చటుక్కున లేచాడు.

"అరవింద్!" మళ్ళీ అరిచింది కాంతి

అరవింద్, భట్టు ఏటికేసి పరుగు తీశారు.

మొసలి ఆమెని సమీపించి కాలు నోట కరుచుకుని అతివేగంగా లోనికి పోసాగింది

కాంతి భయంకరంగా అరుస్తోంది.

నీళ్ళలో పడి ఉక్కిరి బిక్కిరై పోతోంది!

పరిస్థితి చూసి నిర్ఘాంత పోయారు అరవింద్ భట్టులు  అరవింద్ లోనికెళ్ళ బోతుంటే ఆపేశాడు భట్టు. అరవింద్ కేం చెయ్యాలో తోచలేదు  అప్పుడే రివాల్వర్ మొసలికేసి గురి చూసి కాల్చాడు భట్టు  అయితే అది మొసలికి తగల్లేదు.

మరోటి! మరోటి! వరసగా కాల్చాడు  ఒకటి రెండు తగిలినా మొసలి లెక్క చేయ్యలేదు  అలా లాక్కెళ్తూనే ఉంది

నిస్సహాయంగా చేతుల్లో మొహం దాచుకుని భోరుమన్నాడు అరవింద్.

అనుకోకుండా ఓ సంఘటన జరిగిపోయింది  ఎక్కణ్ణించో ఓ బాణం వచ్చి మొసలి కంట్లో గుచ్చుకుంది  వెంటనే అది భయంకరంగా అరుస్తూ కాంతి కాలు వదిలేసింది.

వెంట వెంటనే మరో రెండు బాణపు దెబ్బలు తగిలాయి  మొసలి ఆ నీళ్ళలో గిలగిల కొట్టుకుంటూ కాస్సేపటికి నిశ్చలమై పోయింది

భట్టు ఆనందంగా అరిచాడు. అరవింద్ కళ్ళు తెరిచి చూశాడు

కాంతి.  రక్తం ఓడుతున్న కాలుతో ఒడ్డుకి రావడం కనిపించిందతనికి.

ఆనందంగా అరుస్తూ చేతులు చాచి .  ఆమె కేసి పరుగు తీశాడు

కాంతికి కళ్ళు తిరిగి పోతున్నాయి  నీరసం ఆవహించేసింది  ఒడ్డుకి చేరకుండానే స్పృహ కోల్పోతానేమో అన్నట్టు పళ్ళు బిగబట్టి ఒడ్డు కేసి అడుగులు వేస్తోంది.

"కాంతీ! ... " ఆమెకి అతి చేరువగా వచ్చిన అరవింద్ చేతులు చాచి ఆర్తిగా అన్నాడు.

కాంతి అతని చేతుల్లో ఒరగబోయింది.

అయితే ఆమె ఆశ నెరవేరలేదు.

కారణం అరవింద్‌ని ఇద్దరు అటవికులు బలవంతంగా రెక్కలు పట్టి ఆపారు

చివ్వున వెనక్కి తిరిగి చూసిన అరవింద్ కళ్ళకి భట్టునికూడా మరో ఇద్దరు అటవికులు పట్టుకోవడం కనిపించి పైప్రాణాలు పైనే పోయాయి.

"వదలండి! ఎవరు మీరు?" గింజుకున్నారిద్దరూ

వాళ్ళు అరణ్యం దద్దరిల్లేలా నవ్వారు.

మరో అటవికుడు, అయోమయంలోనూ, భయంతోనూ. . ఒణికిపోతున్న కాంతిని లాక్కెళ్ళి దగ్గరలో ఉన్న గుర్రం ఎక్కి పరుగు తీశాడు.

అనుకోని ఈ సంఘటనకి చివురాటుకులా కంపించి పోయింది కాంతి. వెంటనే ఓపిక తెచ్చుకుని.–

"అరవింద్! భట్టూ! కాపాడండి? ప్లీజ్! సేవ్‌మీ!" ఏడుస్తూ అరిచింది.

మగాళ్ళిద్దరి గుండెలూ నీరయిపోయా యాకేకకి. కానీ ఎంత విదుల్చుకున్నా అంగుళం ముందుకు కదల్లేకపోయారు.

అయిదు నిమిషాలపాటు. . అటవికుల మధ్యా వాళ్ళ మధ్యా పోరాటం జరిగింది

హటాత్తుగా అటవికులిద్దరూ... బలంగా వాళ్ళ తలమీద మోదారు.

అంతే! ఇద్దరూ స్పృహ కోల్పోయి కుప్పలా కూలిపోయారు.

★ ★ ★ ★ ★ ★ ★

అరిచి, అరిచి గుర్రం మీదే స్పృహకోల్పోయిన కాంతికి తిరిగి

# రచయిత్రి జవాబులు



**చలపాక ప్రకాష్, విజయవాడ**

ప్ర · "మంజీరనాదం" సీరియల్‌లో రసన్, చందనలను దాయమ్మ పెళ్ళిచేసి ఒకటిగా చేసింది కదా. మీ జీవితంలో దాయమ్మలా ఏ ప్రేమికులకైనా పెళ్ళి చెయ్యడం చూశారా?

జ. లేదు

**పేల నాగేశ్వరరావు, అనకాపల్లి**

ప్ర : కన్ననగారూ! స్త్రీ శీలం గొప్పదా? మనసు గొప్పదా?

జ: నా దృష్టిలో శీలమే

**పి. బాబూ కనకేంద్రగుప్త, అనంతపురం**

ప్ర . తన శరీరాన్ని అమ్ముకునైనా కన్నబిడ్డని పోషిస్తుంది ఓ తల్లి! పెళ్ళయిన వెంటనే తన భర్తని కొంగు చాటునైనా దాచి కాపాడుతుంది ఓ భార్య వీటిని బట్టి చూస్తే ఒక్కొక్కసారి సెంటిమెంట్ ముందు డబ్బు ఆవగింజకు కూడా సరి కాదనిపిస్తుంది మీరేమంటారు?

జ · కొంతవరకు మీ అభిప్రాయంతో ఏకీభవిస్తాను

**రాజవీర్, తుని**

ప్ర. మీ సీరియల్ కన్న అందులో ని కథే బావుంది

జ. రసన్, చందనల ప్రేమ గాథా? థాంక్స్!

## ఉత్తమ ప్రశ్న

**గుత్తుల సుభాష్, ద్రాక్షారామ**

ప్ర : 'సువర్ణా కన్నన్‌గారూ' సమాజంలో సాగుతున్న అన్యాయాలను, అక్రమాలను, ప్రజల అమాయకత్వాన్ని రూపుమాపడానికి ఎందరో రచయి(త్రు)తలు తమ రచనల ద్వారా ప్రయత్నించారు. పరిష్కార మార్గాలు కూడా సూచిస్తూ వచ్చారు. అయినా ప్రజల సమస్యలు పెరుగుతున్నాయే తప్ప తగ్గడంలేదు. ఎందుచేతనంటారు?

జ : మనిషిలో స్వార్థం పెరిగిపోతోంది. ఎవరికి వారు తమ బాగు మాత్రం చూసుకుంటే అదో రకం. కానీ అంతే కాకుండా తమ బాగు కోసం అమాయకుల్ని పావులుగా వాడుకుంటున్నారు. అందుకే సమస్యలు పెరిగిపోతున్నాయి. నిరుపేదలు గంజిలోకి ఉప్పులేక బాధపడుతూంటే కలవారు కాస్ట్లీ బ్రాందీల కోసం తాపత్రయ పడుతున్నారు. మరీ కుబేరులు ఆ లిక్కర్స్ ఎంత పాతవి దొరుకుతాయా అని వెతుకుతున్నారు. మరి ఇవన్నీ సమస్యలు కాదూ? ఇందులో, ఉప్పు లేకుండా నిరుపేద గంజి తాగేసి ఇదే నా ప్రాప్తం అనుకుంటాడేమోగానీ మిగతావాళ్ళు మాత్రం తమ సమస్యలు తీరడం కోసం ఎంతకైనా తెగిస్తున్నారు. కలవారంతా ఇలా అని కాదు నా అభిప్రాయం. ధర్మరాజులాంటి వారూ ఉన్నారు.

**మోటమర్రి బేబీ కళ్యాణి, బెండమూర్లంక**

ప్ర 1) అక్కయ్యా! భర్తని ఒక వస్తువుగా కొనుక్కోవాలా? కట్నం ఇవ్వడం, పుచ్చుకోవడం కూడా నేరం అని అందరికీ తెలిసినా ఇంకా ఈ వరకట్నం యథేచ్ఛగా కొనసాగడానిక్కారణం ఏమిటి? 2) అమ్ముడుపోయే గుణం ఈ మగాళ్ళలో ఎప్పటికి పోతుందంటారు?

జ . 1) వరకట్న నిషేధం చాలావాటి లాగే పేపర్ మీదికి మాత్రమే పరిమితం అవడం మూలాన 2) కొనేవాళ్ళు రానప్పుడు. (క్షమించాలి. అందరు యువకులూ అమ్ముడు పోతున్నారని నా అభిప్రాయం కాదు ) □

మెలకువచ్చేసరికి ఓ గదిలో మంచం మీద వున్నట్టు గ్రహించింది

కాస్సేపు అలా అయోమయంగా వుండి ఆపై విషయం గుర్తొచ్చి చటుక్కున లేచికూర్చుంది

"లేవకు! కాసేపు పడుకో!" అంది ఓ గొంతు ఆప్యాయంగా

చివ్వున తల తిప్పి చూసింది కాంతి

ఎదురుగా ఒక అటవికస్త్రీ!

భయంకరమైన అలంకరణతో, మరింత భయంకరంగా నవ్వుతూ కనిపించింది

ఆమె పళ్ళు పారల్లా ఉన్నాయి.

"ఎవర్నువ్వు?" అరిచింది కాంతి

కాలు ఒకటే నెప్పిగా వుంది అక్కడ కట్టు ఉండడం కూడా గమనించిందామె

"ఎవర్నువ్వు?" మళ్ళీ అడిగింది కాంతి గట్టిగా.

జవాబుగా గర్జించినట్టు నవ్విందామె

"నేనెక్కడున్నాను? .."

"అడవి మధ్యనున్న మా గూడెంలో!" సౌమ్యంగానే అందా స్త్రీ.

"నన్నెందుకు తెచ్చారు?"

"తెలియదు!"

"ఎవరు తెచ్చారు?"

"తెలియదు!"

"పోనీ నాతో పాటు మరో ఇద్దర్ని పట్టుకున్నారే. వాళ్ళెనెక్కడ దాచారో తెలుసా?" చిరాగ్గా అంది కాంతి

అరవింద్‌ని, భట్టుని నలుగురు మనుష్యులు పట్టుకోవడం గుర్తొచ్చిందామెకి

'అదీ తెలియదు!"

"పోనీ ' నువ్వు ఆడదానివో, మగాడివో అన్న సంగతైనా నీకు తెలుసా?" కచ్చిగా అంది కాంతి

"తెలియదు!" మామూలుగానే అనేసి ఆపై కాంతి వేసిన ప్రశ్న అర్థంచేసుకుని గుర్రగా చూసిందామె కాంతికేసి

అలాంటి సమయంలోనూ ఆ స్త్రీ ప్రవర్తన కాస్త నవ్వు తెప్పించింది కాంతికి

"సరేలే! .. నువ్వెంతో మంచిదానివిలా ఉన్నావ్!. ఈ గూడెం నాయకుడికి భార్యవా?" అంది. కాకాపడుతున్నట్టు.

"ఇయ్యి తిను!" అడిగిన ప్రశ్నకి జవాబు చెప్పకుండానే కొన్ని పళ్ళు అందించిందామె కాంతికి.

"ఏమిటవి?"

"అడవి పళ్ళు! వీటిని తేనెఫలా లంటారు. చాలా బావుంటాయి తిను.!"

"కానీ. ఇవి నాకెక్కడా కనిపించలేదే?" తాము తిండి లేకుండా మాడినప్పుడీ పళ్ళు కనిపిస్తే ఎంత బావుండేది!" అనుకుంటూ అంది కాంతి.

"అవి ఈ ప్రాంతాల్లోనే ఎక్కువగా ఉంటాయి! తిను!" ఓపిగ్గా అంది అటవిక స్త్రీ.

# డాక్టర్ సలహాలు

డా. కె. వెంకటేశ్వరరావు



**కె. వి. ఆర్ – కోరుకొండ**

నాకు తరచు నోటి పుండు వస్తూ ఉంటుంది. ఎన్ని బి– కాంప్లెక్స్ మాత్రలు వాడినా ఫలితం కనబడటం లేదు. ఆ చోట్ల గుంటలు పడినట్లు ఉంది, మాట్లాడటానికి కూడా వీలుకలుగడం లేదు. మంచి నీళ్ళు త్రాగినా మంటగా ఉంటుంది.

దీనిని వైద్య శాస్త్రంలో "అఫ్తస్ స్టామటైటిస్" అని అంటారు.

ఇది ఎందుకు వస్తుందనేది ఇదమిత్థంగా ఇంత వరకూ తెలియదు. మానసిక ఆందోళన, బి– విటమినుల లోపం – సూక్ష్మక్రిముల ప్రభావం మొదలయిన వన్నీ కారణాలుగా చెప్పబడు తున్నాయి.

ఈ పుండ్లమీద ఒక శాతం సిల్వర్ నైట్రేటు సొల్యూషన్ అద్ది, వెను వెంటనే ఉప్పునీటితో నోరు పుక్కిలించి వెయ్యవలసి ఉంటుంది. అలా రెండు రోజుల పాటు చెయ్యటం వల్ల పుండ్లు త్వరగా మానటానికి అవకాశం ఉంటుంది. లోనికి బి–కాంప్లెక్స్ మాత్రలు పూటకి రెండు వంతున వరుసగా 15 రోజుల పాటు వాడండి.

**యు. వి. ఆర్. – గొల్లపూడి**

'టిటనస్' అనే జబ్బు ఎలా వస్తుంది? అందుకు తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమిటి? ఈ జబ్బు నయమయిన తర్వాత తిరిగి వస్తుందా?

క్లాస్ట్రిడియం టిటనై అనే సూక్ష్మ క్రిమి వల్ల 'టిటనస్' వస్తుంది. లోతుగా తగిలిన గాయాలలో గాలి, వెలుతురు లేక పోవటం వల్ల ఈ క్రిమి బాగా పెరుగుతుంది.

సంవత్సరానికి ఒక సారి టిటనస్ టాక్సాయిడ్ ఇంజక్షన్ చేయించుకోవటం, గాయాలు తగిలినప్పుడు ఆ చోట బాగా కడిగి శుభ్రం చేయటం తీసుకోవలసిన జాగ్రత్తలు.

ఒకసారి నయమయిన తర్వాత మరోసారి రాదన టానికి లేదు.

**ఎ. వి. ఆర్. – పసలపూడి**

మా పాపకు 18 మాసములు. పుట్టుక నుండి తల్లి పాలు లేవు. ఆవుపాలు వాడాము. 2వ మాసములో 'రికెట్స్' అనే వ్యాధి అంకురించినది. చాలామందులు వాడాము. కాని వయస్సుకు తగ్గ పెరుగుదల, నడక, ప్రాకటము ఏదీ రాలేదు. పై పళ్ళు రెండు వచ్చాయి. మిగతావి ఏవీ రాలేదు. తరచుగా అజీర్తి, జ్వరం వస్తూ నీరసం అయిపోతున్నది. మా పాప ఎప్పటికైనా అందరి పిల్లలలాగ తయారవగలదా అని బెంగగా వున్నది.

ఆవుపాలు వాడినంత మాత్రాన 'రికెట్సు' రాదు. మెటబాలిక్ రికెట్స్ అనే వ్యాధి వున్నదీ లేనిదీ చిన్న పిల్లల వైద్యులు కొన్ని పరీక్షలు చేసి తీర్మానిస్తారు.

మీ పాపకు మల పరీక్ష, మాంటో టెస్టు, ఛాతీ ఎక్స–రే తీయించి చిన్న పిల్లల వైద్య స్పెషలిస్టులకు చూపించండి. ప్రైమరీ కాంప్లెక్స్ ఉన్నా ఇటువంటి లక్షణాలే ఉంటాయి.. □

## మంజీరనాదం

"నాకొద్దు!"

"పరవాలేదు! తిను! నీ వాళ్ళు బానే ఉన్నారు!"

"ఎక్కడ?" ఆతృతగా అడిగింది కాంతి.

"అది మాత్రం అడక్కు!" సీరియస్‌గా అందా స్త్రీ.

"అయితే నా కొద్దు!"

"తిను! అసలే తిండిలేక నీరసించి పోయావ్" జాలిగా అందామె.

"నాకు తిండిలేదని ఎవరు చెప్పారు నీకు?" కోపంగా అంది కాంతి.

"అంతే కాదు. నీకు తిండిలేదనీ తెలుసు. మొసలి మూలంగా నీ ప్రాణాలు పోయేవనీ తెలుసు!... మా దొర రక్షించబట్టిగానీ లేకపోతే నువ్వీపాటికి మొసలి కడుపులో ఉండేదానివి!" పెద్దగా నవ్విందామె.

"ఛ! అలా నవ్వకు! ఏడ్చినట్టుంది!" కసిరింది కాంతి.

అయినా ఆమె నొచ్చుకోలేదు–

"సరేలే! నీతో మాటేంటి!... ఇయ్యితిను!" అంది

"ఏమిటి... నా మీద అంత ప్రేమ?" వ్యగ్యంగా అంది కాంతి.

"ప్రేమే!... కానీ... నాక్కాదు!" మళ్ళీ నవ్విందామె.

గుండె ఝల్లుమంది కాంతికి.

ఆమెకి హటాత్తుగా సినిమాల్లో అటవికులు హీరోయిన్నెత్తుకు పోవడం, ఆపై... ఆమెని పెళ్ళి చేసుకోవడానికి ప్రయత్నించడం... ఒకటి తర్వాత ఒకటి గుర్తొచ్చాయి.

గభాల్న లేచి ఆమె చేతులు రెండూ పట్టుకుని.

"ప్లీజ్!.... నన్నెందుకు తీసుకొచ్చారో చెప్పవూ?" అంది బ్రతిమాలుతున్నట్టు.

ఆమె సున్నితంగా చేతుల్ని విడిపించుకుని–

"అందుకు మాకు అజ్ఞ లేదు" అంది.

"మరి... ఎవరు... ఎప్పుడు చెప్తారు?"

"ఇప్పుడు మా నాయకుడొస్తాడు!"

"మీ నాయకుడెక్కడుంటాడు?"

"అడివి కవతల పట్నంలో!"

"పట్నంలో నా?" తెల్లబోయింది కాంతి.

"అవును...."

"మరి... ఇక్కడికెందుకొచ్చాడు?"

"ఆయన తరచూ ఇక్కడికొస్తూ ఉంటారు"

కాంతికి దరీ, దాపూ అర్థం కాలేదు.

"తమలాగే... నిధులకోసం వచ్చుంటాడా?" అనుకుందో క్షణం. అయితే... ఈ అటవికులతో ఇంక సఖ్యత ఎలా కుదిరింది?"

"ఇంతకీ... ఆయనకీ... మీకూ ఏమిటి సంబంధం?... నన్నెందుకు తెప్పించాడు?" చిరాగ్గా అంది కాంతి.

అది నేను చెప్తాను! గంభీరంగా వినిపించిందో గొంతు.

చివ్వున తల తిప్పింది కాంతి.

అత్యంత నాగరికతతో వున్న ఓ వ్యక్తి చిరునవ్వులు చిందిస్తూ దర్శనం ఇచ్చాడు.

**(ఇంకా ఉంది)**

# వ్యక్తిగతం

## ఆదర్శమా? అధికార స్థానమా?

పార్టీ రహిత ప్రజాస్వామ్యాన్ని ప్రబోధించిన ఎం ఎన్ రాయ్ ఆలోచనలను అనుసరించే వాళ్ళు



ఏదయినా ఒక రాజకీయ పార్టీలో, అందులోనూ బాధ్యతాయుతమైన స్థానాల్లో ఉండవచ్చునా? స్వయంగా రాయిస్టు అయిన కర్నాటక జనతా పార్టీ నాయకుడు ఎస్ ఆర్. బొమ్మై బహిరంగంగా ఈ ప్రశ్న వేశారు ఎం ఎన్. రాయ్ శత జయంతి ఉత్సవ సభలో ప్రసంగిస్తూ ఆయన తనకుతానే ఈ ప్రశ్న వేసుకున్నారు కాని కర్నాటకలో జనతాపార్టీ సాధించిన విజయాల్ని ప్రస్తావించి ఆయన తనను తాను ఊరడించుకున్నారు అదే క్రమంలో ఆయన జనతాపార్టీని కొందరు రాజకీయ అధిపతులు నడుపుతున్నారని కూడా అన్నారట

## అర్ధ శతాబ్దానికి పండిన పాపం!

అర్ధశతాబ్దం పాటు అనేక మందిని మోసగించి తిరుగు లేకుండా రాజ్యం



నడిపిన మేటి మోసగాడు నట్వర్ లాల్ చిట్ట చివరికి పోలీసుల చేజిక్కాడు నట్వర్‌లాల్ అసలు పేరు మిథిలేష్ కుమార్ శ్రీవాస్తవ బీహార్‌లో 1914 లో జన్మించిన శ్రీవాస్తవ ఇప్పటికి ఎందరిని మోసగించాడో లెక్కలేదు కనీసం 20 మారు పేర్లతో సంచరించాడని ఒక అంచనా మొత్తం మీద 13 సార్లు బెయిల్ తీసుకుని పోలీసులకు దొరక కుండా తప్పించుకు తిరిగాడు తన వృత్తిలో శారీరక శ్రమ ఎన్నడూ చేయలేదని, తనది అంతా మేధో శ్రమ అని ఆయన అన్నాడు. ధనికుల దగ్గర కొన్ని వేలో, లక్షలో వదిలించి వాటిని పేదలకు అందజేయడమే తాను చేసిన పని అని అన్నాడు. వారణాసిలో 78 చేతి గడియారాలను ఒక దుకాణంలో, 80 చేతి గడియారాలను మరో దుకాణంలో తప్పుడు డ్రాఫ్టు లిచ్చి కొనడానికి ప్రయత్నించినప్పుడు నట్వర్ లాల్ దొరికిపోయాడు...

## పేరు తనది, నష్టం స్టాక్‌బ్రోకర్దది!

అమెరికా ఆర్థిక వ్యవస్థలో ఈ మధ్య చెలరేగిన సంక్షోభం ఇంగ్లండ్‌లో ఒక



విచిత్రమైన సమస్యను ముందుకు తెచ్చింది 16 సంవత్సరాల పాఠశాల విద్యార్థి క్రిస్టఫర్ పీచ్ ఈ సంక్షోభం ఫలితంగా ఇరవై వేల పౌండ్లు నష్టపోయాడు వాణిజ్య శాస్త్రం పాఠాలను జాగ్రత్తగా విన్న క్రిస్టఫర్ పీచ్ స్టాక్ మార్కెట్లో వ్యవహారాలు నడపడం ప్రారంభించాడు ఇప్పుడీ నష్టానికి గాను క్రిస్టఫర్ పీచ్ పైన విచారణ జరిపించడానికి స్టాక్‌బ్రోకర్లు ప్రయత్నించగా 18 ఏళ్ళలోపు పిల్లలు అసలు షేర్ల వ్యాపారం చేయగూడదనే చట్టం వారికడ్డు తగిలింది తన పేరు మీద 20 వేల పౌండ్లు నష్టం వచ్చినా విచారణ కూడా లేకుండా తప్పించుకో గలిగాడు క్రిస్టఫర్ పీచ్!

## వి. పి. సింగ్‌కు పన్నెండు ప్రశ్నలు!



మాజీ బి జె పి నాయకుడు రామ్ జఠ్మలానీ ప్రధాని రాజీవ్ గాంధీని ప్రశ్నల వరదలో ముంచెత్తగా, ప్రస్తుత బి జె. పి నాయకుడు కల్యాణ్‌సింగ్ మాజీ ఆర్థికమంత్రి వి పి సింగ్ పైన ప్రశ్నలు కురిపిస్తున్నారు కల్యాణ్‌సింగ్ మొదటి విడతగా వి పి సింగ్‌ను 12 ప్రశ్నలు అడిగారు వాటిలో కొన్ని – ఉత్తరప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రిగా తన కాలంలో బూటకపు ఎన్‌కౌంటర్లలో వేలాది మంది అమాయకులను అర్థరహితంగా హత్య చేయడం గురించి వి పి సింగ్ ఏమంటారు? ఆర్థిక మంత్రి హోదాలో తాను పెట్టుబడిదార్లకు అనుకూలమైన, పేదలకు వ్యతిరేకమయిన విధానాలు చేపట్టానని వి పి సింగ్ ఒప్పుకుంటారా? అవినీతికి జీవధార అయిన కాంగ్రెస్ పార్టీని పల్లెత్తు మాట అనకుండా కేవలం రాజీవ్‌గాంధీ మీదనే ఎందుకు విరుచుకు పడుతున్నారు? వగైరాలు

## సునీల్‌దత్‌కు ద్వంద్వ ప్రమాణాలు లేవా?

సునీల్‌దత్ కొడుకు పెళ్ళికి ఎంత ఖర్చవుతుంది? ఎంతయితే మనకేమిటి అని ఎవరైనా అనుకోవచ్చుగాని ఆ పెళ్ళి న్యూయార్క్‌లో జరిగింది గనుక, మన విదేశీ మారక ద్రవ్య నిలువల నుంచి పెద్ద మొత్తంలో తరలించవలసి వచ్చింది గనుక ఇది ముఖ్యమైన వార్త అయింది. సాధారణంగా ద్వంద్వ ప్రమాణాలు లేని వాడుగా, నిరాడంబరతని కీర్తించే వాడుగా అందరికీ తెలిసిన సినీ నటుడు, పార్లమెంటు సభ్యుడు అయిన సునీల్‌దత్ ఈ పెళ్ళికి 40 వేల డాలర్లు విదేశీ మారక ద్రవ్యం ఇమ్మని అడిగారు. ఇంత మొత్తం అనుమతించడం సాధ్యం కాదని సంబంధిత శాఖలు చెప్పగా ఆయన రాజీవ్ గాంధీనే



స్వయంగా ఈ వ్యవహారంలోకి దించి తానడిగిన దానిలో సగం సాధించుకున్నారు. □

# సినిమా!

## కృష్ణ, కె. ఎస్. ఆర్. దాస్‌లతో "ఖైదీ కృష్ణయ్య"

"త్వరలో నే షూటింగ్, అన్నారు కె ఎస్. ఆర్ దాస్ ఈయన దర్శకత్వంలో ఆర్ వి గురుపాదం నిర్మించే జి ఆర్ పి ఆర్ట్స్ వారి పై చిత్రానికి పరుచూరి



"పెళ్లి కొడుకు తొస్తున్నారు"లో కల్యాణచక్రవర్తి

సోదరులు రచయితలు. చక్రవర్తి సంగీత దర్శకుడు.

## శోభన్, మురళీమోహనరావులతో రాశీ మూవీ క్రియేషన్స్ చిత్రం

"డిసెంబర్ 5న పాటల రికార్డింగ్‌తో ప్రారంభం

"కాళరాత్రి"లో జయరేఖ

# విశేషాలు

_జి.వి.జి.

భోత్సవం జరిపాం. డిసెంబర్ 27 నుంచి షూటింగ్," అన్నారు రాశీ మూవీ క్రియేషన్స్ అధినేత ఎం. నరసింహారావు. ఈయన "మహారాజా, పున్నమి చంద్రుడు" అనంతరం నిర్మిస్తున్న తాజా చిత్రంలో శోభన్‌బాబు, సుహాసిని, గౌతమి, సత్యనారాయణ,



"ఆణిముత్యం"లో రాధిక

నూతన్‌ప్రసాద్, వీరభద్రరావు ప్రభృతి నటవర్గం. బాలమురుగన్ కథకు సత్యానంద్ సంభాషణలు, కె. చక్రవర్తి సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, తార నృత్యాలు, నరసింహారావు కూర్పుతో కె. మురళీ మోహనరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు. (71 వ పేజీ చూడండి).

"బజారు రౌడీ"లో రమేష్‌బాబు

# E & BLUE




It's rich: the blend of choice Virginia tobaccos.

It's true: the taste, the smoke, the satisfaction.

It's blue: unmistakably so.

It's Berkeley Filter: rich, true and blue.



BERKELEY

FILTER

## Rich tobacco, true taste.

LINTAS (CAL)/BFT/2740/1

# షేర్ మార్కెట్‌లలో పెట్టుబడులు



–యన్. రామ్‌జీ, న్యూఢిల్లీ

షేర్ అంటే ఏమిటో తెలుసుకుందాము "పార్ట్ ఓనర్ షిప్ ఆఫ్ ది కంపెనీ" అంటే ఒక కంపెనీ భాగస్వామ్యంలో ఒక భాగానికి [illegible] అన్న మాట. 53 కోట్ల రూపా[illegible] కలిగిన టెల్‌కో (బెంజ్ లారీలు తయా[illegible] సంస్థ) పేరును 100 రూపాయల ఖరీదు [illegible] మీరు స్టాక్ మార్కెట్‌లో రు. 350 చొ.న. కనీసం [illegible] షేర్‌లు కొని టాటాలతో భాగస్వామి కావచ్చు [illegible].

ఆస్తులు రెండు రకాలు. స్థిర [illegible]లు (ఇల్లు, పొలాలు) చరాస్తులు (బంగారం, [illegible]టర్ మొ.) ఈ షేర్లు చరాస్తులుగా ప్రకటించబడినాయి అంతేగాక ఇవి అన్నీ మార్చుకోటానికి వీలైనవి కూడా. [illegible] మాత్రం [illegible] కోటా షేర్[illegible] అమ్మకు[illegible] అంక్ష [illegible] ప్రమోటర్[illegible] ముంచా[illegible]

ఒక క[illegible]లు కల్గిన వ్యక్తి[illegible] లాభాల[illegible] సంబంధం కాని ఆ కంపెనీ యొక్క నష్టాలు, అప్పులతో సంబంధం గాని [illegible]. దీని మూలంగా పెట్టుబడి [illegible] యాజమాన్యాల మోసాలకు గురి కాకుండా ప్రభుత్వ పట్టం కాపాడింది.

షేర్‌లు కొన్న తరువాత ఆ సర్టిఫికేట్‌ను మనం అమ్మినవారు ఇచ్చిన ట్రాన్స్‌ఫర్ డీడ్‌ని పూర్తి చేసి మనం కొన్న ధర మీద ప్రతి వంద రూ.లకు 50 పై. చొ.న. లెక్క కట్టి వాటిని ట్రాన్స్‌ఫర్ డీడ్ వెనుక వైపున అంటించి కంపెనీ రిజిస్ట్రార్ ఆఫీస్‌కు గాని లేక వారి చేత నియమింపబడిన సంస్థకు రిజిస్టర్డ్ పోస్టు, తిరుగు రసీదుతో పంపితే నెల రోజులు నుంచి– 3 నెలల లోపు మన పేరున బదిలీ అయి వస్తుంది. ఈ ట్రాన్స్‌ఫర్ డీడ్‌లు అన్ని స్టాక్ ఎక్స్ఛేంజిలలో [illegible] వారు ఫ్రీగా క్లయింట్‌లకు పంపుతూ వుంటాము. అంతేకాక షేర్ స్టాంపులు [illegible]దా ఈ స్టాక్ ఎక్స్ఛేంజిలలో అమ్ముతారు లేదా పోస్టాఫీసుల[illegible] అఫీసులలో కూడా [illegible] మామూలు స్టాంపులు కావు

అబ్బా [illegible] ఫోన్ నన్ను ఏ పని చెయ్యని[illegible]. చాలా చలిలో కూర్చొని మీ కోసం నేను [illegible] ఒకటే గోల 5 ని.ల నుంచి [illegible] బాబుగారు చెప్పండి కొద్దిగా గట్టిగా చెప్పండి. ఆ.. వినిపిస్తోంది. ఈ



శ్రీచంద్ హిందూజా



మనూ ఛాబ్రియా




మార్కెట్ నుంచి లక్ష రూపాయలు తీసు కెళ్ళాలా ఎలాగా అని అడుగుతున్నారా? ఆ . చెప్తాను వినండి అని నేను చెప్తుంటే నా ప్రక్కనున్న మా బి ఎస్. ఎన్. రెడ్డి గారు ఫోన్ తీసుకొని "ఆ దానిదేముంది చాలా తేలిక మీరు మీ ఇష్టం వచ్చిన కంపెనీ షేర్లు రెండు లక్షలు పెట్టి కొనండి. ఒక 6 నెలల్లో అవి తప్పకుండా 50% పడిపోతాయి వెంటనే అమ్మేసి లక్ష రూపాయలు తీసుకెళ్ళండి అని ఫోన్ పెట్టేశారు. నేను వాస్తవంలోకి వచ్చేసరికి లైన్ కట్ అయ్యిపోయింది.ట్రాన్స్‌ఫర్ డీడ్ ఎలా నింపాలి దాని తిరకాసులు ఏమిటో వచ్చే వారం తెలుసుకుందాము. □

## సీరియల్

# డి.ఎస్.పి. విజయ్



### ఆమూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

మాధవరావు కా ఊరునుంచి గోదావరి ఒడ్డునున్న ఒక పల్లెటూరుకు ట్రాన్స్‌ఫరైంది కుటుంబంతో సహా ఆయన ఆ వూరెళ్ళి పోయాడు విజయ్ హైదరాబాదులో ఉండటంతో వైజయంతి కూడా వాళ్ళతోటే వెళ్ళింది

విజయ్ హైదరాబాదులో ఉండగా విధి అతని జీవితాన్ని నిర్దాక్షిణ్యంగా మట్టగించి పారేసింది

ఒకేసారి చనిపోకుండా అనుక్షణం చస్తూ బ్రతికుండగానే నరకం అనుభవించటమంటే ఏమిటో అతను ప్రత్యక్షంగా చవి చూశాడు

గోదావరి నది ఉధృతరూపం దాల్చి పరవళ్ళు తొక్కుతోంది ఎర్రని నీరు సుడులు తిరుగుతూ ఒడ్డును ఒరుసుకుంటోంది

లారీలతో ఇసక సిమెంట్ బస్తాలు గట్టు పొడవునా వేయించటం ప్రమాద హెచ్చరికలు పల్లపు ప్రాంతాల్ని ఖాళీ చేయించటం లాంటి ముందు జాగ్రత్త చర్యలు ప్రారంభమయ్యాయి

రాను రానూ గోదావరి నీటి మట్టం పెరిగి పోతోంది గోవుపాదాల రేవు ఒడ్డున ఉన్న శివాలయం తాలూకు గోపురం మాత్రమే కనిపిస్తోంది

అవసరమైన సామాను పెట్టెలో సర్ది, మేడ మెట్ల దగ్గర పడేసుకుని కాస్త మెరక ప్రాంతంలో ఉన్న ఇల్లు గనక ఖాళీ చెయ్యకుండా మధ్య మధ్యలో మెలకువ తెచ్చుకుంటూ పడుకున్నారు మాధవరావు కుటుంబం వాళ్ళు .

అర్ధ రాత్రి దాటాక ఆదమరిచి కునుకు పట్టింది వాళ్ళకి

ఉవ్వెత్తున లేచి, ఒడ్డును చీల్చుకుని ప్రచండ వేగంతో ఊరి మీద పడింది వరద గోదారి

ఊపిరి పీల్చుకునే వ్యవధి కూడా ఇవ్వకుండా అక్కడో చిన్న పల్లెటూరుందనే ఆనమాలైనా తెలీనివ్వకుండా తుడిచి పెట్టేసింది

ఈ వార్త విని నిశ్చేష్టుడయ్యాడు విజయ్

ఆశ చంపుకోలేక ఆ ప్రాంత మంతా పిచ్చివాడిలాతిరిగాడు

చావగా మిగిలిన అతి కొద్ది మందిలో వైజయంతి లేదు!

మాదవరావు కుటుంబం ఆనవాళ్ళు కూడా లేవు .

కత్తితో శరీరాన్ని కోసి ఒక్కొక్క కండా బయటకు లాగుతున్నట్లుంది విజయ్‌కి

అతని కళ్ళలో నుంచి కారేది కన్నీరులా లేదు రక్తపు బొట్లే రాలుతున్నట్లుంది

పిచ్చెక్కిన వాడిలా మతి ఉండీ లేనివాడిలా మూఢునిలా అలమటిస్తూ ఒంటరిగా కూర్చుని గొంతెత్తి కదిలి కదిలి ఏడిచాడు..

జీవితంలో ఇంతటి విషాద ముంటుందని అది మనిషి నింత దారుణంగా వెన్నుపోటు పొడుస్తుందనీ అత నెరుగడు.

చిన్నప్పుడు 'ఆప్యాయత అనే పదాని కర్థం తెలియక పోయినా అతను దిగులు పడలేదు

తల్లి ఒడిలో చల్లదనం ఎరుగక పోయినా ఇలా దుఃఖించ లేదు

తన కిష్టంలేని మనుషుల్ని బలవంతాన భరించాల్సి వచ్చినప్పుడు అలాంటి వాతావరణంలో ఇమడలేక అవస్థ పడినప్పుడూ అతనింత బెంబేలు పడలేదు

తనను గాఢంగా పెనవేసుకుని ఆమె లేకపోతే తన ఉనికికే అర్థం లేదు అనుకునేంతటి అనుభూతుల్ని పంచి ఇచ్చి లతలా అల్లుకు పోయిన వైజయంతి తను ధ్వంస మవుతూ అతన్ని కూడా కూల్చేసింది జీవచ్ఛవాన్ని చేసింది

ఇప్పుడు దీన్ని తట్టుకోలేక విలపిస్తున్నాడు విజయ్

"ఏమండీ!" అనే పిలుపు వైజయంతి స్పర్శ అనురాగం లాలన స్నేహం అతన్ని చుట్టు ముట్టి ఊపిరి తిప్పుకో నివ్వటం లేదు

ఆమె స్మృతు లతన్ని కుమ్మేస్తున్నాయి

రక్తం తోడేస్తున్నట్లుగా ఉంది విజయ్‌కి

గోరీలో నుంచి లేచొచ్చిన మనిషిలా మారిపోతున్న విజయ్‌ని చూస్తుంటే గుండె చెరువవుతోంది జగదీష్‌కి, ఎలా ఓదార్చాలో అర్థం కావటం లేదు

ఎలా \ఎలా అతన్ని తిరిగి మనుషుల్లో పడెయ్యాలి?' అన్నదే జగదీష్‌ని నిరంతరం వేదిస్తున్న సమస్య

విజయ్‌ని హైదరాబాద్ తీసి కెళ్ళి అత నెంత మొత్తుకున్నా వినకుండా తరుచు తనతో తిప్పుకుంటూ అంటి పెట్టుకునే ఉండేవాడు తను

ఎప్పుడూ ఇలా నా దగ్గరే కూర్చుంటే నీ బిజినెస్ దెబ్బతింటుంది నువ్వెళ్ళు జగదీష్'' అనేవాడు విజయ్

నే వెళ్లను నా బిజినెస్ సంగతి నాకు తెలుసు విజయ్ నీ సంగతేమిటి? ఎలా చెప్పను నీకు?"

నా సంగతేముందింక? నే నింకా ఎలా బ్రతికున్నానో ఎందుకు బ్రతుకుతున్నానో నాకే అర్థం కావటంలేదు

నువ్విలా ఆలోచిస్తున్నంత సేపూ ఈ దుఃఖం నిన్ను విడువదు విజయ్

నేను బ్రతికేది కేవలం నా సుఖ సంతోషాల కోసమే' అనే స్వార్థం మనిషిని ఒదిలినప్పుడే అతనికి నిజమైన శాంతి దొరుకుతుంది

మనసును కుదుట పరుచుకో, నీ బ్రతుకును పీడిత ప్రజల కోసం త్యాగం చెయ్యి నీ కష్ట సుఖాల గురించి ఆలోచించటం మాని వాళ్ల గురించి ఆలోచించు నిరంతరం ఎందరో నోరులేని అమాయకులు తాము చెయ్యని నేరాలకు నిశ్శబ్దంగా బలైపోతున్నారు

బలవంతుడి గూండాయిజానికి బలహీనుడు దారుణంగా ఆహుతై పోతున్నాడు

నువ్వెన్నుకున్న పంథాలో నిజాయితీగా పయనించి కనీసం కొందరి

> జరిగిన కథ- 22: విజయ్‌కి వైజయంతితో పరిచయం, వాళ్ళ ఇంట్లో ఆదరణ క్రమక్రమంగా వాళ్ళిద్దరి మధ్య అనురాగానికి దారితీస్తాయి అనుకోని పరిస్థితులలో వాళ్ళిద్దరూ ఏకమవుతారు వైజయంతి కుటుంబం చాలా సంకోచించిన తర్వాత చివరికి పెళ్ళికి సిద్ధపడుతుంది పెళ్ళి చేసుకుని వచ్చిన విజయ్‌ని శమంతకమణి వెళ్ళగొడుతుంది వైజయంతిని అవమానిస్తుంది విజయ్‌కి జగదీష్ పరిచయమవుతాడు.

కన్నీళ్లయినా తుడవటానికి ప్రయత్నించు . పోలీస్ డిపార్ట్మెంటులో ప్రవేశిస్తున్నావు

ఆ డిపార్ట్మెంటు ప్రతిష్ఠని పెంచే విధంగా ప్రవర్తించు అన్ని టెస్ట్‌లూ పాసయి సెలక్టయి తీరా ట్రైనింగ్ కెళ్లే టైంలో ఇలా అస్త్ర సన్యాసం చెయ్యకు నీ గురించిన స్వార్థంతో ఒక మంచి పోలీసాఫీసర్ని ఆ డిపార్ట్మెంట్ కోల్పోయేలా ప్రవర్తించకు

నీకు మంచి తెలివితేటలున్నాయి ధైర్య సాహసాలున్నాయి..

ఏటి కెదురీదకుండా ఏటివాలున వెడుతూనే సమయం చూసి ప్రత్యర్థిని చావుదెబ్బ కొట్టగల శక్తి యుక్తులు నీకున్నాయి.

వాటి నిలా వృథా కానివ్వకు

చీకటి ప్రపంచపు కబంధ హస్తాల్లోకి నిర్దాక్షిణ్యంగా లాగబడి శీలాన్ని, ప్రాణాన్నీ పణంగా పెట్టాల్సిన పరిస్థితుల్లో ఇరికించబడ్డ అమాయకులైన ఆడపిల్లల్ని కాపాడు

ఆకలి... అవసరం అనే బలహీనతల మీద దెబ్బకొట్టి పసివాళ్లను సైతం దొంగలుగా మార్చే స్వార్థపరులతో నిండి ఉన్న ఈ వ్యవస్థ మీద దాడి చెయ్యి...

పోలీస్ డిపార్ట్మెంటులో నీకు ఉన్నతాధికారిగా సంక్రమించే అధికారాన్ని ఇలాంటి స్వార్థపూరితమైన శక్తులమీద ప్రయోగించి నీ వంతు బాధ్యత నువ్వు నెరవేర్చు.

నీ మనసు కుదుటపడే వరకూ నీ గురించి నువ్వాలోచించటం మానెయ్యి విజయ్

నీ దుఃఖం ఉపశమించగల మార్గం ఇదొక్కటే నిన్నునువ్వు ఏ కొంచమయినా మర్చిపోగలిగితే అది నీకెంతో ఇష్టమైన ఈ వృత్తిలోనే సాధ్యపడుతుంది

నా మాట విను విజయ్

దుఃఖాన్ని మనం జయించ గలగాలి గానీ అది మనని తినేస్తుంటే నిస్సహాయంగా చూస్తూ ఊరుకోగూడదు .

అంటూ వీలు దొరికినప్పుడల్లా విజయ్‌కి నూరిపోసేవాడు జగదీష్

జగదీష్ బలవంతం మీదే ప్రొబేషనరీ ట్రైనింగ్‌కు వెళ్లాడు విజయ్.....



# నచ్చిన సన్నివేశం

"ఆకాశంలో విహారానికొచ్చిన తారల్లారా ఇది తెలుసా మీకు? మురళి నన్ను పెళ్ళి చేసుకుంటున్నాడు

పువ్వు పువ్వునూ అల్లరిగా తాకే చిరుగాలి ఇది తెలుసా నీకు? మురళి నన్ను

అలా కళ్ళు మూసుకొని కలలు కంటూ ఎక్కితే జారిపడతారు" మురళి హెచ్చరింపుతో కళ్ళు తెరిచి. విచ్చిన జాజులు రాలిపడ్డట్టు నవ్వింది సౌందర్య ఇది సహజంగా చదివేవారి మనసుల్లోకి జొరబడి, అల్లరిచేసి,



ఆనందం నింపే సన్నివేశం ఇంత వరకూ తమ కలంతో సీరియల్ మామూలుగా రాసుకుంటూ వస్తున్న రచయిత్రి సావిత్రిగారు కావాలని తమ కలానికి పంచదార అద్ది మరీ ఈ సన్నివేశం రాసుంటారన్న అనుభూతి కలిగి తీరుతుంది దగాపడ్డ ఓ చెల్లికి ఈ సన్నివేశంలో తగిన న్యాయం చేసిన రచయిత్రి అభినందనీయులు

– కె. అంజనేయకుమార్,
విజయవాడ

★ ★ ★

సౌందర్య, మురళీధరరావు లిద్దరూ కోవెలకు వెడతారు అక్కడ మురళీ సౌందర్యతో వివాహ ప్రసక్తి తీసుకురాగా సౌందర్య చెప్పలేక పోతున్నప్పుడు– "సౌందర్యా ఆ బ్లూ ఫిలిం వ్యవహారం గురించి బాధపడుతున్నారా?? నాకంతా



తెలుసు నీ నిర్దోషిత్వం గురించి కూడ తెలుసని చెపుతూ 'మనం నిద్దర్లో ఎన్నో పీడ కలలు కంటూ ఉంటాం మెలకువ వచ్చాక ఆ పీడను మర్చిపోవటానికే ప్రయత్నిస్తాం" అని ఈ సంఘటనను కూడ ఆ విధంగా గుర్తు చేయనక్కరలేదు మర్చిపోవచ్చునని చెబుతాడు ఆమె బయాన్ని ఆందోళనను పోగొడతాడు

ఈ సన్నివేశంలో రచయిత్రి మంచి ఆదర్శవంతుడైన పురుషుడిని చూపించారు అసలు అటువంటి నిర్ణయం తీసుకోవటానికి ఎస్. ఐ. మురళీధర రావు ఒక ఆదర్శంగా యువకులకు కన్పింపచేశారు

– కొత్తపల్లి రత్న, రాజమండ్రి

★ ★ ★

చూపిన అతని చేతి వేపు సంకోచంగా చూసిందామె.

జాగ్రత్త! చెయ్యి అందుకునే ముందు సరిగ్గా ఆలోచించుకోండి



## టి. ఎస్. ఎ. విజయ్

అతనిలో స్పందన నశించి తిరిగి తన సెల్‌లోకి ప్రవేసించటానికి చాలా సమయం పట్టింది విజయ్‌కి

అన్నాళ్ళూ నీడలా అతన్ని అంటిపెట్టుకునే ఉన్నాడు జగదీష్..

విజయ్ పోలీసాఫీసర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించి నప్పుడు జగదీష్ చేసిన హడావుడి ఇంతా అంతాకాదు .

అతని గురించి ఎప్పుడు ఆలోచించినా విజయ్ మనసు కృతజ్ఞతతో . ఒక అనిర్వచనీయమైన భావనతో నిండి పోతుంది . ..

ఇన్ని సంవత్సరాల తరవాత తిరిగి ఈ పసివాడు నానీ తనలో అస్పందనా.. ఆర్ద్రతా రగిలిస్తున్నాడు?




వీడు వైజయంతి చేతులలో పెరిగిన వాడవటం ఇందుకు కారణం కావచ్చు

"ఒక వ్యక్తి మీద మనకు ఏర్పడ్డ నిలకడైన అభిప్రాయమే ఆ వ్యక్తికి సంబంధించిన సన్నిహితుల మీద కూడా తన ప్రభావాన్ని చూపిస్తుంది "

తన నెచ్చెలి ప్రియ బాంధవి అయిన వైజయంతి సజీవంగా ఉండటం ఎంతటి సంభ్రమాన్ని కలిగిస్తోందో ఆమె చుట్టూ బిగుసుకుని ఉన్న దుర్భరమైన పరిస్థితులంత కన్నా ఎక్కువ వ్యధను కలిగిస్తున్నాయి

ఇన్నేళ్ళుగా ఆమె ఎలాగడిపిందో ఏ అనివార్య సంఘటనలామె జీవితంలోకి బలవంతంగా ప్రవేసించాయో ఇవన్నీ తన కవసరంలేదు నానీతో సహా తిరిగి ఆమె తన ఇంటికే వచ్చేస్తుంది

తన నిరీక్షణంతా రాబోయే ఆ శుభ గడియల కోసమే. ఆమెను వాళ్ళ మధ్య వదిలేసి ఆమె బ్రతికుందనే సంతోషాన్ని ఆర్తిగా ఆమెతో పంచుకోటానికయినా లేకుండా చేతకాని వాడిలా ఇలా చేతులు ముడుచుకు కూర్చోటం ఎంత దుర్భరంగా . నరక సదృశంగా ఉందో డీన్ని భరించటానికెంత శక్తిని కూడదీసుకోవలిసొస్తోందో తన కొక్కడికే తెలుసు.

కొన్నాళ్ళ పాటు ఇదంతా తనకు తప్పదు

పరిస్థితులు తన వెంటపడకుండా తనే వాటిని తరుముతూ అవకాశం కోసం పొంచి ఉన్నాడు తను.

తను తప్పక విజయం సాధించి తీరతాడు

నానీ నిద్దట్లో కదిలి విజయ్ పొట్ట మీద చెయ్యేశాడు

అంతలో కళ్ళు తెరిచి అంకుల్? నిద్రపోలేదూ?! అన్నాడాశ్చర్యంగా

"లేదమ్మా. నిద్రరావటం లేదు " అన్నాడు విజయ్.

తలతిప్పి వాల్ క్లాక్ వేపు చూసి 'మైగాడ్! త్రీ థర్టీ!' పడుకోండంకుల్. నిద్రలేకపోతే హెల్త్ పాడవుతుంది కళ్ళు మూసుకుని ప్రశాంతంగా పడుకుంటే-చాలు...

సౌందర్యా ఒక పెళ్ళికాని అబ్బాయి చేతిని ఒక పెళ్ళికాని అమ్మాయి పట్టుకుని ఏడడుగులు నడిస్తే మన సాంప్రదాయం ప్రకారం వాళ్ళిద్దరికి పెళ్ళయి పోయినట్టే జీవితాంతం వరకు ఆ చేతులు విడివడకుండా చూసుకోవాల్సిన గురుతరమయిన బాధ్యత వాళ్ళ మీద ఉంటుంది

పై సన్నివేశం సావిత్రిగారు చాలా చక్కగా వ్రాసారు

– చంద్రశేఖర్, బి. కె.,
హిందూపురము

★ ★ ★



డి.యస్ పి విజయ్ సీరియల్‌లో ఓ సందర్భంలో చం దరావు, విజయ్‌తో రంగారావు, ధర్మారావు తోడుదొంగలు అంటాడు

అప్పుడు విజయ్, "ఆ సంగతి ప్రజలందరికీ తెలుసు అయినా వాళ్ళు ధర్మారావునే గెలిపిస్తారు ఆఖరుకు ముఖ్యమంత్రిలాంటి కీలకమైన స్థానాన్ని కూడా అధిరోహించే వ్యక్తుల పట్ల క్రేజ్ చూపించే ప్రధాన పాత్ర వహించే స్థాయిలో ఉన్నారు మన ప్రజలు పరిపాలనా దక్షత లేక పోయినా, సంవత్సరాల తరబడ, కన్నెత్తి ప్రజల వైపు చూడకపోయినా, రేపో, మాపో ఎగిరిపోయేంత జరా భారంతో కృంగిపోతున్నా, పట్టించుకోకుండా ఆయన మా ముఖ్యమంత్రి అని చంకలు గుద్దుకుని పిచ్చితనం నుంచి బయటపడి ప్రజలు చైతన్యవంతులైననాడు, తిరగబడ్డనాడు, ఈ రంగారావులు, ధర్మారావులు నామ రూపాలు లేకుండా పోతారు

ఆవేశంలో విజయ్ అన్న మాటలు ఆ సన్నివేశానికే వన్నె తెచ్చినాయి

– టి. యన్. కృష్ణమోహన్,
అనకాపల్లి

★ ★ ★

తనను దారుణంగా చావుదెబ్బ కొట్టిన శ్రీధర్‌ని సాధించే మార్గాలకోసం రక రకాలుగా ఆలోచిస్తోంది సౌందర్య కానీ ఏ ఒక్కటీ తృప్తికరంగా లేదు వాడిని సాధించటానికి తన ఒక్కదాని తెలివితేటలూ సరిపోవు.

సమర్థుడైన ఇంకో వ్యక్తి సలహా సహకారాలు తనకు కావాలి అతని సపోర్ట్ తనకుండాలి ఈ విషయం ఎవరికి చెప్పుకుని సలహా అడగాలి?



ఆడవాళ్ళయితే మాటలతో కుళ్ళబొడిచి, వెలివేసి హేళన చేస్తారే తప్ప ఏవిధంగాను సహాయపడరు

మగవాళ్ళయితే సలహా సంగతి దేముడెరుగు, తాము ట్రయల్స్ వెయ్యటం ప్రారంభిస్తారు

ఇలా ఎవరికీ చెప్పుకోలేదనే ధైర్యంతోనే శ్రీధర్‌గాడు అంతకు తెగించాడు

చప్పున ఓ ఆలోచన మెరిసిందామెలో. ఒక వ్యక్తి ఆమె మనోఫలకం మిద ఆ వెంటనే ఆ వ్యక్తి ఎవరో నా మనోఫలకంమీద కూడా మెరిసాడు.

అతనే డి. ఎస్. పి. విజయ్!

ఈ సీరియల్‌లో ఈ సన్నివేశం నాకు బాగా నచ్చింది.

-ఎ. రవీంద్ర,
రామలింగాపురం,
(నెల్లూరు) □

---

నిద్రొచ్చేస్తుంది ' అన్నాడు నానీ ఆప్యాయంగా

చప్పున వైజయంతి గుర్తొచ్చింది విజయ్‌కి

తను కూడా ఇంతే నిద్రలేకుంటే ఆరోగ్యం పాడవుతుందంటూ బ్రతిమాలి నిద్ర పుచ్చేది'

నానీని దగ్గరగా లాక్కుని కళ్ళు మూసుకున్నాడు విజయ్

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

సాధారణంగా డి ఎస్ పి లెవెల్ నుంచి పైవాళ్ళంతా పర్యవేక్షణ చేస్తారేగానీ స్వయంగా కేసును టేకప్ చేసి డీల్ చెయ్యరు ఆ వ్యవహారమంతా సి ఐ, ఎస్ ఐ లాంటి వాళ్ళు చూసుకుంటారు

కానీ . విజయ్ అలాకాదు అవసరమని తోచినట్లయితే తను కూడా రంగంలోకి దిగి కష్టపడటానికి వెనుకాడడు

ఇది మురళీధరరావు లాంటి వాళ్ళకు ఇన్స్పిరేషన్ కలిగిస్తే .. ఇంద్రాపూర్‌కు కొత్తగా వచ్చిన సి ఐ జగన్నాధం లాంటి వాళ్ళకు కంటగింపు కలిగిస్తుంది

జగన్నాధంకి అసూయ ఎక్కువ. ఎస్ పి కి కాస్త దగ్గర వాడతను ఆ అహంభావం కూడా అతనిలో ఉంది.

డి ఎస్ పి. విజయ్‌కి తమ డిపార్ట్ మెంటులోనూ.. స్థానికంగానూ ఉన్న ఇమేజ్ అతనికి కంటగింపుగా ఉండేది

కానీ .. అతను తనపై అధికారి కావటంతో తన అసహనాన్ని గుప్తంగా దాచుకోవాలి సొచ్చేది ..

అసలు . పైవాళ్ళ మాట తలుచుకుంటేనే పరమచిరాకతనికి.

"మాలో లంచగొండి తనాన్ని వాళ్ళే ప్రోత్సహిస్తున్నారు. ఫరెగ్జాంపుల్.... ఇది చాలా చిన్న విషయం ... "ఎస్. పి. వస్తున్నాడు. స్టేషన్‌కి సున్నం, రంగులు వేయించండి అంటూ ఆ వ్యవహారాన్ని తమకి అప్పగిస్తారు డబ్బులు మాత్రం ఇవ్వరు చేతిడబ్బులెవడూ పెట్టుకోడు గదా 'ఊళ్ళో నీ కామాత్రం పరపతి లేదా? అంటారు ఉందని నిరూపించు కోటానికి పై వాడి ఆగ్రహానికి గురి కాకుండా ఉండటానికి తాము ఊరిమీద పడాలి సున్నం, రంగులూ వగైరాలు అప్పనంగా అడుక్కొచ్చి స్టేషన్‌ను అలంకరించాలి

ఇహ తమకి హుందాతనం ఎక్కడి నుంచొస్తుంది? నిజాయితీకి ఖరీదు చెల్లించే స్థోమతు లేక తామూ నలుగురు నడిచే దార్లోనే పయనిస్తూ ఉంటారు

కేసును టేకప్ చేసి.... నేరస్థుల వెనకాల పరుగెత్తి వాళ్ళని తన్ని



## డి. ఎస్. పి. విజయ్

తన్నించుకుని నానా చావూ చచ్చే తమకి జీప్ ఉండదు

నేరస్థుడు జీప్ మీద పారిపోతుంటే తాము వాడిని తరమటానికి ఏ వాహనాలూ ఉండదు

పర్యవేక్షణ పేరుతో తమ నెత్తి నెక్కే డి ఎస్ పి లకు మాత్రం జీప్‌లిస్తారు!

ఒక మినిస్టర్ వస్తున్నాడంటే మూడు రోజులు ముందుగానే బందోబస్తు పేరుతో తమనాస్పాట్‌కు తరుముతారు

వాళ్ళంతా హాయిగా విందులూ జల్సాలు చేస్తుంటే . . తమను పట్టించుకునే నాథుడే ఉండడు తిండి ఉండదు అకామడేషనుండదు టిన్షన్ తోనూ పై వాడి తిట్లతోనూ కడుపు నిండాల్సిందే గానీ అన్నంతిని కడుపు నింపుకునేదుండదు తామో కేసు విచారించి అష్టకష్టాలూ పడి నేరస్థుడిని పట్టుకుంటే పోరా పుసుకా నీలెక్కేమిటి?' అన్నట్టు ఆ నేరస్థుడి తరపు వాళ్ళు సరాసరి డి ఎస్ పి దగ్గర కెళ్ళి ఆయన జేబులు నింపి వస్తారు ఇహ మొదలు

ఆ నేరస్థుణ్ణి వదిలెయ్యి అంటూ ఆయన నస వినకపోతే తిట్లు.

వదిలెయ్యంగానే 'ఆ సి ఐ గాడు బాగా డబ్బుతిని, నేరస్థుడిని వదిలేశాడు అంటూ ప్రజల ఘోష!

దూత్తేరి! మాయదారి డిపార్ట్‌మెంటు' అంటూ రగిలి పోతుంటాడు జగన్నాథం

ఎక్కువగా అలాంటి వాటికే అలవాటు పడ్డ జగన్నాథం నిజానికి విజయ్ మెంటాలిటీకి అతని బిహేవియర్‌కూ ఎంతో సంతోషపడాలి

ఒకరకం మనుషులుంటారు

సహజంగా వాళ్ళలో అసంతృప్తి ఓ పాలు ఎక్కువే ఉంటుంది వాళ్ళ జీవనవిధానం వృత్తి పరంగా ఎదురయ్యే అనేక సంఘటనలూ ఆ అసంతృప్తిని ఇంకా ఇంకా పెంచుతూ ఉంటాయి

అతన్ని 'సినిక్'గా తయారు చేస్తాయి

ఎప్పుడో ఒకసారి విజయ్ లాంటి అధికారులు తారసపడ్డా వాళ్ళ కింద పీస్‌ఫుల్‌గా పని చెయ్యగల పరిస్థితులున్నా వాళ్ళలో ఆ అసంతృప్తి తొలగదు

చిత్రంగా ఆ అసంతృప్తి ఇంకా పెరిగి అసూయగా రూపు దాలుస్తుంది ఒక మంచి ఆఫీసర్‌ని చూసి సంతోషించే బదులు అతన్నెలా నాశనం చెయ్యాలా అనే ఆలోచనలే వాళ్ళలో కలుగుతుంటాయి. అలాంటి ప్రయత్నాలే చేస్తుంటారు.

మనిషిలో అంతర్గతంగా ఉండే రాక్షస ప్రవృత్తికి వీళ్ళు చక్కని ఉదాహరణలు..

జగన్నాథం ఇలాంటి మనుషుల కోవకు చెందినవాడే

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

పొట్టి నిక్కరు పొట్టి చేతుల చొక్కా సంస్కారం లేని రాగి రంగుజుట్టు

నాగరికతకూ అనాగరికతకూ మధ్య గీత మీదున్న ఒక చెంచు గూడెపు మనిషి అచ్చయ్య దుకాణం దగ్గర నిలబడి, పుగాకు, బెల్లం లాంటి సరుకులు తూయించుకుంటున్నాడు అతని వెనక పువ్వులలంగా ముడి వేసుకున్న జాకెట్టుతో ఒక పిల్ల నిలబడి ఉంది

చెంచుల దగ్గర లక్క జిగురు కుంకుడు కాయలు కారు చవకగా కొనేసి, తిరిగి వాళ్ళకు తప్పుడు తూకంతో, రెట్టింపు రేట్లతో నాసిరకం సరుకులు అంటగట్టి కనిపించని లాభాలార్జిస్తూ ఉంటాడు అచ్చయ్య

పెరిగి పోతున్న ధరల గురించి . వాళ్ళ మీద అభిమానం కొద్దీ తను రేట్లు తగ్గించి ఇస్తున్న సరుకుల నాణ్యత గురించీ ఉపన్యాసమిస్తూ బెల్లం తూకమేస్తున్నాడు అచ్చయ్య .

కొట్టుకు దూరంగా నిలబడ్డ కొందరు మనుషులు క్రితం రోజు రాత్రి ఊళ్ళో జరిగిన దొంగతనం గురించి చెప్పుకుంటున్నారు. .

అటువేపు మోటర్ సైకిల్ మీద వెడుతున్న సి ఐ. జగన్నాథం అచ్చయ్య కొట్టు వేపు క్యాజువల్‌గా చూశాడు చెంచు వాడి పక్కనున్న పిల్లను చూడగానే జగన్నాథం కళ్ళు తళుక్కున మెరిశాయి.

క్రితం రోజు జరిగిన దొంగతనం . . చెంచుగూడెపు మనిషి . వాడి వెనక దోరజామకాయలా ఉన్న పిల్ల. ఈ మూడిటికీ లంకెపెట్టి చూసుకున్నాడు .

తనతో ఉన్న పోలీసుల సహాయంతో వాళ్ళ అరుపులూ గోలా లెక్క చెయ్యకుండా ఆ మనిషినీ పిల్లనీ స్టేషన్‌కి లాక్కెళ్ళాడు జగన్నాథం

వాళ్ళు లాక్కు పోయేటప్పుడా మనిషి కండువాలో నుంచి జారిపడ్డ బెల్లాన్నీ, పుగాకునీ తిరిగి తన డబ్బాలో వేసేసుకున్నాడు అచ్చయ్య

దూరంగా ఉన్న మనుషులు దీన్నంతా చూసీ చూడనట్టు చూసి ఇహ టాపిక్‌ను ఇటు వేపు తిప్పారు......

## గడుసులోకం —బాబు






"ఆ దొంగతనం ఈ చెంచుముండా కొడుకులే చేసుంటారు. రాత్రిపూటొచ్చి దొంగతనాలు చేసేది.. . దర్జాగా అడివిలోకి పారిపోయేది.

ఈ పోలీసోళ్ళ కా అడివిలో దిక్కుతెలీక బిక్కు బిక్కుమంటూ వెనకొచ్చేది వీళ్ళ అసమర్ధత, చేతకాని తనాన్ని అలుసుగా తీసుకుని ఆ చెంచులు పేట్రేగిపోతున్నారు... ." అనుకుంటున్నారు వాళ్ళు మూకుమ్మడిగా ...

స్టేషన్ కొచ్చాక బూటుకాలితో అతన్ని లోపల పడేలా ఈడ్చితన్ని "నీ పేరేమిట్రా?" అన్నాడు జగన్నాధం

ఈ చర్య గురించి ఎవరయినా ప్రశ్నిస్తే "ఔను మాకీ రఫ్‌నెస్ తప్పనిసరి మా దినచర్య బ్యాడ్ ఎలిమెంట్స్ తోనే ప్రారంభమవుతుంది. సంస్కార వంతులతో మాకిలాంటి సంబంధాలుండవు అందుచేత మేము సంస్కారంగా ప్రవర్తించాల్సిన అవసరం లేదు. ఎలాంటి వాళ్ళనలాగే డీల్ చెయ్యాలి" అంటాడు టకీమని.

ఇలాంటి సంజాయిషీలతని దగ్గర ఎప్పటి కప్పుడు రెడీగా ఉంటాయి .

తన ప్రవర్తన వల్లే ప్రజలకు తన మీద ద్వేషం కలుగుతోంది అనే వాదనని కూడా అతనొప్పుకోడు.

"మిగిలిన కొన్ని డిపార్ట్‌మెంట్ల వాళ్ళకి, మనిషి కుండే ప్రాబ్లంస్ మీద మాత్రమే అధికారముంటే.. మాకు సరాసరి మనిషి మీదే అధికారముంటుంది

ఇన్‌కంటాక్స్ వాళ్ళున్నారంటే . . వాళ్ళో ఇంటి మీద రెయిడింగ్ చేస్తే.. ఆ ఇంటి యజమాని అవినీతిని గురించి మాత్రమే ప్రశ్నించి .... సాక్ష్యాలు సేకరించి, తగిన చర్య తీసుకుంటారు అంతే ఆమనిషిని వాళ్ళు తాకటానికి వీల్లేదు

కానీ .. మేము ఒక వ్యక్తిని అనుమానించామంటే . ఆ అనుమానం మీద వాడిని పట్టుకుని డైరెక్టుగా చావ బాదుతాము ఆ అధికారం వాళ్ళకి లేదు.

ఇలాంటి ప్రత్యేకాధికారం మాకుండటం మూలానే ప్రజలకు మేమంటే కోపం.... అసహనం. .." అని వాదిస్తాడు అంతే గానీ అతనెప్పుడూ ఆత్మ విమర్శ చేసుకోడు.

అలా హఠాత్తుగా సి. ఐ కి చిక్కటంతో దిమ్మెరపోయి భయంగా చూస్తున్నాడా చెంచు గూడెపు మనిషి

"చెప్పరా! నీ పేరేమిటి?" ఇంకోసారి గర్జించాడు జగన్నాధం

"గురప్ప" అన్నాడు అతను.

పోలీసుల చేతుల్లోంచి పాములా జారి పోవాలని ప్రయత్నించాడు గురప్ప కానీ వాళ్ళు ఎలర్ట్‌గా ఉండటానికి తోడు కూతురు కూడా ఒక బంధంలా ఉండటంతో అతని ట్రిక్కులు పని చెయ్యలేదు

లాఠీతో గురప్ప మోకాళ్ళ మీద ఎడాపెడా బాది "పిచ్చి పిచ్చివేషా లేశావంటే తోలుతీసేస్తాను." అన్నాడు జగన్నాధం.

"వీళ్ళ చేతుల్లోంచి తప్పించుకుని అడివి వరకూ లగెత్త గలిగితే చాలు.... ఆతరువాత అడివితల్లే తమని కాపాడుద్ది అప్పుడు తనను పట్టుకోటం ఈ నాయాళ్ళ వశం కాదు!" ఇలా ఆలోచిస్తున్న గురప్ప జగన్నాధం లాఠీ దెబ్బలతో ఆలోచనలాపేశాడు

"నిన్న రాత్రి దొంగతనం చేసింది మీ వాళ్ళేగదూ? నువ్వూ వున్నావా ఆ గ్యాంగులో? ఆడబ్బూ నగలూ ఎక్కడ పెట్టారు? మీ వాళ్ళంతా ఎక్కడున్నారో చెప్పు లేక పోతే చంపేస్తాం నిన్ను." క్రూరంగా చూస్తూ అన్నాడు జగన్నాధం.

క్రితం రోజు జరిగిన దొంగతనం అతని ఏరియాలోనే గురప్పని చూడగానే అనుమానం వాళ్ళ మీదికి తిరిగింది.. ఎలా గైనా వాడి నోటంట ఇది మేమే చేశామని ఒప్పించాలనే పట్టుదల పెరిగింది .

"బోనాలమ్మ సాచ్చిగా మాకే పాపం తెలీదు సామీ మా గూడెపోల్లు దొంగ తనాలెప్పుడో మానేసిర్రు గింజలు పండిచ్చుకుని .... లక్క తీసుకుని .... ఈదుపాకు కోసుకుని బతుకుతున్నాం మేము. కావాలంటే ఎవుర్నయినా కనుక్కోండి. మమ్మల్నిడిసి పెట్టండి సామీ. మీకు మొక్కుతా." అంటూ చేతులెత్తి దణ్ణం పెడుతూ గగ్గోలు పెట్టటం ప్రారంభించాడు గురప్ప. (ఇంకా ఉంది)

# మరి, పిళ్ళ(సం)గతేమిటి?

-ప్రతాప రవిశంకర్

భార్య శాపనార్థాల సుప్రభాతంతో గురుమూర్తికి మెలకువ వచ్చింది బద్ధకంగా కళ్ళు తెరిచాడు. తెరచి వున్న కిటికీలో నించి సూర్యుడి కిరణాలు లోపలకు పడుతున్నాయి.

వంట గదిలో భార్య శారద పిల్లల్ని ఎందుకో తిడుతోంది ఆమె పిల్లల్ని ఎప్పుడంటే అప్పుడు తిట్టడానికి ఒక కారణం అంటూ ఏదీ అవసరం లేదని గురుమూర్తికి తెలుసు

మంచం మీదనే కూర్చుని ఆ తిట్ల సుప్రభాతాన్ని ఆలకించటం మొదలుపెట్టాడు

"మీకూ, మీ నాన్నకీ, అడ్డమైన వాళ్ళందరికీ నేనొకదాన్ని కనపడుతున్నాను ఉద్యోగం చేస్తూ నాకేమైనా వేలూ, లక్షలు వస్తున్నాయా? వెళ్ళండి వెళ్ళి అంతా మీ నాన్న మీద పడి అడగండి" అని కసురుకుంది శారద

అది కాదమ్మా ' అంటూ ఏదో చెప్పబోయాడు పెద్దవాడు గోపి .

ఛా... నువ్వూ నన్నే పీడిస్తావు వెళ్ళండి ' అన్నది తీవ్రంగా

ఇక పిల్లలు తన దగ్గరకు వస్తారని అనుకున్నాడు గురుమూర్తి

భార్య ప్రవర్తన గురించి అతడికి బాగా తెలుసు ఇట్లాంటి విసుర్లు, చీదరింపులూ శారదకు చాలా మామూలుగా తయారయ్యాయి

అతడు మంచం మీద నుంచి లేచి నిలబడుతున్నప్పుడు పిల్లలు ముగ్గురూ ఆ గదిలోకి వచ్చారు

అందరికంటే ముందు నాయకత్వం వహిస్తున్నట్టుగా పెద్దవాడు వున్నాడు వాడి వెనక ఏడేళ్ళ అమ్మాయి జ్యోతి, మూడోవాడు కృష్ణ వున్నారు

"ఏమిట్రా... ఏమిటి పొద్దున్నే మీ అమ్మచేత తిట్లు తింటున్నారు?" అడిగాడు గురుమూర్తి తొమ్మిదేళ్ళ గోపిని.

స్కూల్లో ఫీజు కట్టాలి అమ్మను డబ్బులు అడిగాను నిన్ను అడగమన్నది' చెప్పాడు వాడు.

'రేపు కడదాములే" అన్నాడతను

"ఈ రోజునే తీసుకు రమ్మన్నారు తీసుకు రాకపోతే మా టీచర్ కొడుతుంది" అన్నాడు గోపి

విసుక్కున్నాడు గురుమూర్తి

"నా దగ్గర ఇవాళ డబ్బులు లేవు సాయంత్రం ఎక్కడయినా డబ్బులు అప్పు తీసుకుని రేపు మీ స్కూలు ఫీజు కడతాను"

'అమ్మ దగ్గర అప్పు తీసుకో నాన్నా. అమ్మ పర్సులో చాలా డబ్బులుంటాయి అన్నది ఏడేళ్ళ జ్యోతి

గురుమూర్తికి నవ్వొచ్చింది అంత విసుగులోనూ

అతను నవ్వలేదు

ఆ గదిలోకి ఎప్పుడొచ్చిందో శారద, వస్తూనే జ్యోతి వీపు మీద ఒక్కటి చరిచి 'దొంగ పక్షీ నా పర్సులో చాలా డబ్బులుంటాయా? ఎప్పుడు చూశావే నువ్వు?" అన్నది కోపంగా

జ్యోతి పెద్దగా ఏడ్చింది మిగిలిన పిల్లలిద్దరూ భయం భయంగా తల్లిని చూశారు

నీకు బుద్ధుందా శారదా అదేం తప్పు మాట్లాడిందని అట్లా కొట్టావు" అన్నాడు గురుమూర్తి

దాని మాటల్లో మీకేం తప్పు కనిపించలేదా?

లేదు అది చెప్పిన మాటలో అబద్ధం యేముంది? నీ దగ్గర డబ్బులు లేవా? నా దగ్గర డబ్బులు లేవని నీకు తెలుసు ఒంట్లో బావుండక నెల రోజులు సెలవు పెట్టాను లీవు శాంక్షన్ అవక నాకు జీతం రాలేదని నీకు తెలీదా? ఈ నెల వీళ్ళ స్కూలు ఫీజు నువ్వు కట్టవచ్చు గదా?' అన్నాడతను కొంచెం సౌమ్యంగా.

ఓహో ఇదా మీ ఎత్తుగడ? మీరేం చేసుకుంటారో నాకు తెలీదు పిల్లల చదువు, ఫీజులు, పుస్తకాలు కొనటం అన్నీ తండ్రి బాధ్యతలు ఏ ఇంట్లోకైనా వెళ్ళి చూడండి మీకే తెలుస్తుంది' మీరేం బాధలు పడతారో నాకు తెలీదు నన్ను మాత్రం ఒక్క పైసా కూడా అడక్కండి' అన్నది నిష్కర్షగా

నిస్సహాయంగా భార్య వైపు, పిల్లల వైపు చూశాడు అతడు

"పోన్లే ఒక పని చెయ్యి అప్పుగా ఐనా డబ్బులివ్వు నాకు జీతం రాగానే నీ డబ్బులు నీకు తిరిగి ఇచ్చేస్తాను' అన్నాడు గురుమూర్తి

"కుదరదు నా దగ్గర ఎక్కువగా లేవు ఈ నెల్లో రికరింగ్ డిపాజిట్టులో ఇంతవరకు డబ్బులు కట్టలేదు నేనివ్వను మీ ఆఫీసులో ఎవర్నయినా అడిగి తీసుకోండి జీతం రాగానే వాళ్ళకే ఇవ్వొచ్చు అని ఆ గదిలో నించి వెళ్ళిపోయింది శారద

పిల్లలు ముగ్గురూ తండ్రి వంక జాలిగా చూశారు ఆ చూపులను తట్టుకోలేక చూపును మరల్చుకున్నాడు గురుమూర్తి

వాళ్ళు మవునంగా ఏదో అర్థమయినట్టుగా అక్కడి నించి వెళ్ళిపోయారు

శారద మీద గురుమూర్తికి బాగా కోపం వచ్చింది అయినా అతడు ఆమెని ఏమీ అనలేక పోయాడు ఏమయినా శారద పట్టుదలకు తిరుగు ఉండదు ఆవిషయం అతడికి బాగా తెలుసు

పెళ్ళయిన ఆరేళ్ళ వరకూ అతడి సంసారం బాగానే సాగింది ఆర్థికంగా చిన్న చిన్న ఇబ్బందులు వచ్చినా ఏదో కొంచెం కష్టమనిపించినా అంతగా బాధపడ లేదు

పెళ్ళవక ముందు చదువుకున్న అమ్మాయినే భార్యగా చేసుకోవాలనుకున్నాడు గురుమూర్తి డిగ్రీ

పాసయిన అమ్మాయి అయితే అవసరమయితే ఉద్యోగం చేయించవచ్చు తనకీ ఆర్థికంగా సహాయపడుతుందని వూహించాడు

నాలుగేళ్ల క్రితం అనుకోకుండా అటువంటి అవకాశం వచ్చింది. అవకాశం రాకపోయినా అందు కోసం ఎదురు చూశాడు అప్పటికి పిల్లలు ఎదిగినకొద్దీ జీతం డబ్బులు సరిగా చాలక ఇబ్బంది పడటం మొదలుపెట్టాడు .

వచ్చిన జీతంలో తల్లిదండ్రులకు కొంత పంపేవాడు చెల్లెలి పెళ్లి కోసం చేసిన అప్పును కూడా వాయిదాల పద్ధతిలో తీరుస్తున్నాడు. అందుకే ప్రతి నెలా ఎంతో కొంత అప్పు చెయ్యక తప్పింది కాదు

అందుకే అతడికి అంతగా ఇష్టం లేకపోయినా భార్య శారద చేత ఏదయినా ఉద్యోగం చేయించాలని అనుకున్నాడు గురుమూర్తి

సరిగ్గా అటువంటి సమయంలో నే ఒక కమర్షియల్ కంపెనీలో క్లర్కు ఉద్యోగం ఒకటి ఖాళీగా వున్నట్టుగా అతనికి తెలిసింది. ఆ ఉద్యోగం శారదకు రావటానికి సిఫార్సు చెయ్యటానికి గురుమూర్తి స్నేహితుడు ఒకాయన అంగీకరించాడు.

శారదతో ఉద్యోగం గురించి చెప్పాడు ఒక రాత్రి. ఆమె ముందు ఒప్పుకోలేదు 'ఉద్యోగం చేస్తూ ఇంటి పనులు కూడా చేసుకోవడం కష్టమేమో" అన్నది.

'ఏమి కష్టం వుండదు శారదా మొదట్లో కొంచెం కష్టంగా వుంటుంది తర్వాత అదే అలవాటవు తుంది ఎంతమంది పెళ్లయిన ఆడవాళ్ళు ఉద్యోగాలు చెయ్యటంలేదు? ఎట్లాగో సర్దుబాటు చేసు కుందాం డబ్బు మనకు ఎంతో అవసరం పిల్లలు ఎదుగుతున్నారు ఖర్చులు కూడా పెరుగు తున్నాయి నువ్వు కూడా ఎంతో కొంత సంపాదిస్తే మనం ఇంకొంచెం మెరుగ్గా సుఖంగా దిగుల్లేకుండా బతకవచ్చు" అన్నాడు గురుమూర్తి

"ఏమో! మీ ఇష్టం" అన్నది శారద ఏమంత ఇష్టం లేనట్టుగా ..

"ప్లీజ్ శారదా . నా కోసం ' అన్నాడు గురుమూర్తి

ఆ తర్వాత నాలుగు రోజులకే శారద ఆ ఉద్యోగంలో చేరింది.

మొదట్లో ఒక వారం రోజులు ఆమెకు కొంచెం కష్టమయ్యింది టైము సరిపోలేదు ఇంట్లో పనంతా చేసి ఆఫీసుకు టైముకు వెళ్లటం కష్టమయ్యింది.

భార్య కష్టాన్ని, ఇబ్బందిని చూసి కొన్ని పనుల్లో అతడూ ఆమెకు సహాయపడటం మొదలుపెట్టాడు.

ఉదయమేఎంతో తొందరగా నిద్ర లేచేది అన్ని పనులూ చేసేది పిల్లలకు క్యారేజి సర్దేది తను కూడా తీసుకుని, భర్తక్కూడా సర్ది ఆఫీసుకు బయల్దేరేది. సాయంత్రం రాగానే మళ్ళీ ఇంటి పనంతా చేసేది.



మొదటి నెల జీతాన్ని భర్త గురుమూర్తికే ఇచ్చింది శారద

"నీ దగ్గరే వుంచుకో శారదా ఇది నీ డబ్బు. నీ కష్టార్జితం" అన్నాడు గురుమూర్తి

"నా డబ్బా ఈ ఇంట్లో నా డబ్బు, మీ డబ్బు అంటూ ఏదీ లేదు. ఇది మన డబ్బు." అన్నది శారద నవ్వుతూ.

నిజమే శారదా. సంసారమనే శకటానికి ఇద్దరం రెండు చక్రాల్లాంటి వాళ్లం. ఈ సంసార చక్రం ఒడుదుడుకులు లేకుండా సాగిపోవడానికి మనిద్దరం శ్రమపడాలి ఈ డబ్బును సంసార ఖర్చులకు ఉపయోగిద్దాం ఎవరికి అవసరమయితే వాళ్ళు వాడుకుందాం' అన్నాడు గురుమూర్తి.

శారద అందుకు ఒప్పుకుంది

కొన్ని రోజులు అలాగే సాగిపోయాయి

ఆ తర్వాతనే శారదలో స్వార్థం. చోటు చేసుకున్నది తన డబ్బు, తన సంపాదన, అనే ఆలోచన ఆమెలో మొదలయ్యింది. అప్పటినించీ, ఇంట్లో ఆమె ప్రవర్తన మారిపోయింది

అప్పటి వరకూ ఆమెలో అణిగివున్న కోరికలు ఒక్కొక్కటి రెక్కలు విప్పుకుని ఆమె హృదయ వీధిలో ఎగరటం మొదలుపెట్టాయి

పెళ్ళవక ముందు కూడా ఆమె ఏమంత గొప్ప ఖరీదయిన చీరలు కట్టుకోలేదు నగలు కూడా పెట్టుకోలేదు ఏమంత ఆస్తి లేని తండ్రికి వున్న ముగ్గురు ఆడపిల్లల్లో చాలా సాధారణమైన జీవితాన్నే శారద వెళ్ళదీసింది

నెలకు ఆరు వందల రూపాయలు కనపడుతున్నప్పుడు ఆమె మనసు అనాలోచితంగానే ఖరీదైన చీరల గురించి. బంగారు నగల గురించి లెక్కలు వెయ్యటం మొదలుపెట్టింది

సరిగ్గా ఆ క్షణం నించే ఆ ఇంట్లో గురుమూర్తికీ, శారదకీ మధ్య అగాథం యేర్పడటం మొదలు పెట్టింది సంసార కష్ట సుఖాల్లో ఇద్దరూ భాగం పంచుకోవాలనే విషయం మరచిపోయి ఎవరి సంపాదనను వాళ్ళు దాచుకోవడం, వాళ్ళ సుఖం కోసం ఖర్చు చేసుకోవటం మొదలుపెట్టారు

శారద పూర్తిగా మారిపోయింది

స్వార్థం ఆమెను నిలువెల్లా ఆక్రమించుకున్నది తన సంపాదనను చూసుకుని గురుమూర్తిని కూడా నిర్లక్ష్యం చెయ్యటం మొదలుపెట్టింది.

వాళ్ళిద్దరి పంతాల మధ్య పిల్లలు నలిగిపోవటం మొదలుపెట్టారు డబ్బు లెక్కలు చూసుకుంటూ వాళ్ళ కనీస కోర్కెలు కూడా తీర్చడం మరచిపోయారు వాళ్ళిద్దరు

ఒకసారి పిల్లలు ముగ్గురూ ఏదో సినిమాకు తీసుకెళ్ళమని అడిగారు తల్లిని

"మీ నాన్నని అడగండి" అన్నది శారద.

"సినిమాకు కూడా నన్నడగటం ఎందుకు? నువ్వు కూడా వస్తానంటే వెళదాం' అన్నాడు గురుమూర్తి

'పదండి అయితే బయల్దేరుదాం" అన్నది ఆమె

"కానీ ఒక్క షరతు నా దగ్గర డబ్బులు తక్కువగా వున్నాయి టిక్కెట్లు నీ డబ్బుతోనే తీసుకోవాలి" అన్నాడు అతను

"ఐతే నేను రాను నేనెందుకు టిక్కెట్లు తీసుకోవాలి? ఉద్యోగం చేస్తున్నారు పెళ్లాన్ని, ముగ్గురు పిల్లల్ని సినిమాకు తీసుకెళ్ళలేరా?" అన్నది శారద అతడికేసి నిర్లక్ష్యంగా చూస్తూ

'తీసుకెళతాను. కాని నా దగ్గర డబ్బులు ఎక్కువ లేవు. ఈ ఒక్కసారికి నువ్వు నీ డబ్బులతో సరదాగా మా అందర్నీ ఎందుకు తీసుకెళ్ళకూడదు? నువ్వూ ఉద్యోగం చేసి సంపాదిస్తున్నావు కదా? నీకంత పంతం ఎందుకు?" అనడిగాడు అతడు

"మీతో వాదన అనవసరం. నా డబ్బుతో నేను ఎవర్నీ సినిమాకు తీసుకెళ్లను ఆ తర్వాత మీ ఇష్టం" అని అక్కడి నించి వెళ్ళిపోయింది ఆమె

"విన్నారుగా. మీ అమ్మ ఒప్పుకోవటం లేదు ఇంట్లో ఏడవండి" అని బయటకు వెళ్ళిపోయాడు గురుమూర్తి

బిక్క మొహాలు వేసుకుని అక్కడే కూలబడి పోయారు ఆ ముగ్గురు పిల్లలూ

ఆతర్వాత కొన్ని రోజులకు సినిమా టిక్కెట్ల ఖర్చును సమానంగా భరించే షరతు మీద గురుమూర్తి, శారద పిల్లల్ని సినిమాకు తీసుకు వెళ్లారు

ఇంటర్వెల్‌లో పిల్లలు బిస్కెట్లు కొనమని తండ్రిని అడిగారు అతను తలవూపి థియేటరులోకి వచ్చిన కుర్రాడిని పిల్చి బిస్కెట్లు కొన్నాడు

'ఏమండోయ్. డబ్బులు మీరే ఇవ్వాలి తర్వాత నన్నివ్వమంటే కుదరదు" అన్నది శారద అతను బిస్కెట్లు అమ్మే కుర్రాడిని పిలుస్తున్నప్పుడు

అక్కడ కూర్చున్న వాళ్ళంతా పెద్దగానే నవ్వేశారు ఆమె మాటలు విని

గురుమూర్తి సిగ్గుతో తల వంచుకున్నాడు

ఇంట్లో డబ్బు గురించిన గొడవలు పెరిగిపోయిన తర్వాత గురుమూర్తి భార్యని ఉద్యోగం మానెయ్యమన్నాడు.

కాని ఆమె ఒప్పుకోలేదు డబ్బు రుచిని తెలుసుకున్న ఆమె అందుకు ఎంతమాత్రం అంగీకరించలేదు.

'మానేస్తాను బాగానే ఉంది ఆ తర్వాత నా కోరికల్ని తీర్చగలరా? పట్టు చీరలు కొని పెట్టగలరా? చేతికి బంగారు గాజులు చేయించ









బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

# పేద వారికి ఉచిత న్యాయ సహాయం

అరుణాచల్ ప్రదేశ్‌లో ఒక అసిస్టెంట్ ఇంజనీర్‌ను ట్రాన్స్‌ఫర్ విషయంలో సుక్‌దాస్. మరో ఐదుగురు కలిసి బెదిరించారు పోలీసులు భారత శిక్షా స్మృతిలోని 506 సెక్షన్ ప్రకారం కేసు పెట్టారు సుక్‌దాస్ పేదవాడు కనుక లాయర్‌ను పెట్టుకోలేదు ఫలితంగా సుక్‌దాస్‌కు రెండు సంవత్సరాల కారాగార శిక్ష పడింది మరో నలుగురుసు నిర్దోషులుగా కోర్టు విడిచిపెట్టి వేశారు. సుక్‌దాస్ హైకోర్టుకు అప్పీలు చేసుకున్నాడు. తనకు ఉచిత న్యాయ సహాయం ప్రభుత్వం కలిగించలేదు కనుక తనకు శిక్ష పడింది అని సుక్‌దాస్ వాదన కానీ గౌహతి హైకోర్టు ఈ వాదనను తిరస్కరించారు ఉచిత న్యాయ సహాయం కోసం సుక్‌దాస్ కోర్టు వారికి పిటిషన్ పెట్టుకోలేదు కనుక అతనికి ఉచిత న్యాయ సహాయం కలిగించ లేదని హైకోర్టు వారు అప్పీలును త్రోసిపుచ్చారు దానిపై సుక్‌దాస్ సుప్రీమ్ కోర్టుకు అప్పీలు చేసుకున్నాడు సుప్రీమ్ కోర్టు తమ తీర్పులో ఉచిత న్యాయ సహాయం పొందడం ప్రాథమిక హక్కు అని పేర్కొంటూ పేదవారు ఉచిత న్యాయ సహాయం కోసం పిటిషన్ పెట్టుకోవాలని అనడం అర్థం లేనిదని తీర్పు చెప్పారు. నూటికి డెబ్బై మంది గ్రామాలలో నివసిస్తున్న నిరక్షరాస్యులు ఉన్నారు వారికి హక్కుల గురించి తెలియదు పైగా పేదవారు కూడా కనుక వారిని ఉచిత న్యాయ సహాయం కోసం పిటిషన్ పెట్టుకో మనడంలో న్యాయం లేదు అందుచేత ఎవరికైనా ముద్దాయికి కారాగార శిక్ష తప్పదని తోచినచో ఆ ముద్దాయి పేద వాడయితే మేజిస్ట్రేటు అతనికి ఉచిత న్యాయ సహాయం కావాలా అని అడగాలి ఈ ఆర్డర్లు ఇంతకు పూర్వం సుప్రీమ్ కోర్టు వారు జారీ చేశారు సుక్‌దాస్‌కు ఉచిత న్యాయ సహాయం ప్రభుత్వం కల్పించినందు వలన కారాగార శిక్ష పడింది. ఈ సెక్షన్ రద్దు చేస్తూ 1986లో సుప్రీమ్ కోర్టు వారు తీర్పు చెప్పారు □

---

గలరా? ఈ కోరికల గురించి మిమ్మల్ని వేధిస్తే నా కోరికలను తీర్చటం మీకు సాధ్యమవుతుందా? సాధ్యమవుతుందంటే చెప్పండి. నేను ఉద్యోగం మానేస్తాను" అన్నది ఆవేశంగా

గురుమూర్తి ఏమీ మాట్లాడలేక పోయాడు

నిజమే, ఆమె కోరికలను తీర్చటం తనకు సాధ్యం కాదు ఆమె పంతానికయినా ఉద్యోగం మానేసి తనని వెంటాడుతుంది ఉద్యోగాన్ని బలవంతంగా మానేట్టు చేస్తే ఏం జరుగుతుందో గురుమూర్తి సులభంగానే గ్రహించాడు

అందుకే అతడు ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు

దాని ఫలితంగా గురుమూర్తి కూడా తన స్వార్థం తను చూసుకోవడం మొదలుపెట్టాడు. ఖరీదైన బట్టలు కుట్టించుకోవడం, దుబారాగా ఖర్చు చేయటం అలవాటు చేసుకున్నాడు

ఆ ఇద్దరు మనుషులూ తమ సుఖాలను తాము చూసుకున్నారు గానీ, పిల్లల కష్టసుఖాల గురించి పూర్తిగా మరచిపోయారు. వాళ్ళకు జరుగుతున్న అన్యాయాన్ని వాళ్ళు అంతగా పట్టించుకోలేదు

శారద తన సంపాదనలో చేతులకు రెండు జతల బంగారు గాజులు చేయించుకొన్నది ఆరు ఖరీదైన పట్టు చీరలు కొనుక్కున్నది రెండు వేల రూపాయలు బ్యాంకులో దాచుకున్నది. నెలకు వంద రూపాయలు రికరింగ్ డిపాజిట్టు కడుతోంది

గురుమూర్తి కూడా దుబారా ఖర్చు కారణంగా చాలా చోట్ల అప్పులు చెయ్యటం మొదలు పెట్టాడు. భార్య ఉద్యోగం చేస్తే కుటుంబానికి సహాయపడుతుందనీ, తనకు బాసటగా ఉంటుందనీ, అనుకున్నాడు. ఎంతో ఆశపడ్డాడు

కాని అతని ఆశ ఆశగానే మిగిలిపోయింది

అతని కలలు చెదిరిపోయాయి.

భార్య తనని లెక్క చేయక పోవటంతో ఏదో అశాంతి అతన్లో పెరిగిపోయింది ఆ అశాంతిలో పిల్లల తండ్రిగా తను చూపించవలసిన అనురాగం గురించి మరచిపోయాడు

ప్రతి చిన్న విషయానికీ భార్యా భర్తలిద్దరూ వాదించుకోవడం, గొడవపడటం మొదలయ్యింది.

ప్రసన్నంగా, నవ్వుతూ వుండే భర్త తనని డబ్బులు అడుగుతాడని పిల్లల మీద విరుచుకు పడుతూ వీలైనంత సీరియస్‌గా వుండడం అలవాటు చేసుకుంది శారద

తల్లి, తండ్రి ప్రవర్తనతో ఆ పసి హృదయాల్లో ఏదో వెలితి యేర్పడింది

ఒకసారి పండక్కి పిల్లలు కొత్త బట్టలు కుట్టించమని అడిగారు శారద భర్తను కుట్టించమన్నది గురుమూర్తి భార్యను కొనమన్నాడు బట్టల్ని చివరకి ఆ ఇద్దరు ఉద్యోగస్తులూ పంతానికి పోయి పండక్కి పిల్లలకు బట్టలు కుట్టించలేదు. పండగ రోజు ఆ వీధిలోని పిల్లలు కొత్త బట్టలు వేసుకుంటే ఆ ముగ్గురు పిల్లలూ చిన్నబోయిన మొహాలతో వాళ్ళను చూస్తుండిపోయారు దిగులుగా.

★ ★ ★ ★ ★

ఆదివారం-

శారద, గురుమూర్తి ఇంట్లోనే వుండి ఏదో డబ్బు లెక్కల గురించి వాదించుకుంటున్నారు.

సరిగ్గా అప్పుడే ముగ్గురు పిల్లలూ బజార్లో నించి 'పరుగెత్తుకుంటూ లోపలకు వచ్చారు.

"అమ్మా. ఐస్‌క్రీం బండి వచ్చిందే... కొని పెట్టవూ" అనడిగాడు గోపి ..

"మీ నాన్నను అడగండి" అన్నది శారద మామూలుగానే

"నువ్వు కొనిపెట్టు నాన్నా' అన్నది జ్యోతి

"మీ అమ్మను అడగండి, కొంటుందిలే అన్నాడు గురుమూర్తి

చిన్నవాడు కృష్ణ యేడవటం మొదలుపెట్టాడు

"చంపేస్తాను వెధవల్లారా? బయటకు వెళ్ళండి జగల్లాగా నన్ను పట్టి పీడిస్తున్నారు అన్నది శారద విసురుగా

వాళ్ళు భయంతో అక్కడి నించి వెళ్ళిపోయారు.

ఐదు నిముషాల్లోనే ఆ ముగ్గురూ ఐస్‌క్రీమ్ తింటూ లోపలకు వచ్చారు.

"ఎక్కడివీ ఐస్‌క్రీంలు? నా జేబులో నించి డబ్బులు తీశారా?' అనడిగాడు గురుమూర్తి అనుమానంగా...

"చెప్పండిరా వెధవల్లారా. ఎక్కడివి మీకీ ఐస్‌క్రీంలు?నా పర్సులో కాజేసి పోయారా?" అనడిగింది శారద అనుమానంగానే

వాళ్ళు మాట్లాడలేదు.

ఐస్‌క్రీం తినడంలో మునిగిపోయారు

"చెప్పరేం? చంపేస్తాను నిజం చెప్పండి ' అన్నది శారద హూంకరిస్తూ ..

"పక్క గదిలో వున్న అంకుల్ కొని పెట్టాడు" అన్నది జ్యోతి మెరిసే కళ్ళతో...

శారద- గురుమూర్తి ఉలిక్కిపడ్డారు ఆ జవాబుతో...

పక్కనే ఉన్న చీకటి గదిలో ఒక నిరుద్యోగి వుంటున్నాడు. ఎప్పుడయినా పని దొరికినప్పుడు అయిదో, పదో సంపాదిస్తాడు లేనప్పుడు ఆకలి కడుపుకు నీళ్ళు పట్టించి నిద్రపోతాడు

ఆ నిరుద్యోగి ఆ పిల్లల గురించి జాలిపడ్డాడు.

కాని ఆ ఉద్యోగులిద్దరూ ఆ పిల్లల గురించి ఏం చేశారు?? □

# మన సంస్కారాలు ॐ విశేషాలు

ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి

## వైదిక సంస్కృతిలో స్త్రీ యొక్క స్థానం

(గతసంచిక తరువాయి)

నూతన వధువు యొక్క పాణిగ్రహణం చేసే సందర్భంలో వరుడు పఠించే మంత్రంలోని భావం ఇలా ఉంది

ఓ కళ్యాణీ! ఉత్తమమైన సంతాన ప్రాప్తి కోసమే నీ హస్తమును నేను గ్రహిస్తున్నాను భగుడు, అర్యముముడు, సవిత మున్నగు దేవతలు నిన్ను నాకు అనుగ్రహించారు ఎందుకు అనుగ్రహించారంటే, ముఖ్యంగా గృహస్థాశ్రమ దర్మాలను సక్రమంగా ఆచరించడం కోసమే ఈ భావం కల మంత్రం ఇది

గృహ్ణామితే సుప్రజాస్త్వాయ హస్తం
భగో అర్య మాసవితాపురం దిర్మహ్యంత్వా అదుః
గార్హపత్యాయ దేవాః

(పాణిగ్రహణ సంస్కారంలోని మంత్ర భాగం)

ఈ మంత్రంలోని సుప్రజాస్త్వాయ అనే పదానికి దేవ పితృ కర్మలు ఆచరించడానికి అర్హత గల సంతానం అని అర్థం శాస్త్రీయమయిన వివాహ సంస్కారంతో సంస్కరిచబడిన దంపతులకే ఇట్టి ఉత్తమ సంతానం కలుగుతుంది ఇట్టి సంస్కారం లేని దంపతులకు దుష్ట భావ దూషితమైన దుర్మార్గులు పుడతారని యాజ్ఞవల్క్య స్మృతి వాక్యాలు చాటుతున్నాయి

ఇతరేష్వేవశిష్టేషు నృశం సానృత వాదినః
జాయంతే దుర్వి వాహేషు బ్రహ్మకర్మ ద్విషస్సుతాః

– యాజ్ఞవల్క్య స్మృతి

ఇట్టి దుష్ట సంతానం ప్రబలిన నాడు ఇట్టి వారితో కూడిన సమాజం దేశం కూడా చెడి దెబ్బతింటాయి

దీనిని బట్టి తేలిన సారాంశం – హిందూ వివాహ సంస్కార పూర్వకంగా పతి పత్నీత్వ యోగ్యత నందిన దంపతులకు మాత్రమే ఉత్తమ సంతాన ప్రాప్తి గృహస్థాశ్రమ ధర్మ నిర్వహణ లాభం అనే రెండు మహిత ప్రయోజనాలు సిద్ధించాయి ఈ రెండూ భావిలో వరుని యొక్క మోక్ష ప్రాప్తికి ముఖ్య సాధనాలవుతాయి ఈ పాణిగ్రహణం మంత్రంలోని పరమార్థం ఈ మనుస్మృతి వాక్యాలలో ఇలా ప్రకాశితమయింది –

'అపత్యం, ధర్మ కార్యాణి, శుశ్రూషా, రతిరుత్తమా
దారాధీనస్తథా స్వర్గః పితృణా మాత్మ నశ్చహ
"ప్రజనార్థం మహా భాగా పూజా ర్హా గృహదీప్తః
స్త్రియశ్శ్రియశ్చగేహేషు నవిశేషో స్తి కశ్చన'

అనగా ఉత్తమ సంతానం, అగ్నిహోత్రం, పతి సేవ, కామ వాంఛా తృప్తి, తనకు తన పితృ దేవతలకు స్వర్గ ప్రాప్తి అనే ఇవన్నీ భార్య అధీనములో ఉన్నాయి అంటే ఈ మహా ప్రయోజనాలన్నీ భర్తకు భార్య వలననే సిద్ధింపవలసి ఉన్నాయి

ఇట్లు సత్సంతానాదుల ద్వారా పతికి మహోపకారం చేస్తున్న మహిళామ తల్లులు పతి గృహాలకు దీపాల వంటివారు ఇంటికి దీపం ఇల్లాలు' కదా కనుక స్త్రీలకు శ్రీలకు (మహా లక్ష్మలకు) బేదంలేదు కనుకనే మహాలక్ష్మల వలె వారును పూజార్హులు'

ఇట్టి స్త్రీలు ఆదర గౌరవాలతో సంతోషిత స్వాంతలై ఏ గృహంలో పూజింపబడుదురో ఆ గృహంలో దేవతలు సంతోషిస్తూ ఉంటారనీ, ఏ గృహంలో స్త్రీలు పూజింపబడరో అట్టి గృహంలోని వారు చేసిన పుణ్యకార్యాలు నిష్ఫలమవుతాయనీ ఒక సూక్తి ఇలా సుస్పష్టం చేస్తుంది

యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః
యత్ర నార్యస్తు పూజ్యంతే సర్వాస్తత్రా ఫలాః క్రియాః

ఇట్లు హైందవ సంస్కృతికి శిరోభూషణమయిన,- హైందవ ధర్మ క్రియా చరణమునకు మూలమైన,- హైందవ జాతి కీర్తి ప్రతిష్ఠలకు ఆధారమైన వివాహ సంస్కార సంస్కృతమైన) మహిళామతల్లులకు వివాహ మంత్రాలు ప్రసాదించిన ప్రత్యేక స్థానాన్ని ఇక ఇట చూపుతాను తన పత్నిని తన గృహానికి తీసుకొని వెడుతున్నప్పుడు పతి పఠించే మంత్రంలోని భావమిది ఇవి పతి యొక్క మాటలు

నా గృహస్థ జీవితానికి ప్రకాశ ప్రతిష్ఠలను కలిగించే ఓ కళ్యాణీ! ఇటు పైని సర్వ విషయాలలో ప్రత్యేక బాధ్యతలను వహించిన నీవు అన్ని పనులలో నాకు చక్కని సలహాలిస్తూ నాకు శిరోభూషణంగా- చక్రవర్తినిగా ప్రవర్తించాలి ఇట్లే అత్తమామలు ఆడబడచులు మరదులు, బావగార్లు తోడి కోడళ్లు వగైరా నా కుటుంబ సభ్యులందరి క్షేమాలను కోరి, వారికి సర్వ విధ శ్రేయస్సులు సంపాదించుటలో నీవు ఆధిపత్యం వహించి, మాకందరికి చక్రవర్తినిగా' (సమ్రాజ్ఞివిగా) ఉండుము మొత్తం మీద నా కుటుంబము యొక్క కీర్తి ప్రతిష్ఠా శ్రేయస్సులు నీ చేతిలోనే ఉన్నాయి కనుక ఇటుపై నుంచి నీవు నా నీడవలె సర్వకాల సర్వావస్థలలో నన్ను అనుసరించవలసి ఉంది కనుక ఉత్తమ సంతానం కని నీవు నాకు 'నెత్తి మీద దేవతవు కావలెను

సమ్రాజ్ఞీశ్వశురే భవ సమ్రాజ్ఞీశ్వశ్రవాం భవ
ననాం
దరి సమ్రాజ్ఞీభవ సమ్రాజ్ఞీ అధిదేవృషు
స్నుషాణాం శ్వశురాణాం ప్రజా యాశ్చ ధనస్యచ
సజాతానాం విరాడ్భవ)

ఇట్లు మన సమాజ శ్రేయస్సు అంతా ఉత్తమ గృహిణిపై ఆధారపడి ఉన్న సంగతి ఈ చెప్పిన నిదర్శనాలతో ఋజువు చేయబడింది కనుక పురుషుని గృహస్థాశ్రమ జీవితానికి చెందిన అన్ని విషయాలలో 'గృహిణి" ముందు, తరువాత 'గృహస్థుడు' అని చెప్పవలసి ఉంది ఈ సత్యాన్ని ఈ క్రింది మనుస్మృతి వచనం ఇలా ధృవపరుస్తుంది –

" అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే
చైవనియోజయేత్

పురుషుడు, తాను సంపాదించి తీసికొని వచ్చిన సొమ్మును భద్రపరచడం విషయంలోను, దానిని అవసరం వెంబడిని ఖర్చు పెట్టడం విషయంలోను కూడా భర్త తన గృహలక్ష్మినే నియోగించవలెను

నిజ స్థితి ఇట్లుంగా, 'స్త్రీకి స్వాతంత్ర్యం ఇవ్వలేదు' అనే కొందరి మాటలలో అర్థం ఏమిటో ?

ఇట్లు మన ఆర్య మహర్షులు సమాజ శ్రేయస్సంపాదనమును పరమ ధ్యేయంగా దృష్టిలో పెట్టుకొని చెప్పిన దర్మాలు చేసిన నిబంధనలు సర్వవిధ సమాజ శ్రేయస్సంపాద నకే అంకితమై ఉన్నాయి కనుక ఆ ధర్మాలన్నీ యుగయుగాల వరకూ కూడా మానవ సమాజానికి శ్రీరామరక్ష గా సహకరిస్తూనే ఉంటాయని చెప్పవలసి ఉంది

ఇన్ని విధాలుగా సమాజ కళ్యాణానికి సహకరిస్తున్న స్త్రీరత్నాన్ని పతి ఎంతగా కాపాడవలెనో, ఎంతటి ఆదర గౌరవాలతో, ఎంతటి పవిత్ర భావనతో ఉపయోగించుకొనవలెనో, ఎంతటి పూజ్య భావన చూపవలెనో తప్పక గమనించవలసి ఉంది

(ఇంకా ఉంది)






ప్రతి జీవితంలో పెళ్ళి ఒక అతి ముఖ్యఘట్టం. ఎక్కడెక్కడో పుట్టి ఎక్కడో పెరిగి, మూడుముళ్ళ బంధంతో రెండు జీవితాలను ఒకటిగ ముడి వేసే "పెళ్ళి", కొందరి బ్రతుకుల్లో మల్లెలు కురిపిస్తే, మరి కొందరికి




ముళ్ళను పరుస్తుంది.

ఒకరిపట్ల మరొకరికి సదవగాహన, ఒకర్నొకరు మన్నించి, మసలు కోవటం వల్ల దాంపత్యం స్వర్గధామం అవుతుంది. తన మనసుకు నచ్చేవిధంగా వున్న మనిషంటే ఎవరికి మాత్రం ఇష్టం వుండదో చెప్పండి. ఒకరి భావాలకు అనుగుణంగా మరొకరు నడుచుకోవాలి. తనకు నచ్చనివి అయినా, తన జీవిత భాగస్వామి కోసం ఆచరించటంలో వున్న ఆనందం అందరికీ అర్థం కాదు. అక్కడే చాల పెళ్ళిళ్ళు ఫెయిలయిపోతున్నాయి. చీటికి మాటికి చిన్న చిన్న విషయాలకు దెబ్బలాడుకోవటం, అవన్నీ చిలికి చిలికి గాలివానలా తయారై, ఫలితంగా ఇద్దరికీ మనశ్శాంతి కరువై ఇంటి నొక నరకంగా మార్చు కొంటారు. అదే స్వయంకృతం. తన మాటను గౌరవించి, తనను ప్రేమించే ఇల్లాల్ని ఏమగాడు గౌరవించకుండా వుండ గలడు? మగవాని జీవితంలో వెలుగులు నింపినా. చీకటి చిందించినా- ఆడదే కదండీ?

చాలమంది ఆడవాళ్ళు, భర్తను చులకనగా మాట్లాడటం, సూటీ పోటీ మాటలతో చిన్న బుచ్చటం లాటివి చేస్తుంటారు. దానివల్ల వాళ్ళు పొందేదేమీ లేకున్నా, పోగొట్టుకొనేదే ఎక్కువ. ఫలితంగా భర్త ప్రేమకు దూరమవటం, తరచూ పోట్లాటలు. సహజంగా చాల మంది ఆడవాళ్ళు తమ భర్త తెచ్చిన చీరలో, నగలో ప్రక్క వారికి చూపించుకోవటం అలవాటు. చూచిన ఆవిడ 'బాగుందండీ' – అని ఒక్క మాట అంటే సరిపోతుంది. కానీ, ఆవిడ "నాఖర్మ! నామొహాన అంత అదృష్టం కూడానా? ప్రారబ్ధ ఖర్మాన ఆయనకు పెళ్ళాన్ని అయ్యాను. దేని కైనా పెట్టి పుట్టాలి' అంటూ తనలో దాగివున్న అసూయనంతా బయటకు కక్కేస్తుంది. అది విన్న మగవాడు అవమానంతో క్రుంగి పోతాడు. ఫలితంగా భార్య పట్ల ప్రేమకు బదులు అసహ్యం మొదలవుతుంది. కాపురంలో కలతలు ప్రారంభమవుతాయి. అధికారంతో, అహంకారంతో సాధించలేనివి ఎన్నో అనురాగంతో సాధించుకోవచ్చు. ఆడ దానిలో ఓర్పు నేర్పు చాల అవసరం. భర్త మనసెరిగి మసలే భార్యకు ఇంటిని మించిన స్వర్గం ఎక్కడుంది? కొంత మంది భార్యలు, అలసి ఇంటికి వచ్చిన భర్తకు, వచ్చీరాగానే ఇంట్లో సమస్యలు ఏకరువు పెట్టి మనసును చికాకు పరుస్తారు. అలాటప్పుడు ఆ మానవుడు ఇంటికి రావట మంటేనే హడలెత్తి, బయట ప్రపంచపు ఆకర్షణకు లోనవుతాడు.

## భర్తలను హింసించే భార్యలు

సిగరెట్లు, పేకాటలు, త్రాగుడు లాటి వ్యసనాలకు సులభంగా బానిసలవుతారు. అలాటి వారి జీవితాలను పరిశీలిస్తే – వాళ్ళందరికీ చాల వరకు గృహపరమైన సమస్యలే కారణాలు. ఆడవాళ్ళ ఆరళ్ళవారినలా మారుస్తాయి.

సమాజంలో అత్తా ఆడపడచుల ఆరడే అంతా చెప్పుకొంటారు. కానీ, భార్య పెట్టే ఆరడి, మాటల ఈటెలతో చిత్ర హింస, ఏ మగాడు బయటకు చెప్పుకోలేడు. బోలెడు నిరాశకు లోనవుతాడు. భర్తకు ఇష్టం లేని పని కావాలని చేసే ఆడవాళ్ళను ఏమనాలి? ఉదాహరణకు, భార్య పుట్టింటికి వెళ్తానంటుంది 'ఇప్పుడువద్దు ఇంకో మారు వెళుదువు గానీ'- అంటూ భర్త చెప్పాడు ఆమెతనని, తన మాటను గౌరవించి మానుకొంటే అతనే ఆమెను వద్దని అన్నందుకు బాధ పడ్తాడు- ఆమె కోర్కె కాదన్నందుకు చిన్న బుచ్చు కొందేమోనని పశ్చాత్తాపపడ్తాడు.

అలా కాకుండా, వద్దనగానే, "మీరెవరు నాకు చెప్పటానికి, నా యిష్టం. నేను వెళ్ళి తీరుతాను. ఏం చేసుకొంటారో మీ ఇష్టం"– అంటూ మొండిగా బయల్దేరే భార్యంటే ఏమగాడికి ప్రేమ కలుగుతుంది చెప్పండి. మగవాడు పెళ్ళి అయిన నాటి నుండి, తన జీవితాన్ని సంపాదనను పూర్తిగ కుటుంబం కోసమే ధారపోస్తాడు.

అలాటి మగవానిని లాలించి ప్రేమించటం కూడ చేతగాని ఇల్లాలికి భర్తను హింసించే అధికారం ఎక్కడిది?

ఒకరి నొకరు నొప్పించే మాటలతో, భావి జీవితమంతా, బాధల మయం చేసుకోకండి మరుని తూపు లాంటి మంచి మాటలతో మగని మనసు గెలుచుకోవచ్చు. ప్రయత్నించి చూడండి మరి.

–ఆదిరాజు రత్నకుమారి,
గుంటూరు □

కూపన్
ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# ఈ కాలం పెళ్ళిళ్ళు

పంపిన వారి పేరు.....................................

పూర్తి చిరునామా.....................................

.....................................

.....................................

పిన్ కోడ్:......................

## గాలిలో లేచిన శవం!

తమిళనాడుకు చెందిన కోయంబత్తూరుకు 15 కిలో మీటర్ల దూరంలో వున్న తన్నీర్‌పందల్ అనే గ్రామంలో దీపావళి టపాసులు చేస్తుండగా జరిగిన ప్రేలుడు ప్రమాదంలో ఆర్నెల్ల పసి పిల్లాడు, అతని తల్లితో సహా ఆరుగురు చనిపోయారట. ఒక వ్యక్తి శవం గాలిలో లేచి యాభై అడుగుల ఎత్తుకు విసిరేసినట్టెల్లి పడ్డదట.

## హత్యలకు దారితీసిన తగాదా!

కడపకు చెందిన వో పశువుల డాక్టర్ శోభన్‌బాబు భార్య ఉష భర్తతో తగువాడి, పుట్టింటికెళ్ళిహ ఎన్నిసార్లు ఖబురెట్టినా రాను ఫొమ్మన్నదట. దాంతో అతడు కస్తూరి అనే ఆమెతో పరిచయం పెట్టుకుని, దాన్ని ప్రేమగా మార్చి ఆనక పెళ్లి వరకూ తీసుకెళ్లాడట. ఆ కస్తూరి శ్రీశైలం ప్రాజెక్టులో జూనియర్ అసిస్టెంట్‌గా పనిచేస్తోందట ఆమెను ఆ శోబన్‌బాబు హైద్రాబాద్ తీసుకొని వెళ్లి పెళ్లి చేసుకుని, ఆనక ఆమెను తీసుకుని ఉష అక్క ఇంటికి వెళ్లి తన జీవితం ఉషతో నాశనమవడానికి మీరే 'కారకులు అంటూ ఉష బావగార్ని, కూతుర్ని, భార్యను పొడిచాడట కస్తూరి కత్తితో కసక్కున ఉష అక్క జయశ్రీని పొడిచేసిందట ఆ ముగ్గురిలో జయశ్రీ మాత్రం చావు తప్పి బ్రతుకు వైపు కోలుకుంటోందట

## ఒకే టీములో తండ్రీకొడుకులు!

1931లో నాటింగ్హామ్‌షైర్- వారిక్‌షైర్‌ల మధ్య జరిగిన క్రికెట్ పోటీలో జార్జ్ గన్ అనే ఆయన, ఆయన కొడుకు జూనియర్ జార్జ్‌గన్ ఒకే టీములో ఆడి, ఇద్దరూ చెరో సెంచరీని ఒకే ఇన్నింగ్స్‌లో కొట్టారట తండ్రీకొడుకులు ఆడటం, అలా ఆడడం ప్రపంచ చరిత్రలోనే అదే మొదటిసారి, ఆఖరు సారీ కూడా అదేనట.

## ధూమపాన ప్రియులకు క్యాన్సర్ వ్యాధి!

పొగ త్రాగడం వలన క్యాన్సరు నిస్సందేహంగా వస్తుందని విజ్ఞానజ్ఞాన సర్వస్వమూ ఏకగ్రీవంగా,



బృందగానంగా హెచ్చరికలు చేస్తూనే వున్నా సిగరెట్టు రసికులు పరమ నిర్భయంగా వుంటున్నారట ఒక్క యునైటెడ్ స్టేట్స్‌లోనే ఏటికి లక్షా యిరవై వేల మంది ధూమపానులు యీ క్యాన్సరు తెచ్చుకుని దేశానికి 10 బిలియను డాలర్స్




ఆదాయాన్ని నష్టపరుస్తున్నట్టున్నారని దేశం ప్రకటించిందట

## ఆహారం లేక బాలల మరణాలు!

ప్రపంచంలో అభివృద్ధి పొందుతున్న దేశాలు అని చెప్పబడే దేశాలలో సరియైన ఆహారం లేక, రోగాలతోనూ సంవత్సరానికి సుమారు 40 వేల మంది పిల్లలు చనిపోతున్నారని యునైటెడ్ నేషన్స్ అంతర్జాతీయ పిల్లల ఎమర్జన్సీ ఫండ్ తన నివేదికలో నివేదించిందట – అహో!

## ఢిల్లీలో పెరుగుతున్న జనాభా!

ప్రస్తుతం ఢిల్లీలో 70 లక్షల మంది జనులున్నారనీ, వీరే గాక ఢిల్లీ నగరంలో 8,15,000 వాహనాలు తిరుగాడుతున్నాయనీ. తత్ఫలితంగా ప్రతి 500 వాహనాలకూ వో వ్యక్తి ప్రమాదంలో మరణిస్తున్నాడని ఢిల్లీ నగర పోలీసులు నికరంగా లెక్కలు కట్టి చెప్పారట. ఈ జనాభా యింకా 13 సంవత్సరాలలో 120 లక్షలుగా మారే ప్రమాదముందని కూడా వారన్నారట.

## ఆవేశంలో ఆలిని హత్య!

తిరుపూరుకు చెందిన 22 ఏళ్ళ బేబీ తన భర్త 25 ఏళ్ళ సుబ్రహ్మణ్యం ఏ పనీ చేయకుండా ఇరవై నాలుగ్గంటలూ తననే వేధించుకు తినడంతో ఆమె విసిగి, పుట్టింటికి వెళ్ళిపోయిందట అతను ఆమె అక్క సహాయంతో బేబీని సమాధాన పరచి, అక్కగారింట్లోనే యిద్దరూ వుండి, వో బనీను ఫ్యాక్టరీలో పనికి చేరారట వో పది రోజులు గడిచాక, మన వూరుకు పోదాం పద అంటే ఆ బేబీ "ముడియాదు" అని తమిళంలో తన అసమ్మతి తెలిపిందట దాంతో ఆవేశం వచ్చి అతను వో బుల్లికత్తితో ఆమెను కసకస పొడిచి చంపి, పారిపోయాడట.

## త్రాగుబోతుల మూర్ఖత్వానికి 60 ఏళ్ల వృద్ధుడు బలి!

మద్రాసు వాల్టాక్స్ రోడ్‌లో వో లారీ బ్రోకర్ ఆఫీసు నడుపుతూంటే 24 ఏళ్ళ రాధాకృష్ణన్, అతని తమ్ముడు 22 ఏళ్ళ రాజేంద్రన్ రాత్రి పూటుగా తాగేసి, లారీలో యింటికి వెళ్లాలంటే డ్రయివింగుకు వొళ్ళు వొప్పక వో రిక్షా వాణ్ణి పిలిస్తే వీళ్ళ వాలకం చూసి అతగాడు రాను పొమ్మన్నాడట దాంతో ఆగ్రహం చెందిన ఆ సహోదరులు మేం లారీ తోలుకుంటూనే వెళ్ళగలం అని అంత పనీ చైబోయి, రోడ్డున పోతున్న 60 ఏళ్ళ దేవరాజ్ అనే ఆయన్ని ఆ లారీ పొట్టన పెట్టి, మరో ముగ్గుర్ని తీవ్రంగా గాయపరచి, తూలి, వాలిపోయారట వీరిని పోలీసు అరెస్టు చేసిందిట.

## భర్త అనుమానం- భార్య బలి!

తంజావూరు జిల్లా ఇళుప్పయ్ తోపు అనే గ్రామానికి చెందిన 40 ఏళ్ళ మారి ముత్తు అనే ఓ స్కూలు టీచరుకు తన భార్య 30 ఏళ్ళ తమిళ్ రాణి మీద సందేహం ఏర్పడిందట. వారి పెళ్ళయి, పదేళ్ళవడమే గాక 9 ఏళ్ళ కూతురు కూడా వున్నదట అనుమానం పెనుభూతమవడంతో ఆ వూరి ముత్తు రోజూ ఆమెను వేధించి, చావకొట్టడంతో సంతృప్తి చెందక ఆమె మీద కిరసనాయిలు పోసి నిప్పంటించి పారిపోయాడట ఆమె ఆర్తనాదాలు చేస్తూ కాలి చనిపోయిందట.

## గోడవున్లలో మగ్గుతున్న హిందీ పుస్తకాలు!

హిందీ ప్రచార విభాగంగా భారత ప్రభుత్వం అచ్చు వేసిన హిందీ పుస్తకాలు ప్రభుత్వపు గోడవున్లనో అమ్మగా మిగిలినవి రెండేళ్ళ నుంచీ మగ్గుతున్నాయట ఈ పుస్తకాల విలువ అరున్నర కోట్లట – హా! ☐







# పాఠకులకు శుభవార్త!

ప్రతి ఇంటా
ఉండదగిన
కొత్త సంవత్సరం
కేలండర్!
(సినిమా రంజని సైజు)

★

సంవత్సరమంతా
దైవాన్ని స్మరింపజేసే
ఆరు రంగుల చిత్రాలు
అపురూప కళాఖండాలు!





★★

తిథి వార నక్షత్రాలు
వర్జ్య రాహుకాలాలు
పండుగలు పర్వాల
సంప్రదాయ సమాచారవేదిక!

★★★

★ అన్ని వర్గాల వారికీ ఉపయోగకరమైనది
★ అందరికీ అందుబాటులో ఉండదగినది
★★ వెల మూడు రూపాయలు మాత్రమే!





ఎనిమిది దశాబ్దాల
దేశసేవలో
**ఆంధ్రపత్రిక**
అందిస్తున్న
మరో కళాదీపిక



పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## ఆలోచించండి!

ప్రపంచం మొత్తంలో అత్యధిక జనాభా గల దేశాల్లో రెండో స్థానంలో ఉన్న మన భారతదేశం నేడు ఎన్నో విషమ సమస్యలతో తీవ్రమైన సంక్షోభాన్ని ఎదుర్కొంటోంది నిరుద్యోగం, అవినీతి, అసమర్థ పాలన, పెరుగుతున్న జనాభా– దానికి సరిపడినన్ని లేని వనరులు, యువతలో ప్రబలుతోన్న అశాంతి... ఇవన్నీ ఒక ఎత్తు అయితే, పసివాళ్ళు చిన్నారి బాలల దయనీయ సమస్యలు మరొక ఎత్తు! ఎందుకంటే వీరేగా – రేపటి భావి భారత పౌరులు! వీరేకదా, రేపటి మన నూతన సమాజ వ్యవస్థ నేర్పర్చ వలసిన మూల స్థంభాలు!

'వేదభూమి', 'పుణ్య భూమి' అని ప్రశంసించ బడ్డ మన భారతావనిలో నేటి కొందరు 'చిన్నారి బాలల దీనగాథలు' వింటూంటే, ప్రతి ఒక్కరి గుండె ద్రవించక మానదు! ప్రతి వ్యక్తి నయనం చెమర్చక ఉండదు!

తల్లిదండ్రుల నిర్లక్ష్యానికి కోపాలకు గురయ్యే ఎందరో చిన్నారి బాలురు గాయపడ్డ లేత హృదయాలతో ఇళ్ళలోంచి పారిపోతారు ఫుట్‌పాత్‌ల మీద, ప్లాట్ ఫారమ్‌ల పై గడపడం ప్రారంభిస్తారు కొందరు హోటళ్ళలో, వాహనాల్లో క్లీనర్లుగా తమ బ్రతుకుల నీడ్చుతూ జీవిస్తారు కొందరు క్రూరులైన వ్యక్తులు ఇటువంటి చిన్నారులనే తమ జీవనాధారంగా చేసుకోవడం జరుగుతోంది! పసివాళ్ళచే భిక్షాటన చేయించడం (కొన్ని సార్లు ఆ చిన్నారులనే



అంగవైకల్యానికి గురి చేస్తారు కూడా!), దొంగతనాలు చేయించడం, 'మాదక ద్రవ్యాలు, స్మగ్లింగ్ వస్తువులను దొంగచాటుగా రవాణా చేయించడం జరుగుతోంది!

ఇక చిన్నారి బాలికల గురించి అయితే మరెన్నో హృదయ విదారక గాథలు ప్రత్యక్ష మౌతాయి ఎత్తుకొని తీసికురాబడో, మోస పోయో, మరేవో కారణాల చేత ఇంటి నుండి దూరమైన చిన్నారి బాలికల్ని, ఆ చిన్న వయస్సులోనే వ్యభిచార కూపం లోకి నెట్టి వేస్తున్నారు సంఘ విద్రోహులు చక్కగా, యుక్త వయస్సులో వివాహాలు చేసుకొని, భర్తతో హాయిగా కాపురం చేసుకుంటూ, తనకంటూ ఓ ఇల్లు – సంతానాన్ని సృష్టించుకొని, స్వర్గ తుల్యం కావల్సిన వారి భావి జీవితాలు నరకం వంటి వ్యభిచార గృహాల్లో మ్రగ్గడం అదీ చిన్న వయస్సులోనే – ఎంతో విచారించ వల్సిన విషయం! మరెంతో శోచనీయమైన విషయం!

ఇటువంటి బాల బాలికల పట్ల ప్రభుత్వం, సేవా సంస్థలే గాక, ప్రజలు అంటే మనం కూడా శ్రద్ధ తీసుకోవడమే గాక, 'చిన్నారి బాలల దీన గాథల' స్థానంలోనే చిన్నారి బాలల విజయగాథలు ప్రతి ఒక్కరూ చెప్పుకునేలా, చిన్నారులను బంగారు బాటలో సాగేందుకై ప్రోత్సహించ వలసిన బాధ్యత మనదేనని మరవ రాదు!

–ఉజ్వల ప్రసాద్, రామవరం




* * *

## అధిక ధరలూ కారణమే!

"పాపలు ఇంటికి దీపాలు, దేవుని గుడిలో రూపాలు' అని అన్నాడో కవి ఆయన అన్న మాట అక్షర సత్యం పిల్లలు లేని ఇల్లు కళా విహీనంగానూ, పిల్లలున్న ఇల్లు ఎంతో సందడిగాను వుంటుంది

బాలల మనస్సులు అతి సున్నితం తల్లిదండ్రులు తమ పిల్లలపై సమానమయిన ప్రేమానురాగాల్ని చూపించాలి అలా కాకుండా ఒకరిని ఒకలా మరొకరిని మరొకలా చూస్తే వారికి తమ తల్లిదండ్రులపై ద్వేష భావం ఏర్పడుతుంది చిన్నతనంలో ఏర్పడిన ఆ బావం పెద్దవాళ్ళయిన తర్వాత మరింత బలపడి తల్లిదండ్రులను ప్రేమతో చూడరు అందువల్ల తల్లిదండ్రులు తమ పిల్లలను అత్యంత శ్రద్ధాసక్తులతో పెంచవలసిన ఆవశ్యకత వుంది

కొన్ని మధ్య తరగతి కుటుంబాల్లో పరిస్థితి ఈ విధంగా వుంటే మరికొన్ని బీద కుటుంబాల్లో పరిస్థితి మరో రకంగా ఉంటుంది మన దేశంలో అత్యధిక శాతం పేదలే! వాళ్ళు కూటికి పేదవాళ్ళె కావచ్చును కానీ వాళ్ళు తమ పిల్లలను ఒకే విధమయిన ప్రేమానురాగాలతో పెంచుతారు తమ పిల్లలకు పధి సంవత్సరాల వయస్సు రాగానే వాళ్ళని ఏ హెటల్‌లోనో, మెకానిక్ షాపుల్లోనో పనికి పెడతారు ఎందుకు? వాళ్ళ ఆర్థిక పరిస్థితే అందుకు కారణం!

తమ పిల్లలు కూడా అందరిలాగే చదువుకుని పెద్ద ఉద్యోగాలు వేయాలని వారికి కూడా ఉంటుంది. కానీ వారిని చదివించే స్తోమత లేక పనుల్లో పెడుతుంటారు అలా చేతులారా తమ పిల్లల భవిష్యత్తును మొగ్గలోనే నాశనం చేసేస్తున్నారు దీనికంతటికీ కారణం జనాబా పెరుగుదల, అధిక ధరలు

ఈ అధిక ధరల వల్లనే బడుగు ప్రజానీకం పది సంవత్సరాలలోపు




తమ పిల్లలను పనులలో పెడుతున్నారు ధరలు పెరిగేకొద్ది బాల కార్మికులు సంఖ్య పెరుగుతూనే వుంటుంది అదిక ధరలను అరికడితే బాల కార్మికుల సంఖ్య తగ్గడానికి ఆస్కారం వుంది. లేకపోతే అధిక ధరల్లాగానే బాల కార్మికుల సంఖ్య కూడా పెరుగుతూనే వుంటుంది బాల కార్మికుల సంఖ్య పెరగకుండా వుండేందుకు తక్షణ చర్యలు తీసుకోవాలి అందుకు ప్రజలందరి సహకారం ఎంతయినా అవసరం!

-ఎం. జ్యోతికుమారి,
విజయనగరం □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు : ...........................

పూర్తి చిరునామా : ...........................

...........................

...........................

సంతకం

## నిత్య నూతన సీరియల్




(గత సంచిక తరువాయి)

తూర్పున ఉషస్సు దూరమున ఆవుల గుంపు మేయుచున్నట్లు తోచెను. చంద్రుడు గవాక్షము పైకి పోయి కనుపించుట లేదు ఉషస్సు కనుపించుచున్నది. ఈ యుషస్సు దేనికి చిహ్నము? నిరంతరమైన కాలమునకు చిహ్నము ప్రధాన కాలమూర్తి కీమె అర్ధ దేహము. అల్ప వికారమునకు ఈమె కేమి సంబంధము? కాకులు కూయుచుండెను వీధి వెంట జనులు తిరుగుచుండిరి అరుంధతి లేచి పతి నిదురపోవుచుండె ననుకొని, చీర సర్దుకొని, తల గోళ్ళతో దువ్వుకొని నెమ్మదిగా గది నుండి వినిర్గమించెను పక్షుల కిలకిలారావములు హెచ్చెను ధర్మారావూరకే కనులు తెఱచుకొని పండుకొని ఉండెను సూర్యోదయము కావచ్చుచుండెను గది యంతయు వెలుతురు వ్యాపించెను తన కింక నిదుర ఏమి పట్టును! ధర్మారావు లేచి పోయి స్నానము చేసెను

సూర్యుడు సహస్రకిరణములతో భూమిని పొదివి పట్టుకొనెను ఒక పక్షము గడచినది. కిరీటి వద్ద నుండి ఒక లేఖ వచ్చినది అందు రెండే ముక్కలు . 'నన్ను చూడవలయునేనినచో వెంటనే రా!" అని ధర్మారావున కేమియు తోచినది కాదు దీని అర్ధమేమి? ఇప్పు డరుంధతిని వదలి పెట్టి పోవుటెట్లు? అరుంధతిని కాపురమునకు తెచ్చిన తరువాత ఒకటి రెండుసార్ల కన్న ఎక్కువ వదలి ఉండలేదు. ఆమె తాను పశుపతి యింటికి పోయినపుడే ఎక్కువ దినము లాలస్యము చేసెనని ధర్మారావును నిందించెను నిజముగా ధర్మారా వరుంధతికి తల్లియు, తండ్రియు, అన్నయు, తమ్ముడునుగా ఉండెను. ఆమెకు తక్కిన బంధువుల మీద ఉన్న ప్రేమ అంతయు కలసి ధర్మారావు మీదనే కలదు పతిని వదలి నిముసము ఉండలేదు అతడు కళాశాలకు పోవును అతని కొఱ కామె జపము చేయుచూ ఇంట కూర్చుండును. అతడు ప్రొద్దుపోయి యింటికి వచ్చును. "ఇవ్వేళ కనపడినది అందుకు సంతోషించ వలయు" నను "కాదు కాదు, నిన్ను కనిపెట్టుకొని సర్వకాల ముందును" అని ధర్మారావు. "నాకు ఏదైన ఉద్యోగ మిప్పించుడు! మీరు రాలేదన్న దిగులు నాకు ఉండదు" అని అరుంధతి 'తొందరపడకు ఆ రోజులును దగ్గరకు వచ్చుచున్నవి" అని ధర్మారావు కిరీటి యిట్లు వ్రాయుటకు కారణమేమో? అర్ధము సందిగ్ధముగా ఉన్నది అతనికేమైన జబ్బు చేసెనా? ఏమో? – ధర్మారావు తహతహలాడిపోయెను. ఆ నాడు సాయంవేళ అరుంధతి "ప్రయాణము కారేమి" అనెను ధర్మారావు 'ఎచ్చటికి" అనెను అరుంధతి అతడెటున్నాడో! ఆ ఉత్తర మర్ధమేమిటో?" అనెను. "పసివానిని చూచి రాక? రెండు మూడు రోజులు నేనుండగలుగుదును లెండి అత్తయ్య ఉన్నది. సంవత్సరములనుండి పిల్లవాని కనుల కాచుకొన్నాము నే దుత్తరమునకు కూడ పోరా?" అనెను ధర్మారావు ప్రయాణము కట్టెను. అరుంధతి మడి కట్టుకొని వంట చేసెను రైలు సుబ్బన్నపేటలో ప్రొద్దు క్రుంకి ఏడింటికి బయలుదేఱి బెజవాడకు తొమ్మిదిన్నరకు చేరును అరుంధతి దొడ్డిలో దొండకాయలు కోసి వేయించెను పేటలోని తక్కిన దొడ్లలో కూరగాయ అనునది కాయుట మాని వేసినది. రంగాపురము సుబ్బన్నపేట కుత్తరమున నాల్గు మైళ్లలో ఉన్నది. సుబ్బన్నపేట పట్టణ మైనప్పటి నుండియు రంగాపురములోని బీదవారు బాగుపడిరి. వారు కూరలు కాయింతురు, నేయి మజ్జిగలు చేయుదురు. సుబ్బన్నపేట వచ్చి అమ్ముకొందురు పేటలో ఉన్న బీదవారు సినిమా హాలు చుట్టు తిరుగుచుందురు; కాఫీ హొటళ్ళ చుట్టును తిరుగుచుందురు! జట్టులు కట్టి దెబ్బలాటలకు దిగుచుందురు; అప్పుడప్పుడు కూలినాలి చేయుదురు. వారి సంసారములింటిలో ఈగల మ్రోత, బయిట పల్లకీ మ్రోత, వారి అహంకారములు, వారి అంతర్జీవితములు "మింగ మెతుకులేదు, మీసాలకు సంపెంగనూనె" అన్నట్లు. గణాచారి దొడ్డిలో, రత్నగిరి దొడ్డిలో, రామచంద్రరాజు దొడ్డిలో, ధర్మారావుగారి దొడ్డిలో కూరలకు దారిద్ర్యము లేదు. దొండపాదు సాలు పొడుగున కాయును. ప్రతి రెండు రోజులకది కూర యిచ్చును ప్రతి నాల్గు రోజులకు కాకరపాదు కూర యిచ్చును. దొడ్డిలో తోటకూర మదులెప్పటికప్పుడు నూతనముగా ఉండును. తీగ బచ్చలి మూడేండ్ల క్రిందట వేసిన పాదు

ధర్మారావు భోజనము చేసి రైలునకు బయలు దేరబోవుచుండెను అరుంధతి చొక్కాకు గుండీలు పెట్టుచు "కిరీటి అట్లేల వ్రాసెనందురు!" అనెను. దర్మారావు "తెల్లవాఱు వఱకు చెప్పెదను" అని బయలుదేఱబోవుచుండెను.

అరుం మఱల ఎన్నాళ్ళలో వచ్చెదరు?

ధర్మా. రెండు మున్నాళ్ళలో వచ్చెదను. ఒకవేళ ఆలస్యమగునేమో!

అరుం. నాలుగైదు రోజులలో కళాశాల తెరుతురు గదా!

. ధర్మా: నీతో చెప్పలేదు ఇంక కళాశాలకును నాకును సంబంధము లేదు.

అరుం. ఆనగా?

ధర్మా అనగా అనగా ఒక రాజు రైలునకు వేళ అగుచున్నది వచ్చిన తరువాత చెప్పెదను.

అరుధతిని రాచుకొని అతడు బయటకి వచ్చెను అరుంధతి అతని ఉత్తరీయమును లాగినది. అత"దయ్యో!" అని వెనుకకు తిరిగి చూచెను. అరుంధతి "ఎప్పుడు వత్తురు?" అనెను ధర్మారావు "వెళ్ళినగదా వచ్చుట" అనెను అరుంధతి

జరిగిన కథ : 37– రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటాడు గవర్నరుగారు సుబ్బన్నపేటలో పురపాలక సంఘ భవనాన్ని ప్రారంభిస్తాడు సుబ్బన్నపేటకు బస్తీ కళ వస్తుంది జోస్యులు భార్య మంగమ్మను రామేశ్వరము లొంగ దీసుకుంటాడు జోస్యులు రామేశ్వరమును ఏమీ చేయలేక చచ్చిపోదామని అనుకుంటాడు దేవదాసి గిరిక ప్రతీ రోజూ ఆలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది. హరప్పనాయడు తాను చేయవలసిన పనుల గురించి ఆలోచిస్తూ ఉంటాడు. కిరీటికి అతని మామ పిల్ల నివ్వనని అంటాడు జోస్యులును ఎవరో కొట్టి చంపుతారు. స్వదేశీ సినిమాలలోని దుర్నీతికి ధర్మారావు విచారిస్తాడు సాతాని జియ్యరు సంక్రాంతి పాటలు పాడుతూ ఉంటాడు

ఉత్తరీయమును వదలి పెట్టెను

రాత్రి తొమ్మిదిన్నరకు ధర్మారావు బెజవాడ స్టేషనులో నుండెను. మెయిలు వచ్చెను అందరు ఎక్కుచుండిరి. అరవ వాండ్రు, తోళ్ళ వర్తకులు, తురకలు, ఇంటర్మీడియటు బండ్లలో తనాయించి పండుకొనిరి. బెజవాడలో ఎక్కిన వారు వారి పాదముల వద్ద కూర్చుండవలసి వచ్చెను. మూడవ తరగతిలో మనుష్యులెక్కుటకు వీలు లేదు, కూర్చుండుటకు వీలు లేదు. ధర్మారావొక బండిలోని కెక్కెను. జనమొత్తిడి ఎక్కువగా ఉండెను. ఇతర స్వతంత్ర దేశములలో రైళ్ళిట్లుండవట! జనమెక్కువయిరని పెట్టెలెక్కువ వేయుదురు ఎంత మంది కూర్చుండుటకు వీలుండునో అన్ని టిక్కెట్లే అమ్మరాదా? జనము ధనము దోచుకొనుటగా కనిపించినది. వారికి! కలుగు నదుపాయములేమియు లేవు ఇంతలో రెండవ తరగతి బండ్ల దగ్గఱ పెద్ద గోల ఏదియో పుట్టెను

అందఱు అక్కడకు పోయిరి. బెజవాడలోని ఒక రెడ్డి పీడరు గ్రామములో పలుకుబడి కలవాడు, శాసన సభలో సభ్యుడు, చెన్నపురికి పోవుచు రెండవ తరగతి టిక్కెట్టు కొనెను. ఒక రెండవ తరగతి బండికి లోన తలుపు వేసి ఉన్నది కిటికీలన్నియు మూసి ఉన్నవి ఈయన తలుపులు తీయుమనెను లోనున్న యూరపియను తలుపు తీయలేదు అది పెద్ద రభస అయ్యెను స్టేషను మాస్టరు వచ్చి కూడ తీయింపలేకపోయెను చివరకు పెట్టె బలవంతముగా తెరచిరి లోపల ఉన్న వానిని నిర్బంధించుటకు హైందవులయిన పోలీసు ఇన్స్పెక్టరులు పనికి రారు సార్జెంటు కావలెను బెజవాడలో సార్జెంటు లేడు చెన్నపురికి తంతినిచ్చిరి మఱునాడు చెన్నపురి స్టేషనుకు సార్జెంటు వచ్చి అతనిని నిర్బంధింపవలయును.

రైలు సాగిపోవుచున్నది ధర్మారావు ఊహ సాగిపోవుచున్నది "హైందవులు యూరపియనును నిర్బంధించుటకు పనికిరారేమి? అవును వారు శ్వేత ద్వీపవాసులు. ఇదే బాగుగా ఉన్నది"

రైలులో కొంతసేపటికి కూర్చుండుటకు వీలయినది. తాను కూర్చుండి యేమి లాభము. తన బదులు కొత్త వాడింకొకడెక్కి నిలుచుండెను. ధర్మారావు తాను నిలుచుండి అతనిని కూర్చుండుమని అడిగెను. ఆయన "కాదు కాదండి. మీరిప్పుడే కూర్చున్నట్లున్నది. నేను మఱి కొంత సేపు నిలుచుందును అనెను ధర్మారావు మరల కూర్చుండెను. పెట్టెలో చిత్రముగ ఉన్నది. ఒకడు కలకత్తా నుండి వచ్చుచు ప్రక్క పఱచుకొని పండుకొనెను. నిద్ర పోవుచుండెను. ఎవ్వరు అతనిని లెమ్మనరు. మఱి ఒకడు పండుకొని నిద్ర నభినయించుచుండెను. నిలుచుండిన వారతనిని లేపరు బాపట్లలో ఒక్క డెక్కెను ఒక నిద్రపోవుచున్న వానిని లేపెను. అతడు లేచి కూర్చుండెను. మఱి యిద్దఱు కూర్చుండిరి ఒంగోలులో మఱి ఒకడెక్కెను. ఇంకొక పండు కొనిన వానిని లెమ్మనెను. అతడులేవననెను ఎక్కినవాడు గడుసు రాద్ధాంతము చేసెను కేకలు, చేతులు చేతులు కలియుటదాక వచ్చెను అందఱును సర్దిరి అతడు లేచి కూర్చుండెను. మరల ఇద్దరు కూర్చుండిరి ఒకడు "కన్నులు కనబడుటలేదా? మీద కూర్చుందువే"మనెను. ఒకతె "ఆడవారి మీద అట్లు పడిపోయెదవేమి? అవతల కూర్చుంటే" అనెను దూరపువాడొకడందుకొని "నీవాడు వాంద్ర పెట్టెలో కూర్చుండలేకపోతి వమ్మా?" అనెను మఱల రైలు పోవుచుండెను అందరును కూర్చుండియే నిదుర పోవుచుండిరి చూడగా చూడగా ధర్మారావునకు ఇది దేశము, తత్ప్రజల వద్ద నుండి ధనము గైకొని వారికి తగిన జీవిత సుఖములు సమకూర్చబడుచున్నట్లు" తోచలేదు. ఇది ఏదో రైలింత వేగముగా పోగలదని ప్రదర్శించి చూపించుట కేర్పడిన ఒక గారడీ వలె కనిపించినది అంతకన్న ఇంకొక రీతిగా ఉన్నచో బాగుండును. మనమేదో సొంత ఉపయోగము కొఱకొక పని చేసితిమి. ఆ ఉపయోగమెప్పుడో వచ్చును అంతవఱ కాపని ఊరకె ఉండుట ఎందులకు? ఈలోపు దాని వలన కొంత ధనము వచ్చుటకు వీలుండెనేని రానిమ్ము- ఈ పద్ధతిగా ఉన్నది. రైలు చీకటిలో పడిపోవుచున్నది. బిట్రగుంట దాటినది. చిన్న స్టేషనులను లెక్క చేయుటలేదు తెల్ల వారవచ్చుచున్నది. పినాకిని దాటినది. నెల్లూరాగినది. ఇటొకనది, అటొకనది. ఆ నది దాటిన బెజవాడ ఈ నది దాటిన నెల్లూరు చమత్కారముగానే ఉన్నది రైలు దిగిన వెంటనే విద్యుద్దీపముల వెలుతురులో తనకు పరిచితమైన ఒక మొగము తన కోసము వెదకుచున్నట్లు ధర్మారావు కనిపెట్టెను. ఆ మొగమెచ్చటనో కనబడెను అతడు నవ్వకుండ పరిదీన ముఖముతో తన వద్దకు వచ్చి చేతులు పూని "వచ్చితివా?" అనెను ధర్మారావింతసేపు దిగ్భ్రాంతుడై చూచుచుండెను. "వచ్చితివా" అనిన కంఠ స్వరము వినపడినంతనే ధర్మారావునకతడెవరో తెలిసెను ధర్మారావు మొగములో తేజస్సు పోయెను కంఠములో శోక గాద్గదికము తోచెను. అతని పెదవులపై ఒక్కటియే మాట- "ఇట్లయితి వేమి" ఇది.

నెల్లూరు ప్లాటు ఫారమెత్తు, స్టేషను పల్లము, ప్లాటుఫారము నుండి స్టేషనులోనికి దిగుటకు మెట్లున్నవి, ఇద్దరును కలసి మెట్లు దిగుచుడిరి. కిరీటి దిగలేక పడబోయెను. ధర్మారావు పట్టుకొని చేతుల మీద బండ్ల దగ్గరకు తీసికొనిపోయెను. కిరీటి వచ్చిన బండి మీదనే తిరిగి పోవుచుండిరి బండిలో కూర్చుండలేక కిరీటి పండుకొనెను ధర్మారావు తానొకసారిగా హఠాత్తుగా ఒక విశ్వసించరాని లోకమున ఉన్నట్లు భావించెను- "జబ్బేమి చేసినది? ఇటులై పోయితివేమి? మందేమియు పుచ్చుకొనుట లేదా? మీ నాన్నగారును. అన్నగారును ఉన్నారా? పదునేను రోజులలో ఇంత చిక్కి పోవుట ఎట్లు? మీ మామ వద్ద నుండి వార్తలేమైన వచ్చెనా? ఆ పిల్లను నీకియమనిరా ఏమి?"- ప్రశ్న పరం పర కురిసెను కిరీటి తన చేయి ధర్మారావు మీద వేసెను "ఇంటికి పోయిన తరువాత చెప్పెదను బండి కుదించు చున్నది నాకేమియు ఓపిక లేదు" అని కిరీటి సమాధానము చెప్పెను. ఇంటికి పోయిరి. ఇల్లూరికి చివర, రిజిష్టరాఫీసు వద్ద పెద్దదొడ్డిలో ఇల్లున్నది ఇంటికి దూరముగా ఒక పాక ఉన్నది. ఆ పాకలో తడికలడ్డము కట్టి రెండుగదులు; ఒకగదిలో తండ్రి, ఒక గదిలో, కిరీటి, బండిదిగి కిరీటి నెమ్మదిగా "మాటాడకుండ లోనికి రమ్ము. నాయన నేను స్టేషనుకు వచ్చితినని కోపించును" అనెను.

ధర్మా: మంచి బుద్ధిమంతుడవు!

కిరీటి: నీకు త్రోవ తెలియదాయెను చీకటిలో నీకెవరు చెప్పెదరు?

ధర్మా: మంచి ఆలోచనా పరుడవు. సరికాని పద ఇర్వురును లోనికి పోయి చప్పుడుగాకుండ పండుకొనిరి.

ధర్మా: కథ ఏమిటో చెప్పవు! నాకు నిద్ర పట్టుటలేదు.

కిరీటి నాయన నిద్ర లేచును. కోపించును నిద్ర పట్టించుకొనుము. తెల్ల వారిన తరువాత చెప్పెదను. ఇంక భయము లేదు భయమంతయు దాటి పోయినది.

ధర్మా పెండ్లి యెప్పుడు?

కిరీటి వారము రోజులున్నది ధర్మారావు కిరీటిని కౌగిలించుకొనెను. కిరీటి ధర్మారావును గాఢముగా కౌగలించుకొనెను అతని ఒడలిలో శక్తి లేక ధర్మారావున కది గాఢముగా లేదు. తమ్ముని గాటపు కౌగిలింత ధర్మారా వెరుగును. కాని ఇప్పుడది గాఢముగా లేదు. ధర్మారావనుకొనెను: "ఈ కౌగిలింతలోని గాటపుదనముతో నాకింక సంబంధము లేదు"

ఈ పాకకు దూరముగా ఇంకొక పాక ఉన్నది అందులో కిరీటి అన్నగారు వకీలు. అతడు కచేరి పెట్టుకొనును. పది గంటల నుండి మఱల సాయంకాలము వఱకు ఆ పాక ఖాళీగానుండును. పదిన్నఱకు అన్నదమ్ములిరువురు అందులో చేరిరి కిరీటి ఒక మంచముపై పరుండెను ధర్మారావొక కుర్చీలో కూర్చుండెను కిరీటి చెప్పనారంభించెను· "నేనీ ఊరు వచ్చిన నాడే మా మామ కొక లేఖ వ్రాసితిని. అందులో మా అమ్మకు తాను వాగ్దానము చేసెననియు, దాని ప్రకారము తాను నడచుకొనవలయుననియు, మాయమ్మ చనిపోవుట చేత ఆ వాగ్దానమునకు వ్యాప్తి పోలేదనియు, పిల్లనిచ్చునదియు లేనిదియ వెంటనే

సమాధానము వ్రాయవలయుననియు, ఈయకున్నచో నేను చనిపోదుననియు, ఈ హత్యా పాతకము తనకు చుట్టుకొనుననియు వ్రాసితిని. దాని కాయన సమాధానమీయ లేదు ఇచ్చుటికి వచ్చినప్పటి నుండియు నాకు నిద్ర పట్ట లేదు. అన్నము సయించలేదు. బాపట్ల నుండి మా పిన తండ్రి వచ్చెను. ఆయిన చెప్పినాడు. మా మామ ఆ యుత్తరము చూచుకొని నవ్వినాడట ఆ ఉత్తరము బంధువులకు చూపించి, "యీ పిచ్చివానికటయ్యా పిల్లనిచ్చునది? వీనిని చదువుకొమ్మని సుబ్బన్నపేటకి పంపించుట ఎందులకు? విశాఖపట్టణము పిచ్చి ఆస్పత్రికి పంపించరాదా" అనెనట- నాకా వార్త తెలిసినది. నా కొడలు మండిపోయినది నేను మఱల ఇంకొక ఉత్తరము వ్రాసితిని. అది కొంచెము తీవ్రముగా వ్రాసితిని. "నేను పిచ్చి వాడను కాను, నీకన్నను తెలివిగలవాడను. నీవు నెలకు మూడు వందలు తెచ్చుచున్నావు గనుక నీవే వివేకవంతుడవు కావు, ధనము సంపాదించుట వివేకము కాదు. ఏదో మనము బ్రాహ్మణేతరులము గనుక నెమ్మదిగా అందులో నుండి అందులోనికి, మ్యాజిస్ట్రేటును తహసీల్దారును, ఇంగ్లీషు హెడ్ క్లార్కును, హుజూరుశిరస్తదారును, డిప్యూటీ కలెక్టరునైనది. కాని ప్రత్యేకముగా మనము రాజ్యాంగవేత్తలమా? మహా కవులమా? మహా శిల్పులమా? మత కర్తలమా? ఏమని? మామా! నేనిట్లన్నానని కోపము తెచ్చుకొనకుము కోపమనునది తేలికగా వచ్చును నెమ్మదిగా నీవొంటరిగా ఉన్నప్పుడు శాంతముగా ఊహించి చూడము! నేనేమి నిన్న కార్యకరణము చేయుమనుట లేదు. నీ కూతును తీసికొనిపోయి పట్టి దౌర్భాగ్యునకు కట్టి పెట్టు మనుటలేదు. దైవము రక్షించిన నేను ఏదియో సంపాదించగలను. నీవైదాఱువేలు కట్న మిచ్చి యేబది వేల ఆస్తిగల వానికిచ్చెదవు వానికి నీవన్నచో గౌరవముండదు. నీ కూతురన్నను గౌరవముండదు నేను మేనల్లుడను ఆ యైదు వేలు నాకిచ్చినచో నా జీవితములో ఏదైన ఒక వృత్తిలో ఒక మార్గమేర్పఱచుకొనుటకు వీలగును. నేను ధనమాశించి చెప్పుటలేదు. నాకు నీ దమ్మిడీ అక్కర లేదు. నాకు కావలసినది శశిరేఖ. దానికి పరునియం దిష్టమున్నచో నేను నిన్నిట్లడుగను ఆమె పరాసక్త హృదయ యైనచో నా ప్రేమ జీవితమును బ్రహ్మ దుఃఖావసానముగా వ్రాసినాడని యీ పాటికే వర్షాకాల పినాకినీ గర్భమున ఇమిడి యుందును. దానికి నాయందున్నది; నాకు దాని యందున్నది. ఇది ఎన్ని జన్మల నాటి దాంపత్యమో! తండ్రివి గనుక "నా కూతురు మీద నాకధికారమున్న"దని నీ వూహించెదవేమో! ఆ అధికార మెంత వరకున్నది? శశికి పదునెనిమిదేండ్లు దాటినవి. న్యాయ ప్రకారము నీకామె మీద అధికారము లేదు. మేమిద్దఱమును విడిగా పోయి వివాహము చేసికొనిన నీవేమియు చేయలేవు. అట్టి పని మన వంశ మర్యాదకు తగినది కాదు. కాదు కనుకనే నేనిచ్చట కృశించిపోవుచుంటిని శశి నీ యింటిలో శుష్కించిపోవుచున్నది. ఆలోచించుకొనము. ఇదే చెప్పుచున్నాను. వారము దినములు తిరుగులోపుగా ఈ ఉత్తరమునకు సరియైన జవాబు రాదేని నీవు కిరీటి మరణ వార్తయే విందువు. నీవు కఠోర హృదయుడవు నా మరణ వార్త చెప్పి నిన్ను బెదరించుట కాదు. నేను చనిపోవుదుననగా నీవు కాని భయపడవు నేనూరకే జరుగబోవుచున్న విషయము చెప్పితిని. నీ జన్మములో నీవు శశిరేఖ సుఖముగా గాపురము చేయుచున్నదన్న వార్త విని సుఖపడవు ఎవరికో బలవంతముగా కట్టెదవు. దాని శవము పెండ్లి పీటల మీద తల్లి చేతులలోననో




గర్భాదానము నాటి రాత్రి సూత్రము కట్టిన వాని చేతులలోననో కనిపించును. అది నా భార్య, దానినింకొకనికిచ్చుటకు నీవెవడవు? ఎవరి సొమ్ము వారికిచ్చుటకు నీకింక దిగులెందుకు? చేతి మీదుగా వివాహము చేయుము చేసిన పుణ్యము కట్టుకొనుము. వారము రోజుల వరకు నీ ఉత్తరమునకై ఎదురు చూచుచుందును" అని నేను వ్రాసితిని. ఆ లేఖ చూచుకొని మా మామ కొంత కదలిపోయెనట. కాని పిల్లనిచ్చుటకు మాత్రమంగీకరించలేదట. తరువాత రెండు రోజులు గడచినవి. మూడవ రోజు గడచినది. నేనీ ఉత్తరము వ్రాయుటయు, నా స్థితియంతయు మా బంధువులందఱికీ తెలియును. ఇంక నేను బ్రతుకునది వారము రోజులని, ఆఱు రోజులని, ఐదు రోజులని, నాల్గు రోజలని చెప్పుచుంటిని నాల్గవరోజు సాయంకాలము నేనిప్పుడున్నట్లు న్నాను. అయిదవనాడు మంచములో నుండి లేవలేకపోతిని. అన్నా' నా సంగతి నాకే విచిత్రముగా ఉన్నది వైద్యులు వచ్చి పరిశీలించిరి. వ్యాధి ఏమియు లేదనిరి. దేనికి చికిత్స చేయవలయునో తెలియరాదనిరి. నన్నన్నము ముందఱ కూర్చుండ బెట్టుదురు నాకు మెతుక లోనికి పోదు. నేనప్పుడెట్లున్నానో నాకు తెలియదు. అందరును మాత్రము నేనూఱకే కను ఱెప్ప వేయక చూచు చుంటిననియు, ఎవ్వరితోను మాట్లాడకుంటిననియు చెప్పుచున్నారు. నాకొక్కటి మాత్రము బాగుగా జ్ఞాపకమున్నది. పది గంటలకు తపాలాఫీసు నుండి ఉత్తరములు వచ్చును. పోస్టువాడు వచ్చు వేళకు నేనుత్తరము వచ్చినదాయని అడుగుదును. ఎవ్వరును సమాధానము చెప్పరు. రాలేదని నాకు తెలియును ఇంక మూడు రోజులు, ఇంక రెండు రోజులు. అప్పటికి నాస్థితి అందఱకును సమగ్రముగా తెలిసినది అందఱును పడుచున్న తొందరయు, వారనుకొనుచున్న మాటలును నాకు తెలియును. నేను వారితో మాట్లాడుటకు నాకు నోరు రాదు. నాకు మనస్సులో ఏమియును లేదు. ప్రతి రోజును పది గంటలగుట తపాల బంట్రోతు ఉత్తరమును తెచ్చుట- అది తప్ప నా బుద్ధి కింకొకడు లేదు. ఆ రోజు కూడ ఐపోయినది. ఇంక ఒక్క దినమున్నది, మా పినతండ్రులు, మా నాయన, మా తక్కిన మేనమామలు అందరు ఈ ఊరనే ఉండిరి. ఆ రోజున నేను మంచములో శవమువలె ఉంటినట! శవము వలె అంటిని, అది నాకును తెలియును. మాటాడలేదు. కన్నులతో మాత్రము చూచుచుంటిని వైద్యులు వచ్చిరి; చూచిరి. జ్వరము లేదు. నాడి చక్కగా ఆడుచున్నదట పలుకలేదు. కన్నులలో తెలివి ఆడుచున్నదట. మా మామకు తంతి యిచ్చిరట; కిరీటి మరణ శయ్యా మీద ఉన్నాడు, సాయంకాలపు బండిలో రమ్మని, తంతి యిచ్చినది మా యింకొక మేనమామ. మా మామ

రాత్రికి వచ్చెను ఆ స్థితిలోనున్న నన్ను చూచెను అయోగిరి వంటి ఆయన కరగిపోయెను నన్ను కన్నులు మూసికొని ఉన్న వానిని, ఒక విధముగా స్మృతి లేక ఉన్న వానిని తట్టి "కిరీటీ! కిరీటీ!" అని లేపెనట నాకు స్మృతి లేదు అప్పుడు మా పినతండ్రి ఒక ఉపాయము చెప్పెనట- "వాడు కేవు మఱల పోస్టు వాడు వచ్చు వేళకు కన్నులు తెఱచి ఉత్తరమనును ఈలోపుగా నీవు వుత్తరము వ్రాసి ఉంచుము. ఆ వేళకది వాని చేతి కిత్తము. వాడు బ్రతుకుట కదియొకటియే ఆశ" అని మఱి కొందరు "ఇంత నీరస స్థితిలో ఇంతటి మంచి వార్త అతడు విని ఆనందమును పట్ట లేక ఏమగునో!" అని చెప్పిరి మా పిన తండ్రి "వ్రాసెడు ఉత్తరములో అతని మనస్సు చమత్కారముగా, ప్రాప్రాముల చెదరి పోనీకుండ పట్టుకొనునట్లుగా వ్రాయవలయును నేనట్లు వ్రాయింతు"నని చెప్పి మా మామచేత ఒక జాబు వ్రాయించెను మరునాడు తపాలా వేళకు నేను కన్ను తెఱచి "ఉత్తర" మంటిని. "ఇదిగో ఉత్తరము వచ్చిన"దని నాకిచ్చిరి అందిట్లున్నది- కిరీటీ! నీవు చాల ఏచిత్రమైన మనిషివి నీవు తెలివి తక్కువ వాడవు కావు వారము రోజులలో చనిపోదునని చెప్పిన నీకు నా కూతునిచ్చెదనను కొనుము అంత తీవ్ర బుద్ధి వా మెతో ఏమి సంసారము చేసెదవు? నీ ప్రకృతి అలౌకికముగా ఉన్నది నీవు నా వద్దకు వచ్చి నాతో మాటాడుము మా అమ్మాయిని నీకే యిచ్చెదను కాని నీవు రెండు మూడు రోజులలో వచ్చి నాతో మాటాడవలయును ఇట్లు మీ మామ"- నేను ఆ ఉత్తరము చదువుకొన్నంతనే- నాకు వివేకమేమియును పోలేదు, సర్వమును చక్కగా తెలిసినది నా యొడలిలో ఏమియు వ్యాధిలేదు వారము రోజులు నిద్రాహారము లెఱుగని నీరసము మాత్రమున్నది- నేను లేచి "నాయనా! నేను బాపట్లకు పోవలయు"నంటిని మా నాయన "మావ ఏమని వ్రాసెనురా ఉత్తర?"మనెను నేను "పిల్లనిచ్చునట కాని ముందు పోయి నేను మాటాడవలయునట! నేనింత సాహసుడనగుటచే ఆయన కనుమానమట" అని చెప్పితిని మా నాయన "నేటి సాయంకాల మాయన యీ ఊరు వచ్చునట నీవు వెళ్ళుట ఎందుకు! అయినను ప్రొద్దుటి బండికి వచ్చునేమో! కనుగొని వత్తు"నని చెప్పెను ఎవరినో పంపించి కనుగొనినట్లు నటించి ఆయన వచ్చినట్లు నాకు తెలియ చేసిరి. నేను మా పినమామ యింటికి పోయితిని నన్ను మా బావయు మా నాయనయు పట్టుకొని తీసికొనిపోయిరి మా మామ కనబడెను ఆయనను చూచినంతనే కారణము లేకయే నాకు దుఃఖము పొంగి వచ్చి నేనేడ్చితిని ఆయన నన్ను కౌగిలించుకొని దుఃఖించెను నలుగురు ఆయన నోదార్చిరి ఆయన చివరకిట్లు చెప్పెను. "ఇక్కడ వీడిట్లున్నాడు అక్కడ శశి అట్లున్నది! ఆమె ఉపవాసములు, వ్రతములు, ఎన్నాళ్ళ నుండియో ఏక భుక్తము, వారము రోజుల నుండి దానికి స్మృతి లేదు ఏదో మంత్రము నేర్చుకొన్నదట! ఎప్పుడు ఆ మంత్రమే జపించుచుండును తన్మంత్ర పునశ్చరణలో మన ధ్యాసయే లేదు ఈ దంపతుల నిద్దరును విడిగా తీసి నేనేమి బాగుపడుదును?" అని చెప్పి నన్ను చూచి "నాయనా! లగ్నము పెట్టింతునా?" అనెను మా నాయనకు జ్యోతిషము బాగుగా తెలియును ఆయనయే ముహూర్తము పెట్టెను లగ్నమింక ఐదు దినములున్నది ఇది జరిగినది మొన్నమొన్ననే! నీకు జాబు వ్రాసితిని నీకు నిన్న అందినది అందిన వెంటనే బయలుదేరి వచ్చితివి ఇది నా కథ నేను మొన్నటికన్న నేడు చాల నయము నేను మొన్నటికన్న బలిసితిని సుమా!"

ధర్మారావు మనుష్య లోకములో లేడు రస ప్రపంచమున ఉన్నాడు దశావస్థలు, సాత్త్వికవ్యభిచారి బావములు- వానిని గుఱించి ఊహించుచున్నాడు "ఓహో! కావ్య జగత్తు కల్పిత జగత్తనుకొంటిని కావ్య జగత్తే యధార్థమైన జగత్తు అపరిపక్వమైన మనస్సులు, కృత్రిమ ప్రకృతులు, అసహజమైన మనోభావములును గలిగిన మనమే కల్పిత జగత్తు యథార్థమైన మనో భావములు, నిర్మలినమైన హృదయము, మహా నాగరికత పొందిన బుద్ధీంద్రియములు కలిగినచో తన దృష్టి, తన రక్తము కల్మషరహితమై, ధర్మగుణ భూయిష్ఠములైనచో శీలమునందంత గాఢత్వముండును అంత యేకాగ్రత ఉండును ధర్మార్థ కామ మోక్షములు వారి యందు వ్యభిచరించవు వారు వానిని చక్కగా విభజించి ఒకదాని సంశ్లేష ఒకదానికి గలుగకుండ వానిని సువ్యక్తముగా ఆచరింతురు పంచీకరణము వలననైన భూత సృష్టికి వారలంకార భూతులు వర్ణ సంకరము లేని రక్తము స్వచ్ఛమైనది వారి నాడులలో ప్రవహించు చుండును ఏ వర్ణము వారైన నేమి? తాదృశ మహా ప్రకృతులకు నమస్కారము

కిరీటి "అన్నా! యేమిటాలోచించుచున్నావు?

ధర్మా నీ భార్య స్మృతిలో లేదట కదా? ఆమెను నీవొకసారి చూచి రారాదా?

కిరీటి ఇద్దఱమును పోదామా!

ధర్మా వలదు. లగ్నమింకెన్నాళ్ళున్నది?

కిరీటి నాల్గు రోజులు.

దర్మా ఈ నాల్గు రోజులలో నీవేమైన రెక్కొందువా?

కిరీటి మనస్సులో శశిరేఖ ఉన్నది. దగ్గఱ నీవుంటివి అన్నము కలిపి పెట్టు అన్నవు నీవుండగానే నేల బలియను?

ధర్మా: వదినె నాకై ఎదురు చూచుచుండును నేనిచటి నుండి కదలిపోవుట పదినాళ్ళకు తక్కువ పట్టనట్లున్నదే!

## గొఱ్ఱెల కాపరి

ఇది శుభదినం
మన ప్రభుని జన్మదినం
పాపుల రక్షణకై జనియించె
ఈ బుడిపై మానవావతారుడై
బెత్లెహేము పురమున
పశువుల పాకన
పూజించిరి గొల్లలు ఆ బాల యేసుని
బంగారు సాంబ్రాణి అర్పించిరి
ఈ గొఱ్ఱెల కాపరికి.

-తలతోటి సాల్మన్‌రాజు



కిరీటి సుబ్బన్నపేట యిద్దఱము కలసిపోదము.

ధర్మా. ఇంక నిన్ను నమ్ముకొన్నచో నేను వెళ్ళినట్లే.

కిరీటి, వయ్యారమైన విలాసమైన పసి సిగ్గు వెలిగ్రక్కు చిరు నవ్వు, బలహీనమైన మొగమున తాండవింప చేసెను చచ్చిపోవుచున్న తీగకెవరో మంచినీరు పోయగా మరునాడు నిలద్రొక్కుకొని మొండి వడిన కొమ్ము కణుపులో కనబడి కనపడనంత సన్నని లేత చివురు కనిపించి నట్లున్నదా నవ్వు రెండు రోజులలో కిరీటి మఱల మనిషి వలె కనబడజొచ్చెను శరీరమునందు బలహీనముగా ఉన్నను, కొద్దిగా లేచి తిరుగుటయు, ఉతా స్నేహితులందఱకును శుభలేఖలు వ్రాయబడినవి కిరీటి తాను స్వయముగా వ్రాసెను. పెండ్లి బాపట్లలో, వివాహమునకు బంధుగులకన్న స్నేహితులే ఎక్కువ మంది వచ్చిరి కిరీటి ప్రణయ కథ స్నేహితులందఱెఱుగుదురు చివరకు వారికిద్దఱకును పునస్సమాగమము కలుగు చున్నదనుటచే సంతోషించని మిత్రుడు లేడు. సూర్యపతి, పశుపతి, శివరావు, సీతాపతి ఎల్లరును వచ్చిరి అంచరును పెండ్లి కుమారునకు కానుకలు తెచ్చిరి ఎవరు తెచ్చిన కానుకయు పెద్ద వెల గలది కాదు అన్నియు ఆనందమైనవి సూర్యపతి కృష్ణ కర్ణామృతము, లీలాతరఙ్గణి, గీత గోవింద కావ్యము ఇవి మూడును బహుమానమిచ్చెను శివరావు మంచి గంధముతో చేసిన చాయా పటముల చుట్టుకొని తెచ్చెను పశుపతి దంతపు పని చేసిన మంచి గంధపు చందుకాయ పెట్టె తెచ్చెను సీతాపతి పొందూరు జరీ పంచెలును, చీరయు సతీపతులకు కట్నము తెచ్చెను వివాహ సమయమున స్నేహితుల సందడి, పేరంటాండ్ర సందడికన్న ఎక్కువై పోయెను స్నేహితులలో బాపిరాజుండెను అతడు చిత్రకారుడు పరమ సత్పురుషుడు అతడు చమత్కారముగా పాటలు పాడును సతీపతుల వరుసలనుబట్టి వరుస పాటలు పాడును పదునెనిమిదేండ్ల పిల్లకు వివాహమగుట. వివాహములో అనేక సంచర్భములు కలుగుట చేతనో యేమో బంధుగులెక్కువ మంది రాలేదు అందు చేత బంధువులైన పేరంటాండ్రే ఎక్కువ మంది లేరు బాపిరాజు వారందరును లేని లోటు తీర్చెను వివాహము మూడు నాళ్ళు చేసిరి మూన్నాళ్ళును ప్రత్యేకపు విడిదిలో స్నేహితులు పడిన ఉత్సాహమునకు మేర లేదు కిరీటి తన ప్రణయ కవిత్వము చేత రసజ్ఞులైన భావ కవులందఱకు సమాదరణీయు డయ్యెను అందుచే అందరును వచ్చిరి దినములో పదునారు గంటలు సంగీతము, పాటలు, పద్యములు, వినితోడనే సరిపోయెను సుబ్బారావుగారు వచ్చి తన కోకిల కంఠముతో ఎంకి పాటలు మూడు రోజులును కొట్టి పోసెను. సుబ్బారావుగారన్న స్నేహితులందఱకును మహాబిమానము పశుపతి కాయన అవతార పురుషుడనియే! పెండ్లి జరిగిన మూన్నాళ్ళు ఎప్పుడో తప్ప కిరీటి పెండ్లి యిల్లు వదలి రావీలు లేకపోయెను దర్మారావు విడిదిలో ఉండుటకు వీలు లేదు సర్వవేళల కిరీటి వద్దనే ఉండవలయును ధర్మారావు విడిదిలోనికి భోజనమునకు పోవును కలెక్టరుగారికి 'బంట్రౌతు''లుండిరి వారికి దర్మారావుగారెవరనియు, కలెక్టరుగారి అల్లునకంత స్నేహితుడా అనియు అబ్బురము తోడ కన్నులతొ దర్మారావును వచ్చి పిలుతురు అతడు భోజనము చేసి పోవును కిరీటి చెప్పవలసినదేమియును లేదు ధర్మారావూరకే ప్రక్కన కూర్చుండును లగ్న సమయమున శశిరేఖను తెచ్చిరి ఆమె కనులెత్తి ఎవరిని చూడలేదు తెర తీసిన తరువాత కిరీటి వేయి కనులతో ఆమెను చూచెను ఆమె కనులెత్తి అతనిని చూడలేదు ఇద్దరును తలంబ్రాలు పోసికొనిరి కిరీటి నాలుగైదుసార్లు మాత్రము పోసెను పళ్ళెములోని తక్కిన బియ్యమన్నియు శశిరేఖ చేతనే తల్లి పోయించెను ప్రియురాలి హస్తాంగుళి స్పృష్టములై, చల్లనివై, తన శిరస్సున జారుచున్న తలంబ్రాలు జారుటలోని సౌఖ్యమతడు నిమీలిత నేత్రుడై అనుభవించుటయె సరిపోయెను

(ఇంకా వుంది)

# ఈ వేమన పద్యాలు




ఉప్పులేని కూర యూనంబు రుచులకు
పప్పులేని తిండి ఫలములేదు
అప్పులేనివాడె యధిక సంపన్నుండు
విశ్వదాభిరామ వినురవేమ.

# వారఫలం

**25-12-1987 శుక్రవారం మొదలు 31-12-1987 గురువారం వరకు**

★ **మేషం:** గ్రహమండలి యందు మీ రాశికి అనుకూల మార్పులు చేకూరుతాయి అందు మూలాన వారమంతా సర్వానుకూలం ఆరోగ్యరీత్యా మాత్రం వృద్ధులు జాగ్రత్త వహించాలి సుఖ శాంతులుంటాయి ఉద్యోగరీత్యా సదవకాశ ముంటుంది స్త్రీలకు. సర్వానుకూల వారం

★ **వృషభం:** ఉపయోగకరమయిన మార్పులు అనేకం కనిపించనున్నాయి ధనాదాయమున్నది వృత్తిరీత్యా అనుకూలం కళా రంగాన సదవకాశాలు కొందరకు లభిస్తాయి. స్త్రీలకు మీరు ఉద్యోగం చేసే వారయితే, మేలే!

★ **మిధునం:** వస్తు వాహన సేకరణకు కొందరకు చక్కని అవకాశమున్నది ఆరోగ్యం ఈ రాశి జాతకులకు అనుకూలం. 'ఫాక్టరీ' గనులందు శ్రమించే వారికి అనుకూలం. ఆదాయమున్నది స్త్రీలకు శుభ కార్యానుకూలత, ముఖ్య బంధు సమాగమం

★ **కర్కాటకం:** మాటల్లో, చేతల్లో ఎంత జాగరూకత వహిస్తే అంత మంచిది శుభ కార్యానుకూలత, వృత్తియందు అధికారాదరణ చేకూరుతుంది సాహితీ రంగాన మీకు ప్రతిభ యున్నదా, రచనా వ్యాసంగమున్నదా, మేలే స్త్రీలకు మిత్రులతో నో, బంధువర్గీయులతో నో అభిప్రాయభేదాలు రావచ్చు.

★ **సింహం:** విద్యా విషయంగా మేలైన వారం. దూర ప్రాంతాలకు ప్రయాణించే అవకాశాలు కొందరకు ఉన్నాయి ముఖ్యులతో అభిప్రాయ భేదాలు రాకుండా చూచుకొనటం శ్రేయమని ఈ వార ముఖ్య విషయం. స్త్రీలకు గత మూడు వారాల వలె అన్ని వ్యవహారాలందు కొనసాగుట గమనింపదగిన అంశం

★ **కన్య:** ధనాదాయమున్నది. అన్ని రంగాలలో సత్ఫలితమున్నది 'శని' భగవానుని చర్య గమనింప దగిన అంశం సుఖ శాంతులకు లోపం రావచ్చు. ఆరోగ్యం లోపించవచ్చు. మరి శ్రద్ధ వహించుట ఎంతైనా శ్రేయస్కరం గదా! స్త్రీలకు : ఆరోగ్యం కాపాడుకోవాలి అనవసర వ్యాసంగం తగదు. సాటి వారితో గొడవలు రావచ్చు. జాగ్రత్త!

★ **తుల:** పిల్లలకు సంబంధించిన వ్యవహారాలందు, ముఖ్యంగా వారికి సంబంధించిన ఉద్యోగ వృత్తులందు వారాంతం వరకు జాగ్రత్త వహించాలి ఈ వారమంతా మీరు సాటి వారి వలన బాగా ఆకర్షింపబడతారు స్త్రీలకు . ఆశించిన మార్గాన డబ్బు అందుతుంది

★ **వృశ్చికం:** మీ ముఖ్య కార్యక్రమాలు సక్రమంగా సానుకూలం కావటం గమనింపదగిన అంశం అధికంగా డబ్బు ఖర్చు చేయవలసిన అగత్య ముంటుంది వినోద కార్యక్రమాల్లో కొందరకు అవకాశాలు చిక్కుతాయి స్త్రీలకు ఉపకరించే వారుంటారు అనుకొన్న పనులు సక్రమంగా నెరవేరుతాయి

★ **ధనుస్సు:** ఉన్నత స్థాయి మిత్రుల స్నేహం వలన ఏదో మేలు జరుగనున్నది. ఆర్థిక పరిస్థితి సుమారుగా ఉంటుంది గృహ నిర్మాణానికి కొందరకు సదవకాశమున్నది జీవితం సుఖంగా సాగిపోయే అవకాశాలుంటాయి. గ్రహించండి స్త్రీలకు ఒకటి రెండు అవరోధాలు చేకూరినా పెద్దగా బాధ పడనక్కరలేదు. గ్రహించండి

★ **మకరం:** ఈ వారం పరిస్థితులు, గత కొన్ని వారాల కన్నా మేలే ధనాదాయమున్నది. వృత్తిరీత్యా ప్రగతి ఏర్పడుతుంది సభా మర్యాద యున్నది నలుగురిలో పేరు ప్రతిష్ఠలు లభిస్తాయి విలువైన వస్తువులు కొనుగోలు చేయగలుగుతారు స్త్రీలకు : వాహన సేకరణకు అనుకూలం పత్రికా గౌరవం.

★ **కుంభం:** కొంత శ్రమ కలిగినా ఆశించిన ఫలితం అతి సులువుగా దక్కించుకోగలరు ఉన్నత స్థాయి మిత్ర సహకారమున్నది. భాగ్యవంతుల అండదండలు లభ్యమవుతాయి. కృషియందు రాణింపు గల వారం, గ్రహిస్తారుగా! స్త్రీలకు : ఆనందదాయకమైన కార్యక్రమం అనుకూల వాతావరణం. మిత్ర సమాగమం

★ **మీనం:** కొన్ని వ్యవహారాలలో మిత్ర సహాయ సహకారాలు లభ్యమవుతాయి. పుష్కలంగా ధనాదాయమున్నది. భూమిగాని, యిల్లుగాని కొందరు కొనుగోలు చేయగలరు, గమనించండి. స్త్రీలకు : ఆర్థిక పరిస్థితి సామాన్యం. బంధువర్గీయుల రాక, అధిక వ్యయ సూచక వారం.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# బొమ్మలు

మడుగుల రామకృష్ణ

చీకటి పడుతున్నకొద్దీ ,ఆదుర్దా ఎక్కువైంది వీరన్నకి. ఆలోచనలు జోరీగల్లా ముసురుతూ మనసుకి శాంతి లేకుండా చేస్తున్నాయి. ఇక ఉండబట్ట లేక పూరి గుడిసెలో దీపం పెడుతున్న కొండబాబుతో, తన మనసులోని మాట మళ్ళీ చెప్పాడు ఆ మాట పూర్తి కాకుండానే కోపంగా వీరన్న వంక చూస్తూ-

"ఇదిగో ముసిలోడా! ఇప్పటికి నీకు లచ్చసార్లు సెప్పాను. నువ్వా బుడంపాడు వొంతెనకాడి కెల్లటానికి వీల్లేదు పైగా నీ ఆరోగ్యం కూడా ఏం బాగాలేదు అయినా ఇంకా ఎందుకురా నీకా బొమ్మల మీద ప్రేమ? మన కుటుంబం రక్త మాంసాలు దారపోసి ఆ బొమ్మల మీద ఆధారపడితే మనకేం మిగిలింది? అటు సెప్పించుకునే వోల్లు, యిటు యినేవోల్లు లేక సివరికి అడుక్కోవల్సి వచ్చింది నీయవ్వ. మన కడుపు నింపని విద్దెలు మనకెందుకురా. అందుకే నీ పిచ్చి ఆలోచనలు కట్టిపెట్టి తొంగో" ఆవేశంగా అని బయటకు వెళ్ళిపోయాడు కొండబాబు.

దిగులుగా కుక్కి మంచంలోంచి లేచి కూర్చుని ఖంగ్ ఖంగ్‌మని దగ్గాడు వీరన్న అతని కళ్ళల్లో సన్నటి నీటి పొర కదిలింధి. అవును ఒక విధంగా కొండబాబన్న దాంట్లో తప్పేంలేదు ఒకప్పుడు బొమ్మలాడిస్తే జనం వేలకు వేలు పోగయి కనకవర్షం కురిపించే వాళ్ళు. మరి ఈనాడో. తన కళకి ఆరణలేదు

ఆ రోజుల్లో ఎన్నో ఆమడల నించి జనం బళ్ళు కట్టుకు వచ్చేవాళ్ళు ఒక దళంగా తను, భార్య, కొడుకులు, కూతుళ్ళు ఊరూరా తిరుగుతూ, పెద్దల్ని సంప్రదిస్తూ ఎన్నో ఆటలు ప్రదర్శించే వాళ్ళు. చావులు, పుట్టుకలు, పెళ్ళిళ్ళు పేరంటాళ్ళు అన్నీ తమ ప్రయాణంలోనే సాగిపోయేవి మేక తోలు, జింక తోలుతో చేసిన బొమ్మలని పురాణ పాత్రలుగా జీవం ఉట్టిపడేలా చేసి రంగులద్ది, నగిషీలు చెక్కి ఆ సజీవ మూర్తుల్ని బద్దలకి కట్టి తెర మరుగున ఆడిస్తూ భారత రామాయణ కథలు చెప్తూ ఎందరికో ఆనందాన్ని కలిగించారు ఉత్తర గోగ్రహణం కథ చెబితే వర్షం కురుస్తుందన్న నమ్మకంతో కొందరు తమ వూళ్ళల్లో వర్షాలు లేనపుడు కథలు చెప్పించే వాళ్ళు. ఘనంగా సత్కరించేవాళ్ళు. దేశ విదేశాల్లో పేరుపొందిన తోలుబొమ్మలాటలు ఈనాడు కనుమరుగయి పోయి కళాకారులు ముష్టెత్తుకునే స్థితికి వచ్చారు. కొందరు గొడుగులు, లాంతర్లు బాగు చేసుకుంటూ బ్రతకాల్సొచ్చింది

గత వైభవం కళ్ళ ముందు మెదిలేసరికి కదిలిపోయాడు వీరన్న ఆవేదనతో గుండె బరువెక్కింది కానీ తనకింకా మమకారం చావలేదు తను నుమ్ముకున్న కళపై ఈ రాత్రికి బుడంపాడు వొంతెన దగ్గర ఆట వుందని తెల్సింది ఎలాగైనా వెళ్ళాలి. ఒక్కసారి చూడాలి అవును వెళ్ళాలి. కానీ ఎలా?

మచం మీద కూర్చో బుద్ధి కాలేదు వీరన్నకి. అసహనంగా లేచి నిలబడ్డాడు. ఇంతలో గుడిసె తలుపు తోసుకుని హుషారుగా లోపలికొచ్చాడు కోటిగాడు. వాడు కూడా ఆ మురికివాడలోనే వుంటూ రిక్షాతొక్కుతూ బ్రతుకుతున్నాడు

"ఏంటి మావా! ఇంకా తొంగోలేదా! అద్సరే కోనేరమ్మ సంబరాల్లో ఆకరి రోజుగా యియ్యాల బుడంపాడు వొంతెన కాడ బొమ్మలాట పెట్టారు తెల్సా నీకు అన్నాడు కవ్విస్తున్నట్టు. వీరన్న కళ్ళు తళుక్కున మెరిశాయి కోటిగాడి రెండు చేతులు పట్టుకుంటూ "ఒరే కోటి! నాక్కూడా సూడాలని వుంది. కానీ నన్ను తీసుకెల్లే వోల్లు లేర్రా నీకు పున్నెముంటుంది నన్ను నీతో తీసికెళ్ళరా అలా సేత్తే మా కొండబాబుతో సెప్పి నీకు పట్నం నుంచి రంగుల బనీళ్ళు తెప్పిస్తాను నన్ను నీతో తీసికెల్లరా" అన్నాడు అభ్యర్థనగా

అంతే కదా! ఓవల్ రైట్ అట్టాగే తీసికెడతా మరి బువ్వ తిని రెడీస్‌గా వుండు నేను కూడా బువ్వ తిని వొత్తా" అంటూ ఈలవేస్తూ బయటికి వెళ్ళాడు కోటిగాడు

వెయ్యి ఏనుగుల బలం వచ్చింది వీరన్నకి. గుడిసె బయటికొచ్చి చల్లని నీళ్ళతో ముఖం కడుక్కున్నాడు ఆ ఆనందంలో బువ్వ తినాలనిపించలేదు చిరిగి పేలికలయిన చొక్కాకి దారంతో కుట్లేసి తొడిగాడు తలకి తుండు చుట్టబెట్టి, దుప్పటి ఒంటి నిండా కప్పుకుని, మూలనున్న చేతికర్ర తీసుకుని గుడిసె ముందుకొచ్చి కూర్చున్నాడు.

సమయం భారంగా గడుస్తోంది ఇంకొంచెం సేపట్లో ఆట చూడబోతున్నానన్న ఆనందంతో మనసు ఉరకలు వేస్తోంది వీరన్నకి ఆ రోజుల భార్యా బిడ్డలతో ఊళ్ళు తిరుగుతూ కథల చెప్తుంటే రోజులెలా గడిచిపోయేవో తెల్సేదికాదు రసవత్తరంగా కథలు చెప్పే తన తాతకి కొందరు పెద్దలు భూదానం కూడా చేశారట. అప్పట్లో జన తమ కథల కోసం ఎదురు చూస్తూ కూర్చొనేవారు పల్లెల్లో అలా ఆ మజిలీలలోనే తన భార్యని, ఇద్దరు బిడ్డల్నీ పోగొట్టుకున్నాడు తను భార్య గుర్తుకి రాగానే కళ్ళు చెమర్చాయి వీరన్నకి.

ఆలోచనలు చెదిరి వర్తమానంలో కొచ్చాడు వీరన్న బాగా చీకటి పడింది వీధి దీపం కూడా మిణుకు మిణుకుమని వెలుగుతోంది. దూరంగా ఎక్కడో భౌమని అరిచింది కుక్క ఇంకా కోటిగాడు రాలేదు. కళ్ళల్లో వొత్తులు వేసుకు చూస్తున్నాడు వీరన్న సమయం మరింత బరువుగా కదుల్తోంది ఏ అలికిడైనా కోటిగాడేమోనని తల త్రిప్పి చూస్తున్నాడు చీకటి తప్ప ఇంకేమి కనపడటం లేదు ఆదుర్దా మరీ ఎక్కువైంది వీరన్నకి కొటిగాడు వస్తాడో రాడో రాకపోతే? అమ్మో? అమ్మో! ఆట చూడలేడు ఎలా? దేవుడ్ని పరిపరి విధాల ప్రార్థిస్తున్నాడు

ఇంతలో గణగణమంటూ గంట మ్రోగిస్తూ రిక్షా తెచ్చి వీరన్న గుడిసె ముందు ఆపాడు కోటిగాడు ఆతృతగా రిక్షా ఎక్కాడు వీరన్న రిక్షా కదిలింది నెమ్మదిగా తొక్కుతూ ఏవేవో సంగతులు చెబుతున్నాడు కోటిగాడు ఊ కొడుతున్నా వీరన్న ధ్యాసంతా ఆట మీదే వున్నది ఎన్నాళ్ళయిందో ఆట చూసి

పుట్టుకతో వచ్చిన విద్య కథలు, పాటలు, మాటలు ఎలా మర్చిపోగలడు తను? భారత, రామాయణాల్లోని ఘట్టాలు, పద్యాలు ఇంకా నోట్లో ఆడుతున్నాయి వీరన్నకి

'ఒరేయ్ కోటీ! తొందరగా పోనీరా. ఆట మొదలెడతారేమో' అంటూ హెచ్చరించాడు వాడిని వీరన్న ఆతృతకి నవ్వుకుంటూ వేగం పెంచాడు కోటిగాడు మరి కొంచెంసేపట్లో రిక్షా బుడుంపాడు వొంతెన దగ్గరకు చేరింది రిక్షా దిగుతూ కోటిగాడికి కూడా చెప్పకుండా గబగబా పందిరి దగ్గరికెళ్ళాడు వీరన్న

బహిరంగ ప్రదేశంలో వున్న ఆ పందిరి, మూడు ప్రక్కలా మూసి వెనక ప్రక్కనున్న చీర మరుగు

కన్పిస్తోంది అప్పటికే జనం తెర ముందు పోగయి ఈలలు, కేకలు వేస్తున్నారు ఆట మొదలు పెట్టమని వీరన్న తెర వెనుక్కి వెళ్లాడు అక్కడ ఆటగాడు సాంబడు గడ్డిలో పడుకుని వున్నాడు సాంబడి పెళ్లాంతో మాట్లాడాడు వీరన్న సాంబడికి నిన్నటి నుంచీ మూసిన కన్ను తెరవని జ్వరమట మందులు వాడినా తగ్గలేదట

ఇంతలో గ్రామ పెద్దగారొచ్చారు సాంబడి పెళ్లాం దీనంగా సాంబడి జ్వరం సంగతి చెప్పింది ఆయనేదో గట్టిగా అరిచాడు ఆమె మరేం వట్లాడక తల దించుకున్నది ఇప్పుడెలాగ? అన్నాడాయన విసుక్కుంటూ ఆమె ఏం మాట్లాడక మౌనంగా నిలబడింది పరిస్థితి అర్థమైంది వీరన్నకి ఎలాగైనా ఆట ఆగిపోకూడదు మరుగున పడిపోతున్న ఈ కళకి తన వంతు సాయం చెయ్యాలనిపించింది ఏదో నిర్ణయానికి వచ్చిన వాడిలా ఆయన దగ్గరకు వెళ్లాడు

బాబూ! తమతో మాట్లాడాల ఇటు రండి ఎట్టి పరిస్థితుల్లోను ఈ ఆట ఆగిపోదు మీ పరువు, మీ గామం పరువూ మేం కాపాడతాం మీకు హామీ యిస్తున్నాను సాంబడి తరపున కథ నేన్నడిపిస్తాను అన్నాడు

"సరే కానీ!" అన్నాడాయన వీరన్న వంక చూస్తూ

సాంబడి పెళ్లాం దగ్గరకెళ్లి తనెవరో చెప్పాడు వీరన్న ఆమె ముఖం విప్పారింది ఏం భయం లేదని, ఆటని తాను ప్రారంభిస్తానని చెప్పాడు ఆమె చేతులెత్తి వీరన్నకి నమస్కరించింది

ఎక్కడ లేని శక్తి వచ్చింది వీరన్నకి అవును ఈ ఆట ఆగిపోకూడదు తన ప్రాణం పోయినా, ఈ కళని నిలబెట్టాలి అందరి మెప్పు పొందాలి ఈ ఆటకున్న విలువేమిటో అందరికీ తెలియాలి అనుకున్నాడు

గంట కొట్టి ఆట ప్రారంభిస్తున్నట్లు చెప్పాడు జనం నిశ్శబ్దంగా కూర్చున్నారు. హార్మనీ, మద్దెలలు మ్రోగాయి

చాలా సంవత్సరాల తరువాత మళ్లీ 'గణనాయక! గజరాజముఖ' అంటూ ప్రార్థనందుకున్నాడు తరువాత ఇష్ట దేవతలకు నమస్కరించి సూత్రధారుడిగా సభను పొగిడాడు జనం ఈలలు, చప్పట్లు కురిపించారు ఆ చప్పట్ల మోతలోని ఉత్సాహం, ఆకలిగొన్న ఆ కళాకారుడిలో నిలువెల్లా కొత్త శక్తిని నింపింది బొమ్మలను అందుకొనేటప్పుడు అతని చేతులు వణికాయి గొంతు పెంచి 'లంకాదహనం' కథ మొదలు పెట్టాడు

రామలక్ష్మణుల, అంజనేయుల సంభాషణలు, వానరయోధుల ప్రోత్సాహంతో ఆంజనేయుడు వారధి దాటటం. రసవత్తరంగా సాగిపోతుంది కథ. మధ్యలో కేతిగాడు, బంగారక్కలు వచ్చారు వాళ్ళ హాస్యంతో జనం ఈలలు వేస్తూ గోలగా నవ్వుతున్నారు

"సముద్రం దాటి లంకను చేరి సీతమ్మవార్ని



# బొమ్మలు

అశోకవనంలో కలిశాడు ఆంజనేయులు

'భద్రాద్రి పతి పంపేనమ్మా
సాముద్రము దాటితినమ్మా
ముద్రిక యిదిగోనమ్మా!" అంటూ ఆమెను నమ్మించాడు

ఇంతలో రావణుని బంట్లు హనుమని బంధించి సభలో ప్రవేశపెట్టారు. నిండైనా ఆ సభలో తన వాలాన్నే చుట్టచుట్టి పైకెక్కి కూర్చుని రావణునితో జవాబులు చెప్పాడు ఆంజనేయులు. రావణుని ఆజ్ఞ ప్రకారం హనుమ తోకకి గుడ్డలు చుట్టి నిప్పంటించారు రాక్షసులు తరువాత ఘట్టం లంకాదహనం"

వంతల వాద్య సహకారంతో విజృంభించాడు వీరన్న జనం ఉత్సాహంతో చప్పట్లు కొడుతున్నారు "నిప్పంటించిన తన తోకతో ఆంజనేయులు, తన ప్రభువు రాములవార్ని తలచుకుని, రివ్వున ఎగిరి లంకా నగరానికి నిప్పు పెట్టాడు. ఎలాగయ్యా అంటే" అంటూ వీరావేశంతో వీరన్న ఒక చేత్తో బొమ్మనాడిస్తూ, మరో చేతితో కాగడా వెలిగించి పట్టుకుని, కాలితో క్రిందవున్న బల్లను తడుతూ టకటక శబ్దం చేస్తుంటే. వంతలు ఈలలు కేకలతో డోళ్ళు, డబ్బాలు శబ్దం చేస్తుంటే లంకాదహన ఘట్టాన్ని కళ్లకు కట్టినట్టు గంభీరంగా, ఆవేశంగా చెబుతున్నాడు వీరన్న

జనం హర్షధ్వానాలకు అంతులేనట్టుంది చప్పట్లతో, ఈలలతో ఆ ప్రదేశం మార్మోగి పోయింది. అమితానందం కలిగింది వీరన్నకి

అంతే! ఊహించని రీతిలో గుండెల్లో కలుక్కుమంది నొప్పి. రానురాను అది ఎక్కువైంది గంభీరంగా పాడుతున్న అతని గొంతు సన్నబడుతూ, క్రమేపీ తగ్గుతూ ఆగిపోయింది నిలువుగుడ్లు పడ్డాయి. ఉప్పొంగిన రక్తనాళాల్లోని రక్తం, ఆవేశాన్ని దాచుకోలేక వీరన్న ముక్కుల్లోంకి, చెవుల్లోంకి, నోటిలోకి ధారగా బయటికొచ్చింది. శక్తి హరించుకు పోయి ధబేల్న క్రింద పడ్డాడు చేతిలో కాగడా దూరంగా పడింది. జనం ఆగకుండా ఇంకా చప్పట్లు మ్రోగిస్తునే వున్నారు. క్రిందపడ్డ వీరన్న పైన బొమ్మలుపడి అతన్ని జాలిగా చూస్తున్నాయి. జనం ఎవరూ అతణ్ణి పట్టించుకోలేదు. మీద పడిన బొమ్మలతో, విధి చేతిలో కీలు బొమ్మలా అచేతనంగా నేలమీద పడి వున్నాడు వీరన్న.



తెరముందు విజయవంతమైన ఆ ప్రదర్శన వేలాది మంది హృదయాల్లో చెరగని ముద్ర వేసి ఆనందాన్ని కలిగించింది.

తెరవెనుక అతని గుండె గొంతులో చిక్కుకుని శక్తి లేక శాశ్వతంగా ఆగిపోయింది.

ఏ కళల చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం!

ఆదరణలేని కళల చరిత్ర సమస్తం భూస్థాపితం! అని కొన్ని వేల గొంతులు ఘోషిస్తున్నట్టుంది అక్కడ. ◻



# దూరదర్శనం

లత

## హమ్ హిందూస్తానీ

ఏమిటో డాక్టరు తను పురుడు పోసిన ప్రతి ఇంటికీ వెళ్ళి పోట్లాడుకున్న జంటల్ని వాళ్ళ అభిప్రాయం అడిగి మీరు ఏ భాష వాళ్ళయినా హిందూస్తానీ అంటాడు ఈ విషయం మనకి తెలియనట్లు

ఈ నాటికలో అన్నీ అర్థరహితాలే – అన్నీ అపభ్రంశాలే

అశోక్‌కుమార్ బాగానే చేస్తున్నాడు గాని నాటికలో పెప్ లేదు నాకు నచ్చని నాటికల్లో ఇదొకటి

★ ★ ★

ఈ వారం మీర్జా అసదుల్లాఖాన్ గాలిబ్‌ని చూపించారు. చక్కని కవిత్వం వినిపించారు నాకు పెద్ద ఉరుదూ పరిజ్ఞానం లేదు గాని ఆయన కవితామృతం దాశరథిగారి ద్వారా ఆస్వాదించాం

అయితే బహదూర్‌షా కవిత్వం ముందు తమ కవిత్వం తక్కువనే భావంతో తమ కవితల్ని చించేయించటం గాలిబ్ మహాకవికి అవమానం ఉర్దూ కవులు ఎదటి వారి గొప్పతనాన్ని గుర్తించినప్పుడు తమ కవితల్ని చించటం సంప్రదాయం ఆ రకంగా బహదూర్‌షా గాలిబ్ కన్నా గొప్పవాడనటం నాకు నచ్చలేదు ఉర్దూ కవితా చరిత్రలో గాలిబ్‌ని మొదటి వాడిగా లెక్కిస్తారు ఉమర్ ఖయాం ఫిరదౌసీలతో సమానం అంటారు బహదూర్ షా అంతటి కవి అని ఉర్దూ సాహిత్య చరిత్ర చెప్పదు

ప్రముఖ నటుడూ గాయకుడూ అయిన కిషోర్ కుమార్ మరణం అత్యంత విచారకరం అమితాబ్ బచన్‌కి అతని పాటల వల్ల అపూర్వమైన పేరు వచ్చింది కిషోర్‌కుమార్ ఆత్మకి శాంతి కలగాలని ఈశ్వరుడిని ప్రార్థించటం తప్ప చేసేది లేదు.

## మనోరంజన్

హీరో సంతకం కాలేదని ప్రొడ్యూసరు మంచం పట్టి ఆఖరి ఘట్టంలో ఉండటం అందరూ ఏడిచిన దొంగ ఏడుపుల తరువాత హీరో సంతకం అవటం – ఫైనాన్సర్లు క్యూలో నిలబడటం ఎక్స్ట్రా కూతురు ఎక్స్ట్రాగానే ఉన్న వీటికి రచయిత మదన్ హీరో చెల్లెలు వేషం ఇప్పించటం. డిస్కో డాన్సు ఛాన్సు వచ్చిన పాత నటుడు హీరోకో డాన్సు ఛాన్సు పొంది డాన్సు చేయటం లాటి సినిమాయాలోకపు అసలు సీన్లు కొన్ని చూపారు. బాగుంది నాటకం.

## పంకజవల్లీ – పని మనిషి

రచన శైలకుమారి

పంకజవల్లీ పని మనుషులూ కూడా చక్కగా నటించారు. ఈ మధ్యలో ఇంత మంచి నాటిక రాలేదనిపిస్తున్నది.

ఒక పనిమనిషి మెట్రిక్ చదువుకున్నది టి. వి. చూస్తుంది కనుక శలవు కావాలి – మరో పని మనిషికి ఏడుగురు పిల్లలు – అందర్నీ పోషించాలి. మరో పని మనిషికి చుట్టాలు గొప్పవాళ్ళు- అందుకని రహస్యంగా వచ్చి చేసి వేడి వేడి అన్నం తిని ఫ్రిజ్‌లో మిగతాది పెట్టి వెడుతుంది. ఉద్యోగినులైన ఆఢవాళ్ళకి అదనపు చాకిరీ ఉంటుంది. పని మనుషులు దొరకరు. ఇది ఒక సమస్య.

## మాల్గుడీడేస్

స్వామి. ఆర్ కె. నారాయణ్ తన మాల్గుడి సృష్టికి ముందే స్వామి – హిజ్ – ఫ్రెండ్స్ వ్రాసిన గుర్తు కాని ఈ కథా మాలికలో ఇది కూడా చేరి మనల్ని సంతోషింప చేస్తున్నాడు.

జట్కావాలా అతని కొడుకూ స్వామికి ఇంద్రజాలం బంగారం చేయటం లాటివి నేర్పుతామని డబ్బు కాజేస్తారు ఆ డబ్బుల కోసం స్వామీ అతని స్నేహితులూ ప్రయత్నిస్తారు. కాని వాళ్ళు రౌడీలు . అందుకని స్వామికి భయం స్వామి వేసిన మంజు అనే కుర్రాడు, తండ్రి వేసిన గిరీష్ కర్నాడ్ కన్నా బాగా నటిస్తున్నారు. ఈ సీరియల్ బాగుంది.

## స్త్రీ

నాటిక – రచన శ్రీధర్ కేసర్ గౌడ అలా చదివాను – టైటిల్సు అసలు చదవలేం తొందరగా తీసేస్తారు. మద్రాసులో సుందరాంబాళ్ అనే లేడీ వెల్డర్ ఆర్థికంగా నిలదొక్కుకుని పెద్ద కుటుంబాన్ని పోషించిన కథ ఏడుగురు పిల్లల తల్లి ఈమె వెల్డింగ్ షాపు ద్వారా సంపాదనాపరురాలవుతుంది కథ బాగానే ఉంది గాని – ఏమిటో సౌకుమార్యం లోపించింది . భారతీయ స్త్రీలో నా శాంతం' పాపం

## దేశంలో ఈ రోజు

రాజా రవీ అనే నిరుద్యోగుల బుర్ర లేని పన్నే ఈ నాటకం ఈ తడవ భోజనం కోసం హాస్పిటల్లో చేరాలని ప్రయత్నించి – పిచ్చి ఆస్పత్రికి చేరతారు అందులో ఒకడికి నిజంగా పిచ్చి పడుతుంది ఇంత కంటి పనికి మాలిన అకటావికటపు అధ్వాన్నపు నాటిక మరొకటి లేదు. సుప్రభాతం లాటి నాటకాలప్పుడు పోయే .. ఆ మాట కొస్తే రోజా పోయే కరెంటు ఈ రోజు పోలేదు అది మన దురదృష్టం. □




Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada . 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667

(30వ పేజీ తరువాయి)

## భార్గవ్ ఆర్ట్స్ "మురళీకృష్ణుడు" మూడో షెడ్యూల్

"డిసెంబర్ 4 నుంచి 25 వరకు జరిగిన షెడ్యూల్‌తో టాకీ భాగం పూర్తయింది. జనవరిలో పాటల చిత్రీకరణతో మొత్తం షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ఎస్. గోపాలరెడ్డి. ఈయన నిర్మిస్తున్న భార్గవ్ ఆర్ట్స్ "మురళీకృష్ణుడు" చిత్రంలో నాగార్జున, రజని, మోహన్‌బాబు, గొల్లపూడి మారుతీరావు, రమణ, ఏచూరి, చిడతల అప్పారావు, మాప్పూరు జానకి, వై. విజయ, అనిత, కుయిలీ, చంద్రిక పాత్రధారులు. గణేష్‌పాత్రో, సి. నారాయణరెడ్డి, కె. వి. మహాదేవన్, కె. ఎస్. హరి, కొండవనేని పెదరామలింగేశ్వరరావు, సాహుల్, శివసుబ్రహ్మణ్యం, రావుశ్రీ, మద్దు, కృష్ణప్రసాద్, ఎం. రంగారెడ్డి, సి. వెంకటేశ్వరరావు, కె. సత్యం ప్రభృతి సాంకేతిక వర్గంతో కోడి రామకృష్ణ దర్శకుడు.

## రాఘవేంద్ర సినీ క్రియేషన్స్ మూడవ షెడ్యూల్

"పూర్తి వినోదాత్మక చిత్రం. నవంబర్ 23 నుంచి 30 వరకు రెండో షెడ్యూల్ జరిగింది. మూడో షెడ్యూలును డిసెంబర్ 14 న ప్రారంభించాం." అన్నారు కోడి రామకృష్ణ. ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో రాఘవేంద్ర సినీ క్రియేషన్స్ అధినేత కందేపి సత్యనారాయణ నిర్మిస్తున్న తాజా చిత్రంలో శోభన్‌బాబు, రాధ, గొల్లపూడి మారుతీరావు, సత్యనారాయణ, రాజా, చలపతి కృష్ణారావు, భీమేశ్వరరావు, హరిప్రసాద్, విశ్వేశ్, ఏచూరి, రమణ, గరగ, పూర్ణిమ, వై. విజయ, వనితశ్రీ, అన్నపూర్ణ పాత్రధారులు. గణేష్‌పాత్రో సంభాషణలు, రాజ్ కోటి సంగీతం, వి. సురేష్ ఛాయ, కళాధర్ శిల్పం, గాడ సత్యం – కోడి వెంకటరమణ ప్రొడక్షన్, రామానుజం సంయుక్త దర్శకత్వం, జనార్దనరెడ్డి – నాగేశ్వరరావు సహకార దర్శకత్వం. కె. సత్యం కూర్పు నిర్వహిస్తున్నారు.

కత్తితో గడ్డం గీసుకుంటున్నారు- సినిమా ఫ్లాప్ అయిన సంగతి ఆయన కప్పుడు చెప్పొద్దు!

హీరో వెంకటేష్ (ప్రముఖ నిర్మాత శ్రీ డి. రామానాయుడు కుమారుడు) వివాహం డిసెంబర్ 13న మద్రాసులో వైభవంగా జరిగింది. చి. వెంకటేష్‌ను చి. సౌ. నీరజను అగ్ర నటుడు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు ఆశీర్వదిస్తున్నప్పటి ఫోటో

## ఎం. వి. రఘు దర్శకత్వంలో "కళ్ళు"

"మానవుడికి మామూలు కళ్ళే కాదు, మనోనేత్రం ఎంతో అవసరం. కళ్ళున్న కబోది కన్నా క్రూరుడు మరొకడుండడు. మనో నేత్రం ఉన్న అంధుడు అంధుడు కాదు అనే ఇతివృత్తంతో శ్రీ గొల్లపూడి మారుతీరావు రచించిన 'కళ్ళు' నాటిక ఎన్నో చోట్ల విజయవంతంగా ప్రదర్శించబడడమే గాక సాహిత్య అకాడెమీ బహుమతి పొందిన విషయమిదీ సర్వవిదితమే. రెండు క్రొత్త పాత్రలు పాత్రికేయుడు, ప్రచురణకర్త సృష్టించి, సినిమాకు అనుగుణంగా మలిచాం. ఈ ప్రయోగాత్మక చిత్రాన్ని రూపొందించడం సాహసమే అయినా పట్టుదలతో రంగస్థలానుభవం గల కళాకారులతో తెరకెక్కించడానికి నిశ్చయించాం. విశాఖపట్నం పరిసరాలలో డిసెంబర్ 10 నుంచి జనవరి 5 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది. మార్చి విడుదల," అన్నారు ప్రముఖ ఛాయాగ్రాహకుడు ఎం. వి. రఘు. ఈయన స్క్రీన్‌ప్లే, ఛాయాగ్రహణం, దర్శకత్వంలో డి. విజయకుమార్, ఎ. ఎల్. ఆనందరావు నిర్మించే మహా శక్తి ఫిలిమ్స్ వారి ప్రథమ చిత్రానికి ఎం. వి. ఎస్. హరనాథరావు సంభాషణలు, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీతం, నారి శిల్పం, జి. వి. వి. సత్యనారాయణ సంయుక్త దర్శకత్వం, ఎల్. సత్యానంద్ సహకార దర్శకత్వం. డి. సత్యం ప్రొడక్షన్, ఎం. వెంకట్ నిర్వహణ. అనిల్ మల్నాడ్ కూర్పు ఇతర ముఖ్య హంగులు.

# శత చిత్రనటి సుమలత సమాధానాలు



**కొండా కృష్ణవేణి, జమ్మికుంట**

ప్ర : మేడమ్! 'వివాహం' అనగా మీ నిర్వచనమేమిటి?

జ : అదొక గ్రంథం అనుకుంటే, అందులో మొదటి ప్రకరణం పద్య రూపంలోనూ, మిగతా ప్రకరణాలు గద్య రూపంలోనూ రాయబడి ఉంటాయి.

**ఎ. ఎస్. కుమార్, విశాఖ-2**

ప్ర : అందరూ అబద్ధాన్ని నమ్మేంత సులువుగా నిజాన్ని నమ్మరు. ఎంచేత?

జ : అబద్ధం తియ్యగా ఉంటుంది గనుక.

**సి. ఎం. ప్రహ్లాద, పెనుగొండ**

ప్ర : మేడమ్! నన్ను ఇంజినీరింగ్ చదవమంటారా, లేక ఎం. బి బి ఎస్ చదివి డాక్టర్ అవమంటారా? మీ అమూల్యమైన సలహా ఏవిటంటారు?

జ : ఏదైనా చదవండి. కాని. ఇంజినీరింగ్ చదివి వైద్యం మాత్రం చేయకండెం!

**పి. సాయికృష్ణ, నెల్లిమర్ల**

ప్ర : నాకు తెలియక అడుగుతాను గాని. అసలు కొందరు ఎందుకు ఒట్టు పెడతారండీ?

జ : అన్నీ సులభంగా నమ్మించడానికి.

**జమ్మి పాండురంగారావు, ముక్తేశ్వరం**

ప్ర : లతగారూ! మీరు ఎవరెవరి ప్రశ్నలకో జవాబులిస్తున్నారు గాని, రెండు నెలల క్రితం నేను పంపిన ప్రశ్నకు మీరింత వరకు జవాబివ్వలేదంటే ఏమనుకోవాలి? జవాబివ్వడం మీకు చేత కాలేదనుకుంటాను. ఏమంటారు

జ : అంతేలెండి. అందని ద్రాక్ష పుల్లన... కదా?

**ఎస్. ఆర్. కృష్ణవేణి, ఏలూరు**

ప్ర : నా ప్రశ్నకు ఒక చక్కని జవాబు 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'లో దొకినందుకు నేనెంతో ఆనందిస్తాను మరి మీకేమిటి ఆనందం?

జ : నేను జవాబివ్వడానికి ఒక చక్కని ప్రశ్న దొరికినందుకు అంతకన్నా ఎక్కువగా ఆనందిస్తాను.

**కె. జానకీరాణి, గుణుపూరు**

ప్ర : ఏమండోయ్ ఒక అతి క్లిష్ట... అడుగుతాను. మీరు జవాబివ్వగలరా... భూమ్యాకాశాల మధ్య దూరమెంత?

జ : దూరమెక్కడుంది? ఎక్క... అంతమౌతుందో – అక్కడ్నుంచే ప్రారంభమవుతుంది.

**పి. లక్ష్మీనరసింహస్వామి, కె. కొత్త...**

ప్ర : మానవుడికి మృత్యువనేది లేకపోతే ..

జ : ఏ చుట్టమో మరణించాడని ఆఫీసులో సెలవు తీసుకో... వీలుండదు... కదూ?

**పాయక గౌరీలత, ఖమ్మం**

ప్ర : సినిమాకు నిజ జీవితానికి తేడా ఏవిట...

జ : సినిమాకు మధ్యలో '... ఉంటుంది. జీవితంలో ఒకేసారి ... ఉంటుంది.

**కె. శివకుమార్, టంగుటూరు**

ప్ర : నేటి శాస్త్రజ్ఞులు వివిధ రకాలైన ... కనిపెడుతున్నారు గాని, ఈ కరువు కాటకా... కల్గకుండా మాత్రలు కనిపెట్టవచ్చుగా?

జ : జనాభా పెరగకుండా వ... కనిపెట్టారుగా?

**కె. సాజన్, గాజులరేగ**

ప్ర : సుమలతగారూ! మీరు ఏమీ అన... నేనో ప్రశ్న అడుగుతాను. మా ప్రశ్నలకు ... ఎక్కువా, లేక మీ జవాబులకు విలువ ఎక్కు...

జ : అడిగారు గనుక చెప్పాల్సొ... ఓ విధంగా చూస్తే నా జవాబులకే... ఎక్కువ అని చెప్పాలి. ఎలాగం... మీరు 15 పైసల కార్డుకు ... అంటించి పంపిన ప్రశ్నకు నేను 2 ర... పైసల ఖరీదు చేసే పత్రిక ... సమాధానమిస్తున్నాను. కాదంటా...

గమనిక ఈ వారం ఉత్తమ ప్రశ్నగా ఏదీ కాలేదు

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న.......................................................................

.............................................................................

.............................................................................

పంపినవారి పేరు.......................................................

పూర్తి చిరునామా.......................................................